# తెలుగు వారి ఆది చరిత్రము

## ప్రథమాశ్వాసము - ఆదిఖండము

### ఇష్టదేవతా స్తుతి

శా॥ శ్రీరామా కరకంకణ స్వనమున్ జిత్తంబు రంజిల్ల, సిం
ధూరాంచత్కమలా లలాటపద కస్తూర్యంకి తాంఘ్రిద్వయిన్
క్షీరాంభోనిధి బవ్వళించి, త్రిజగత్ క్షేమ స్థితుల్ గూర్చు స్వ
ర్ణ తేజుం డగు విష్ణు డిచ్చు మనకున్ నిత్యేప్సితార్థంబులన్.

శా ర ద

మ॥ మును విశ్వామిత్రపేర మంజు మృదు లాపూర్వస్ఫుటత్ కాక లీ
స్వన మాధుర్యముతో జనించి, పవనన్ సమ్మంద్ర తారోచ్చమై
వినదింపెన్ స్వరసప్తకం బగుచు, వాణీ హస్త వైపంచికా
ధ్వని కీన్ మాతృక నాదినిద్ద; యది కాపాడున్ సదా మమ్ములన్.

త్రి మూ ర్తు లు

క॥ శ్రీ, వాణీ గౌరీయుతులౌ లే విష్ణు బ్రహ్మలు శివుడున్ విశ్వ శ్రే
యోవాప్తికరులు, వారిని నే విశ్వాసమున గొల్తు నిర్మల భక్తిన్.

మ హా వి ష్ణు వు

సీ॥ పాలపాథోధి యప్రాకృతాకారంబు,-కాంతోదర మనంత కాల లహరి,
బ్రాహ్మేంద్రామరవరావు ప్రాహ్మంతంబు, పంకజభవత్ప్రభుశక్తి భాగ్య లక్ష్మి
అఖిలనిర్వాము నీ మహాకాశ, మంబుధి-నీలిమ నీ మహాభీలకాంతి,
నీ శుభాంగము జగన్నిఖిలంబు, శయనంబు-తత్కాంతి, రక్ష నీ తిర్మ కములు.

గీ॥ దైవ, నిను, విష్ణు, భవభయహారు, సురేశు, యోగిహృద్ధ్యానగమ్యు, నచ్యుతు, ననంతు
సర్వలోకైక నాథుని సన్నుతింతు, నిపుడు సఫలంబు చేయ మదీప్సితములు.

ల క్ష్మీ దే వి

చ॥ చెలువపు లేగులారెనిగ మ్మొగము మోమున గుంకుమంపు కెం
దిలకము దాల్చి, తమ్మివిరి తీరయి చెంగటు చేర్చైన క
న్నుల గొనకన్ గృపామృత, మనూన నిజాష్టకర ప్రకాండ దో
ర్బల శరణం బొసంగెడు వరప్రద నిందిర గొల్తు, భార్గవిన్.

తే॥ అట్టి ఋషి [redacted]న మంది కనిరి । తరతరమ్ములనభివృద్ధి ధాత్రి జనులు
సర్వనవ, పూర్వ, భావి విజ్ఞాన దాతృ కోటి మణి మాలలకు'యోగి కొలికి పూస.

తే॥ అట్టి యోగుల నుత్తము । డార్ష యోగి । రాజగోపాలరావను ప్రథితయశుండు
సరళ శ్రీ వత్స సద్గోత్ర సంజనితుండు, । వేకుమల్లా న్వయుండు మత్పితయు గురువు

తే॥ పదియునెన్మిది నూర్ల ముప్పదియు నెన్మి దైన శాలివాహన శకహాయనమున(క్రీ.శ.191(
విజయదశమి నాఁడా తఁడు వెలయ చేసె । మహిత సంఘం బునార్ష సమాజమనఁగ

తే॥ అతుల విజ్ఞాన బుద్ధి బలాఢ్యు నతని, । శిష్య పరివేష్టితుండయి చెలఁగువాని,
విబుధ గౌరవ మందిన విదిత యశుని, । సాంద్ర సద్భక్తి నమ్మది సన్నుతింతు॥

జనకుండు

శా॥ శీల శ్రేష్ఠుని గొల్తు మజ్జనకునిన్ జిత్తాబ్జమున్ లేఖినీ
నాళాగ్రంబున గూర్చి, స్నేతకరమందారంబులన్, రక్తిన
గ్గాళిన్ జేసి, కవిత్వ ధార నభిషేకార్చల్ సమర్పింతు, వా,
క్పాళిన్ హారతులెత్తి; ధూపగతిరేగన్ భావ సౌగంధముల్

తే॥ తెలుగువారి ప్రాచీనత వెలువరించి, । ఆంధ్రులనుహోన్నతిం జెల్పి హర్షమంది;
ఆంధ్ర పౌరుష భాగ్యోన్నతాభివృద్ధి । తన మహాలక్ష్యమైన నా తండ్రి గొలుతు॥

తే॥ వేకుమల్లాన్వయుని బృహద్ధీవిశాలు । వినయమూర్తిని విజ్ఞాన ఖనిని, శాంతి
సాత్వికాబ్ధిని, సరసవచః ప్రపూర్ణు । రాజ గోపాలరాయని । ప్రథిత భక్తి॥

సీ॥ గుత్తిలో ప్లేగు ముంచెత్తి పోసిననాఁడు । సంఘసేవాదీక్ష సంఘటించి ।
యుద్ధమల్లుని శాసనోక్తులక్షరలని । పండితాళికిఁజెల్పు ప్రౌఢి మెఱసి ।
ప్రాచీన దక్షిణ భాష తెలుగయని । నిర్ణయంబొనరించు నేర్పుగూర్చి ।
శాస్త్రజ్ఞులరి, భాషా తత్త్వకోవిదా । ద్యున్నత బిరుదంబులొసగ మెచ్చి.

తే॥గీ॥ జలధులు, గమించి, ఖండాంతరలదు కొన్న । క్షితి విజయలక్ష్మి మా తండ్రి కీర్తిలక్ష్మి
ప్రజల సేవకు శక్తులర్పణము చేయు । నీయుతై తేలనింక కొన్నేళ్లు బ్రతుకు ?

వ॥ క్రీ॥శ॥ 9-7-1876 న తూర్పు గోదావరి జిల్లా పెద్దాపురమున జన్మించిన మా జనకుడు, క్రీ॥శ॥ 1910 లో ఆంధ్ర సరస్వతీ గ్రంథమాలను స్థాపించి 1913 లో దక్షిణభారత భాషాపరిశోధనా సంస్థ (South Indian Leterary Research Institute) ను చెన్నపురిలో నెలకొల్పి "Comparative Prosody of Dravidian Languages" అను ఇంగ్లీషు గ్రంథమును రచించి, ఉన్నత కీర్తినార్జించెను. క్రీ॥శ॥ 1918లో ఆ సంస్థను పునర్వ్యవస్థీకరించి "South Indian Research Institute" అను నామకరణ మొనర్చెను, యీ పిమ్మట

"South Indian Research" అను ఇంగ్లీషు మాస పత్రికను కూడ నడపెను. మద్రాసు విశ్వవిద్యాలయమున తెలుగు భాషలలో, గౌరవ రీడరుగా (Reader) నుండి కొన్ని పరిశోధనా వ్యాసములను రచించి, ఉపన్యసించెను. తమిళులతోడను, ఇతరులతోడను తెలుగువారిని పోల్చి చూచి తెలుగు వారి నేటి దీనావస్థను గమనించి, దానిని దొలగించుటకై యెన్నో గ్రంథములను రచించి ప్రచురించుటయే గాక, క్రీ॥శ॥ 1937లో "ఆర్ష పత్రిక" అను మాసపత్రికను ప్రారంభించి, మరణించు వరకు, (8-12-1988) నడపెను. జపాన్ దేశమున నెల్లనాళ్లను, ఇంగ్లాండు దేశమున, ఆఱు మాసాలును నివసించెను.

సే॥సీ॥ తెలుగు కన్నడ మలయాళ తుళు తమిళము । లార్యవాగ్వ్యాప్త శాఖగా నందలోక్క-
ప్రజగ పరిశోధనలొనర్చి ప్రతిభగాంచి । వివిధ జాతులుపుట్టిన విధము తెలిపె॥

ద్విపద॥ఆంధ్రుల జననంబు, నాంధ్రుల కథలు । ఆంధ్రుల చారిత్రకాది విషయములు
తెలుగుల పుట్టుక, తెలుగుల రాక । తెలుగుల కథలు లెన్నో తెలిపె మా తండ్రి ।
బహు పరిశోధనా ఫలితంబులైన । బహుళ ప్రయత్న లబ్ధములైన కథలు
తెలిపె శిష్యులకు నా దివ్యపురుషుడు । నెలమినిదెలిపెద నేనందుఁగొన్ని ।
నానూన్న పరిశోధనా ఫలంబులను । వానితో గల్పి వ్రాయుచున్నిందు ।

మధ్యాక్కర॥వాలాయముగ ప్రజా దైవ - బలములు గూర్చి దీవించి,
నాలోని నిద్రాణ నిబిడ - నానా మహాశక్తి తతులు,
మేలుకో, జేసి నా మదిని - మెదిలెడు కోరు-లీడేర;
పాలింపుమో ! తండ్రి ! జయము ప్రాప్తింప । జేసినా కెపుడు॥

కావ్యావతరణము - సరస్వతీదేవికి విన్నపము

శా॥ తల్లీ విన్నపమాలకింపుము, భవత్కారుణ్యసం సిద్ధి నే
నుల్లేఖింపగ, నాగభూమను పవిత్రోదంతమున్, గొప్ప ల
త్యుల్లాసంబున బండితుల్ కవులు కీర్త్యుక్తుల్, సుమోద్వ్యాప్తిగా
జల్లన్ గోర్కె జనించె, జాతి కథ ప్రజ్ఞా ప్రౌఢిలేఖింపగన్॥

వ॥ తెలుగుజాతి పూర్వకథ యెట్టిదన :-

మ॥ జనియించెన్, వాలినార్యజాతి, సురవృక్షంబట్లు; తచ్ఛాఖగా
కనకాద్రిదిక్కున । బుట్టి 'లింగవని' లో గాలూని, నేపాళ మం
దు, నివాసంబునకున్, తెలుంగముఁడు నాథుండై, మమున్ దేర మే
దిని, వ్యాపించి; తెలుంగుజాతి, ఉదయాదిత్య ప్రభాతుల్యమై॥

మ॥ తన సంస్కారమొసంగి, వేదములకుద్యత్ప్రాప్తి । జేకూర్చి; ప్రా
క్తన గీర్వాణముతో తెలుంగు జనవాగ్జాలోరు సమ్మేళనన్,
మొనయంజేసెను 'సంస్కృతంబు' పగ నిర్మూలించి, యీ భారతా,
వని, నేకంబొనరించి; స్వీయ గుణవిద్యాద్బాహుశక్త్యుక్తులన్॥

సీ॥ తెలుగు నాయకుడౌచు, దేజరిల్లిన యాంధ్ర । విష్ణుభ్రాజిష్ణు నిశుంభు విక్రమంబు ।
మగధరాజ్యమును సంపాదించె శ్రీముఖు । దసిమొన నిల్చి కణ్వుని జయించి
బాల భారత భూమి శాలివాహనుడేలి । కీర్తిగాంచెను శక కర్తయగుచు ।
నేపాళమాంధ్ర రాజ్యాపార భుజిఁజేర్చె । ఘనుడు మంజు శ్రీయఖండనిష్ఠ ।

తే॥ పతులమగుచు మున్నూఱేండ్ల క్రీస్తుమువరకు । ప్రకటమయ్యెను తెనుగుల బాహుశక్తి
దానికెనయగు ధీశక్తి, జ్ఞానశక్తి । ఏమియయ్యెనో! యిపుడవి యెఱుగరాదు ।

వ॥ శాతవాహన, పల్లవ, ఇక్ష్వాకు విష్ణు కుండిన, బృహత్పాలాయన, చాళుక్య గాంగ,
చోళ, కాకతీయ, రెడ్డి, వెలమ, సాళువ, తుళువ, గజపతి, నాయకాది రాజవంశములకును
చాణక్యభట్టు బాణ, యుగంధర, తిక్కన, తిమ్మరుసు, అక్కన, మాదన, రాయణ
మొదలగు, మహామాత్యులకును, అమరసింహ, అపస్తంభ, నాగార్జున, కుమారిలభట్ట,
విద్యారణ్య, వల్లభ, రామానుజ, పండితారాధ్య, పండితత్రయాది విజ్ఞాన మూర్తు
లకును; అమరావతి, కంచి, విజయపురి మహాబలిపుర, శ్రీశైల, లేపాక్షి, మొదలగు
ప్రదేశములను, నేత్రపర్వముగా దీర్చిదిద్దిన శిల్పవేత్తలకును, అజంత, ఎల్లోర మొ॥
తావులను నయనోత్సవకరములనుగా రూపొందించిన చిత్రకారులకును; కాళిదాస,
నన్నయ తిక్కన, ఎఱ్ఱన, నాచన, సోమన, సోమనార్య, శ్రీనాథ, భాస్కర. రామ
కృష్ణ, సూరన, పెద్దన, తిమ్మన, మారన, ధూర్జటి మొ॥మహాకవులకును; త్యాగరాజాది
సంగీత సార్వభౌములకును, సిద్ధేంద్రాది నృత్యాగమశిఖామణులకును కన్న తల్లియైన
తెలుగుజాతి, మున్నూఱేండ్లుగా, నిర్వీర్యయై నిద్రాణయై, కళలుడిగి, ప్రాంతగత, వ్యక్తి
గత పరస్పర వివాద భూయిష్టయై, అంతఃకలహములతో ముక్కచెక్కలై, తన నేలను,
తన ప్రజలను రక్షించుకొనజాలక ప్రాతి ప్రాత శకలము కంటె నలుసై, పూచికపుల్ల
కంటె హీనయై స్వార్థపరులచేతిలో కీలుబొమ్మయై, తన దుస్థితికి విలపించుటకైనను
శక్తిలేక, డిల్లవోయి కనులప్పగించుచు నిట్టూర్చు జడస్థితిలో పడియుండుటెట్లు
దాపురించెనో యెఱుంగరాదు గదా !

ఉ॥ ఈ దయనీయ దుస్థితి దహింపగ మత్పిత, నెమ్మనంబు నాం
ధ్రోదయ మాస జేసి. కడునుత్తమ పుస్తకముల్ రచించె; నా
వేదనతోడ; నట్టి తతి ప్రీతికరంబుగ, గాంచె కోయగా
థాదులలో తెలుంగుల ప్రయాణము రాకయు, భారతోర్వికిన్

ఉ॥ పూర్వచరిత్ర శోధన మపూర్వ విశేషములెన్ని యోమనః
పర్వమొనర్చి స్పష్టపరుపన్, పలుభాషల శబ్ద గాథలన్,
చర్విత చర్వణంబులయి, చక్కని పోలికలొప్ప, నీ జగత్
పూర్వచరిత్ర విచ్చుకొని ముందటసిల్చెను బర్హిఫించమై॥

కం। నా పరిశోధన ఫలితము । లీపరిశోధనల ఫలము లెక్కువ చేయన్
రూపముగొని తెలుగుల పూ । ర్వాపార చరిత్రమతులితాసక్తిదమై॥

వ॥ ఈ చారిత్రికైతిహాసము :-

తే॥ తెలుగు జనులకు దమశక్తి తెలియజేసి । ఆత్మవిశ్వాస ధైర్యసాహసములిచ్చి ।
కలిసికట్టుతనంబును గలుగజేసి । కార్యసాధన నైపుణ్యకారి యగుత.

మ॥ అనియారంభమొనర్చితిన్ రచన, నీయౌదార్య విజ్ఞాన వా
హినులాకాశ సరిన్నిభోద్గ మన సాహిత్య ప్రవాహంబులన్,
జననంబందగ జేయునన్న దృఢ విశ్వాసంబునన్, భారతీ !
మును త్రిస్రోతకు జన్మమిచ్చినటులంభోజాత హస్తాంబువుల్॥

వ॥ కావున

మ॥ భవదావేశమునించి, మత్కర మనోవాక్పాళి. సాగింపు మీ
కవితోచ్చైశ్శ్రవ మోహనప్లుతము, నాక్ష్మాభృద్గరుద్వారి వా
సపు పోల్కన్ హరియింపుమీ తెలుగుల స్వార్థాద్యభాగ్యంబులీ
నవకావ్యోదయశక్తి, వజ్రమహిమన్, నాళీక సింహాసనా !॥

మ॥ వినుమో ! వాక్పతి ! నా కవిత్వ రచనన్, విజ్ఞుల్ గడున్మెచ్చనే
గనుగొంటిన్ నిజ దివ్యశక్తి; నిక నాకర్తవ్యమూహించి, మ
న్మనమందెంచితి; భక్తి దాని నొనగన్, మద్భాషకున్ జాతికిన్,
వినయాత్మన్, జనసేవలక్ష్యముగ, హృద్వ్యథిన్ సుభావంబునన్॥

ఉ॥ వేద పురాణముల్, వివిధ విశ్రుత గాథలు సాంప్రదాయ మం
దాదరణీయమై, నిలిచి ఆంధ్ర వసుంధరయందు, 'గాండు' ధా
త్ర్యాదుల యందు, వ్యాప్తమయి, ఖ్యాతినిగన్న కథేతిహాసముల్,
రోదసిమర్మముల్ గలిపి, రూపము దిద్దుదు గావ్యగాథకున్॥

## సరస్వతి దేవికి అంకితము

వ॥ తల్లీ ! సరస్వతీ దేవీ ! ఈ కావ్యమును నీకు :

ఉ॥ అంకితమిచ్చితిన్, గొను ! సుహాసముఖంబును, మోదమూన సం
బంతుర మయ్యె నీకనుచు నాత్మ నెఱింగితి, బ్రహ్మాణి ! రో
పంకజ పీఠ ! యీ రచన బంధుర కీర్తి, మహోన్నతత్వమున్,
పొంకపు సజ్జనాదరణ, పొందువరమ్ముల నిమ్ము ! భారతీ !॥

శా॥ తల్లీ ! పుస్తకపాణి ! వాగ్జనిత విద్యాశ్రేణి ! గీర్వాణి ! సం
ఫుల్ల శ్వేత పయోరుహాసన ! కళాపూర్ణేందు బింబాననా !
ఉల్లాసార్యకవీంద్ర పండిత మయూరోత్సాహకోద్వల్లకీ
సల్లాపామృతపాన వర్ధిత జగత్స్రష్టా ! నమోవాకముల్ ॥

## షష్ఠ్యంతములు

ఉ॥ సుందరమందహాస నవ శోభల ధైర్యముగూర్చి, పేర్మి నా
కందిన పల్కువ్రాలు జపయందు కవిత్వపు మూడు పాయలం
దందముగా బిగించి, వినయంబున గొల్చెడు నాకు వాగ్య శో
బృందము సాదరంబున నభీష్టవరంబుగ నిచ్చువాణికిన్ ।

శా॥ ఈ కావ్యంబు రచించు వేళ, మది దానెల్లప్పుడున్ నిండి, స
త్సాకంబున్ బచరింపఁజేసి, నిరతోత్సాహంబునన్ సత్పదా
నీకంబున్ సమకూర్చు దేవికి, లసన్నీరేజ పీఠస్థకున్,
రాకాబ్జానన కిందువర్ణకు, జగద్రక్షార్థి గీర్వాణికిన్॥

క॥ సాయాహ్నపుటధి దేవత । కాయత విజ్ఞాత శోభితాబ్జాంబకకున్ ।
వేయివచస్సు ముదాయము । లీయిల భాషలుగ దిద్దు నిందువదనకున్ ॥
నవవిజ్ఞానము నిత్యము । దివిషద్ధుని భువికుఱికెడు తీరున వెలయన్ ।
దివురు సతి కంచ తేరె । క్కవిధాతృ సతికి, నవసుమ కోమల తనుకున్ ॥
సృష్టించి జగతిని చతు । ష్షష్టి కళలు, సాహితియును సంగీతంబా
యష్టాదశవిద్యలు సుమ । వృష్టిగ గురియించునట్టి వెలదికి నీకున్ ॥

క॥ సావిత్రిగ, గాయత్రిగ, ధీవిభవా ! శ్రీ సరస్వతీ ! మా పూజల్
నీవను నిత్యముగొని మము । దీవింతువు తల్లి; వట్టి దేవికి నీకున్॥

వ॥ భక్తిపూర్వకంబుగా నంకితముగ సమర్పితమైన యీ కావ్యమునకు కథాక్రమం బెట్టిదన

## -: కథా ప్రారంభము :-

శా॥ శ్రీశుండా ద్యుఁడ నంతు డచ్యుతుఁడు భాసింపంగ, నవ్యాకృతా
కాశంబందున కోటి సూర్యుల మహాకాంతిచ్ఛటల్ చిమ్మ యా
యాశావ్యాప్తముగా, నటన్ ప్రకృతిడాయన్ వచ్చె; నందుండి, త
న్నాశన్ జూచుచు ముక్తికై, పరగె జీవానీకముల్ దుస్థితిన్॥

తే॥ వారిలో 'రమ' యర్హతన్‌బట్టి ముక్తి । వెంటనే యిచ్చె, విష్ణువాపిదప, నర్హ
జీవియగు 'బ్రహ్మ' నేర్పర్చె; జీవులెల్ల । స్వీయసాధనచే ముక్తినందు నర్హ
తనబడయుటకు సృష్టిమొదలిడ నతఁడ । జాండము సృజించె; తారకాద్యఖిలయుతము
అమల మవ్యాకృతాకాశమనెడు చోట । బరగు నీయ జాండము విశ్వ భాగమగుచు॥

## 'గురు' గోళా విర్భావము :-

చం॥ అలరె మహాంతరిక్ష హృదయంబున । పావక మండల ద్వయం,
బలఘనఖగోళ మగ్నియయి 'అంగిర' నాఖ్యధరించె; చిన్న గా
జ్వలనఖగోళ, మంగిరస వహ్ని జనించి, ద్రవంబు ధూమమున్
గలిసిన గోళమై యొసగి కాంచె మహోన్నతి నాకసంబునన్॥

వ॥ అది గురుగ్రహముగా ప్రసిద్ధమై, పదియు మూఁడు నుపగ్రహంబులుకలదియై, యిప్పుడు భూమికి ఆఱుకోట్ల యిరువదియైదు లక్షల యోజనముల దూరమున గలదు; అనాఁడు భూమి సూర్యుఁడు, నితర గ్రహములు పుట్టనేలేదు.

తే॥ పదిఁయుమూఁడుపగ్రహముల వరుసయందు । 'తార' యను నుపగ్రహమొండు పెద్దగుగ్ర
హమును జుట్టుచునుండె; విహాయసమున । తరుణ యౌవన దేవతాప్సరసవోలె॥

తే॥ తార, తిరుగాడ, పూబంతి తళుకులొలుక । రమ్యమయ్యె గురు గ్రహప్రాంగణంబు ।
పసుపు పూసిన పండుగ వాకిలట్లు । ప్రసవ లలిత నందన చైత్ర రథములట్లు॥

## చంద్రుని జననము :-

వ॥ ఆ అమహాంతరిక్షమున మఱియొకచోట 'పాల సముద్రము' కలదు.

ఉ॥ అంబుజనాభు తోడ । కమలాలయ చేయు వివాహ వేళ ది
వ్యాంబర ధారణన్ మెఱయు నంచిత మంటపతన్వివో లక్ష్మి
రాంబు ధినేత్రపర్వమయి, ఆకసమందున గోచరించు నీ
లాంబర తారకల్ పరిణయాగత దేవగణంబు బోలగన్॥

వ॥ ఆకాశమునందలి తారలలో స్త్రీ పుంనపుంసకములను మూడురకముల గోళములు గలవు

శా॥ తారానేక సహస్ర గర్భయగు తత్పాథోధిదుగ్ధంబులా
తారాకాంతులె; తద్విలోల తలలన్, తద్వార్ధియందొక్క నా ।
డారంభించెను తీవ్రకంపమది పెద్దై యబ్ధి నొండొంటితో
జేరన్ తారలు కొన్ని రూపమును దాల్చెన్ జంద్రగోళంబుగా॥

తే॥ అంతగొన్నేళ్ళ కాగోళ మభ్రవార్ధి । గర్భమును వీడి బహుళ వేగమున బఱచి
గమ్యమెఱుగక సూటిగ గగన వీథి । మిఱ్ఱిగాడ నజాంతము మిన్నులదర॥

తే॥ దిగ్భ్రమము చెంది యంభోధి తెప్పరిల్లి । పిలిచె "రమ్ముచంద్రా" । యని పేరుపెట్టి
తనకు గల శక్తితో లాగె దరికిగాని । యత్నవిఫలంబు చెంది హతాశమగుచు

చం॥ తనయుని పోకగాంచి, యెద దద్దరిలన్, గగనాంబురాశి లో
చనముల భీతినించుకొని స్తంభిత కార్యకలాప గాత్రమై;
తనయుని వెంబడించు కనుదమ్ముల చూపులు రెండు నేకమై,
తనరిచె; కన్నగర్భముగదా ! వ్యథ చెందక మానవోపునే ? ॥

వ॥ కాని చంద్రుడు వెనుదిరుగడయ్యె,

తే॥ కొన్ని యేండ్లిట్టు లా చంద్రగోళమేగి । యంటెను గురుగ్రహాకర్షణాగ్ర సీమ
తద్బలోద్ధతికాగి, మస్తకము వంచి । పరుగు స్తంభించి నిలిచె నాపద్మవైరి .

తా రా శ శాం క ము - బు ధ జ న న ము

తే॥ అందమున శంబరారాతి నధిగమించి । స్వచ్ఛభావశ్యమున సరస్వతిని మించి
తనులతాశోభ నవవసంతు జయించి । మీననేత్రార్ద్రవాక్కులమృతము గురియ

తే॥ కనబడియె తార కొకనాడు కలువఱేడు । హృదయమాకర్షితంబయి మృదుల బాహు
నాళముల జాచె; నాలింగనంబొనర్ప; నతడు తారను జేర్చె నిజాంక పీఠి॥

తే॥ కలుగు గోళపరస్పరైక్యతయు వేరు । పాటు, లాకర్షణోద్యత్ప్రభావజన్య
మగుచు, తారశశాంకులిట్లైక్యమైన । కంపమొందె గురుగ్రహాకర్షణంబు,

తే॥ కలసి, యాశక్తి చంద్రతారలను వేరు । చేయ నుంకించి లాగె స్వశ్రీనిబట్టి.
చంద్రతారల మేని కృశాను శైల వితతి యందుండి కోపాగ్నివృష్టి వెడల.

కం॥ విడువదు తార శశాంకుని । విడువడు చంద్రుడును దరుణి, బిగికౌగిలులన్,
సడలింపక మెలగిరి, క్రొం । బసుచుదనపు ప్రేమపాశబంధితులటులన్.

* 1) అవ్యాకృతాకాశము = Space

2) యోజనము = 10 మైళ్లు = 16 కిలోమీటర్లు

తే|| వణకె సురపథ, మభ్రోడు వారమదరె । దిగ్గజకమూర్తి జెంచె; రోదించె విశ్వ
మమిత భయమున, గుటనకయ్యవసరమున । సాయపడెను సగోళముల్ న్యాయమెంచి

కం|| గురుచంద్రాకర్షణల స । మరమున బగిలెను శశాంక మండల, మపుడా
గురునకు దక్కెను తారా । సుకుచిరబింబంబు; శాంతిచొప్పడెమహిలన్.

తే|| చంద్రబింబంబులో నుండి జారిపడిన । ఖండము, బుధ గ్రహంబయి ఖ్యాతిగాంచె
చంద్రతారల మేనులజారి రేణు । వులు తిరుగసాగె గురుచుట్టు వలయముగను.

వ|| ఈ వలయము రెండున్నర యోజనముల మందమును గొన్ని నూర్ల యోజనముల వెడల్పును గలిగి, గురుగ్రహ కేంద్రమునకు పదునైదు నూర్ల యోజనముల దూరమున గలదు.

మ|| కవులీ నిక్కవమున్ గ్రహించి, తమ విఖ్యాతాంచితోత్సాహము
ద్భవశృంగార కథన్ రచించి రివసన్, "తారాశశాంకంబనన్"
యువహృద్యంబగు పద్యకావ్యములు, చిత్రాపాగతంబుల్ గదా !
రవినేత్రంబులు కానజాలని సుతారంబుల్ కవిశ్రేణికిన్. ||

తే|| ఇరుసు చుట్టు బండి కనులు తిరుగు మాడ్కి । చంద్రుడుజ్జుట్టెను సౌమ్యుడు చాలనాళ్లు,
భానుడుద్భవమంది, పెన్బలిమితోప । తనకు గ్రహముగ బుధు లాగికొనెను వరకు.

భూమి పుట్టుక :-

వ|| చాలా వేలేడులకు :-

ఉ|| తారల జంట ఢీకొనగ, వ్యాపథమందున, రాలి ఖండముల్,
మారుతచోదితంబులగు. మబ్బుల కుండిన యట్లు కూడి యీ
ధారుణి రూపమున్ గొనియె; తచ్ఛకలంబులు గూడి యేకమై,
వారిజ సంభవుం డిలను వర్ధిలుమంచు నొసంగె దీవనల్ ||

సీ|| మన పురాణంబులు మధుకైటభులటంచు । పేరులు పెట్టె నీ తారలకును ।
పుట్టిరా మధుకైటభులు విష్ణు చెవులందు । శక్తిని గొలిచిరి, జనని ! యనుచు;
అజుని బీడింపగా నాదైత్యులిద్దరు । పద్మనాభుడు చంపె వారిబట్టి;
వారి మెదడులూడిపడుటచే జన్మించె । నీ మహి మేదిని నామమందె.

తే|| అనుమన పురాణములలోని యద్భుతంపు । కథకు మూలము తారలాకసము నందు
సంచరించుచు ఢీకొన్న సహజగాథ । సాదరముగ పాఠకు మదికచ్ఛపినిమాటి.

భూలోక శకి :-

భూమి పుట్టుకను గురించి తెలుగు దేశమున ప్రచారమున గల కథయును గలదు,

తే|| వసుధ మిన్నును లేని పూర్వంబు నందు । పెద్ద గ్రుడ్డుండె; దానిలో విశ్రమించె
చాలకాలము భూలోక శక్తి; పిదప । పగిలె నా గ్రుడ్డు రెండు చిప్పలుగ నంత,

కం|| అవినశ్వము భూమియయ్యెను । నవలన్ భూలోక శక్తి నాట్యము చేసెన్ ।
రవి యామెకద్దమయ్యెను । జవరాలికి తిలకమయ్యె శశధరుడంతన్.

వ|| భూమి యంతయు జలముతోడ నిండియుండెను.

చ|| జలమయమైన నాడవని శక్తి జనించి, ధరాతలంబునన్,
నిలిచె, ధరించి రెండ సిత నేత్రములొక్కటలాట నేత్రమున్,
జ్వలదరుణాంశు రాగముల సారమెలర్పగ మధ్య నేత్రి, మా
నెలదికరంబనన్ మొలచె బెత్తముచంకను సంచి వ్రేలగన్||

తే|| సకతి పుట్టిన మొక యేడు గడియలకును । వాయువులు వీచెబడమటి దిక్కునుండి,
గర్భమును దాల్చె శక్తి తత్కారణమున । నంత తొమ్మిది ఘడియల కజుడు పుట్టె||

తే|| తనను బెండ్లాడుమని కోరె ధాత నామె । ఈయకొనదాయెనాతడా యిచ్చ దీర్ప,
గనలి బూడిద చేసి, యా పద్మభవుని । విష్ణుమూర్తిని బుట్టించెనంత మాత ||

తే|| రమణిబెండ్లాడ నతడును తిరస్కరించ । గమలనాభునకును బ్రహ్మగతియె పట్టె
శివుని బుట్టించి, యర్థించె । బెట్టబట్ట । నాత డెగదిగజూచి యిట్లనె సుదతికి ||

తే|| మదను మొలకవు ! నేను నీ మాటకడ్డు చెప్పనేర్తు నె ? నడి కన్ను చేతి సంచి,
బెత్తమును ముందు నీవు నాకిత్తువేని । నీ యభీష్టము దీర్తునో తోయజాక్షి ||

తే|| అనననొడబడి, యా మూడు వశనికిచ్చె నామె హార్స పీచికలంట నాశనమున,
మన్మథుని బాధచే బుద్ధి మందగించి । యంతరించె నా యీ నితో నామెశక్తి ||

కం|| అట చుట్టునున్న జలములు । మటుమాయములయ్యె నపుడు మఱల జలంబుల్,
ఘటియింపజేసి, యా ధూర్జటి భస్మము చేసె, నాయసాధ్యపు శక్తిన్ ||

తే|| బుగ్గి గలియుట చే నీరు బురదయయ్యె । దానిలో నుండి మఱల నుద్భవమునందె,
పొలతి భూలోక శక్తి, యా బురద గట్టి । పడెను, భూభాగమై నేడు పరిధవిల్లు||

తే|| మఱలబుట్టిన యాశక్తి మాతకాదు । కనుకనామెను జేపట్టె గరళకంఠు,
డామె యే సతియయ్యె, శైలాత్మజాత । యయ్యె, నా భవంబు లగూడ హారువతించె||

కుజుడు - అంగారకుడు పుట్టుట :-

వ|| పైన చెప్పినట్లు రెండు తారలు ఢీకొనగా, జన్మించిన యా భూమి గగన స్థలమున దుగ్ధవారాశి చుట్టును దిరుగుచుండె,

శా॥ అంతన్ గొన్ని యుగంబు లేగగ, ననంతాకాశ గర్భంబు నన్,
బంతుల్ వోలెఁ బరిభ్రమించు నుడు బింబ వ్రాత మధ్యంబు నన్॥
గాంతుల్ చిమ్ముచు, విశ్వ తేజ సమయూఖంబొందు తేజోఽభివి
క్రాంతిన్, మేదిని దాకి, రెండు చిలకల్ గావించె; విశ్వంభరన్॥

చం॥ అసమములైన ఖండములయందలి చెక్కల నొక్క దానిన్
విసరె బలంబునన్, బహుళ వేగమునన్, గను దూర, ముద్భట
శ్వసనుడు; ప్రావృతంబు ధరజాలము దూరము చిమ్మ చాఱ్పనన్;
వసుమతికిన్, గుజుండిటుల, ప్రాప్తసుతుండయి నింగినిల్వఁగన్ ॥

మ॥ ప్రవహించెన్, గుజునందు దృష్టిరమతో భవ్యాపగల్; శాఖలై,
లవణాంభోనిధి మధ్య యామ్యతల మెల్లన్ గప్పె; సల్పోదధుల్
వివిధ ప్రాంతములన్ జెలంగె; నవనీభృచ్ఛ్రేణులత్యున్నతా
గ్రవిశిష్టంబయి పొల్చె; వాయువులు సాగన్ భూమి యందున్ బలెన్॥

వ॥ ఈ కుజగ్రహము గూడ భూమివలెనే క్షీరవార్ధిని జుట్టి తిరుగుచుండె;

ఉ॥ పిమ్మట వేల యేండ్లకు, వేఁడిక గోళము చిట్లి, ముక్కలన్
జిమ్మగ, నందుఁ బెక్కు కుజుఁ జేరి; విశాల మొనర్చె తత్స్థలిన్ ।
కొమ్ముల గ్రుమ్మినట్లు కుజగోళము దూట్లొనరించెఁ గొన్ని, వేఁ
గ్రుమ్మరసాగె గొన్నియొక ప్రక్కగ భూసుతు ప్రక్కవీథిలోన్॥

ఉ॥ ఎండెను గాలువల్, జలధుల్, లేఱులు నచ్చట । గొన్ని యేండ్లకు
ద్దండమరుద్వితాన జనితంబయిరే । గిన యెఱ్ఱ ధూళితో
నిండెఁ గుజగ్రహం బనిలనీరములచ్చట । గానరాక, త
న్మండల గర్భమందొదిగె, మంటియెడారిగ । జేసి సర్వమున్ ॥

తే॥ భూమి చుట్టును, వలయమై పొలుచు ఛత్ర । నిభమగు పొర కుజుని చుట్టు నెగడకుంట
సూర్యు నుగ్రోష్ణ తీక్ష్ణత సోకుకతన । జీవతతిపుట్టునాశ నశించె నచట॥

తే॥ కాననగు నేడు పెను తొఱ్ఱ గ్రహము నడిమి । రేఖకొక కొంత యామ్యోపరితలమందు
ప్రాంశుభీకర బిలవక్త్ర వహ్నినగము । మాసెనుదధులు నదులును మనినచోట్ల॥

వ॥ ఆపెను తొఱ్ఱ నూఱు యోజనముల పొడవును, వింశతి యోజనాల వెడల్పును, యోజనము నాలుగువీసముల లోతును గల్గి, యించుకంత యేటవాలుగా నుండును. తరుణవయస్కమగు నా యగ్ని పర్వతము రెండు యోజనములకు మించిన యెత్తును. అధోభాగమునందు నలువది యాఱున్నర యోజనముల వెడల్పును గలిగి యుండును. ఉపరితల వక్త్ర బిలము, రమారమి యోజనమున నెనిమిదవ వంతులోతు గలిగి యుండును, కుజగ్రహ

పుటుత్తర ధ్రువము చుట్టు ననేక యోజనముల వరకు నీరు గడ్డ కట్టిన మంచుతో నిండి యుండు దక్షిణ ధ్రువమునందు గడ్డకట్టిన బొగ్గుపులుసు వాయువు పర్యాప్తమైయుండును; పెద్ద పగడమువలె గానబడు నీ కుజగ్రహము; భూజనుల లెక్కప్రకారము, 687 దినముల కొక్క సూర్య ప్రదక్షిణమిప్పుడు చేయుచున్నది.

## భూదేవి శైశవదశ :-

వ॥ ఆ కుజ గ్రహంబిట్లు పరివర్తనము జెందుచుండగ;

శా॥ నింగిన్ దారలు గొన్ని డీకొనగ, క్షోణిన్ రాలె తత్ఖండముల్,
భంగోత్తుంగ మహార్ణవం బిటనటన్, వల్మీక సంపన్న మ
య్యెం గోత్రాగ్రహమందు; దానికతనన్ నైచ్చెల్లె నీ పృథ్వి స్వీ
యాంగం బెల్ల; జలంబు గాకిటుల ద్వీపానీకముల్ లేవగన్ ॥

వ॥ ఇయ్యవి జంబూ, ప్లక్ష, కుశ. క్రౌంచ, శాక, శాల్మల పుష్కర ద్వీపములుగా పిమ్మట నామకరణమందినవి; ఇట్టి పెద్ద ద్వీపములే గాక మఱియు ననేకానేకములైన చిన్న దీవులును నేర్పడినవి.

తే॥ చాల వేలేండ్లకిట్టుల జనిన పిదప । దక్షుండను పేరిటొక బృహత్తార కతన
పగిలె శశి రెండు చెక్కలై, వానిలోన । ధరణిం బడి యొండు భువిని బద్దిగం జేసె ॥

వ॥ అంతట;

తే॥ అనయ మొప్పుల కుప్పాటలాడు పోల్కి । తిరిగె శశి మేదినులు పరస్పరములాగి
కొనుచు, నవి రెండు క్రమముగా గుండ్రనయ్యె । నాకసంబున నెల్ల గోళాళివోలె ॥

వ॥ తుదకు -

తే॥ గరిమ గోలొప్పియు, చంద్రుడు, ధరణిచుట్టు । తిరుగసాగెను దిరుగలి దిరుగునట్లు
ఇరువదికి పైన, తొమ్మిదిన్నర దినంబు, । లకు ప్రదక్షిణము శశాంకు డొకటి చేయు ॥

తే॥ తాను దినచుట్టు తిరుగుటకైన నన్ని । దినములే పట్టుగావున మనకు జంద్ర
తలము నొకవైపె కనబడు; శైలచిత్ర పటమునందట్లు। వెనువైపు వడదుకన్ను ॥

తే॥ అవని తలమున సగభాగ మబ్ధియయ్యె । నగ్నిశైలములా యబ్ధియందు గలవు ॥
భర్మ రత్నాది సర్వసంపదలు పుట్ట । సాగెనున్నత కలన భూజఠరమందు ॥

తే॥ ధ్రువము ధ్రువమునకెన్న నా భూమి కడుపు । గుండ సూటిగ దూరము రెండు నూర్లు
నిరువదుల యోజనములైన, నింద్రవరుణ । దిశల నడుమ దూరముకొంత దీర్ఘమయ్యె॥

తే॥ అవనికంటె పెద్ద గురుగ్రహంబు పతియు । మూండువందల రెట్లు, నెప్ట్యూను, శని, యు
రేనసులును భువికి గొన్ని రెట్లు, పెద్ద । భూజవనవేళ నవి రెండు పుట్టలేదు ॥

వ॥ సూర్య భగవానుడు నానాడింక పుట్టలేదు, పిదప గొంతకాలమునకు, రవి యావిర్భవించి,

యీ గ్రహములను దనచుట్టు, ననుచరుల మాడ్కి- ద్రిప్పుకొనసాగెను, కావున :-

తే|| ఉర్వి రవికి నేడొక కోటి యోజనముల । కించుమించు దూరమున వర్తించు దనకు
బదియు మూడు లక్షల రెట్లు బహు విశాల । మైన భానుని జుట్టుచు ననవరతము ||

తే|| గుండ్రముగగాక, యీ భూమి కోడి గ్రుడ్డు । వలెను కోలగా రవిచుట్టు పఱుగులిడును
గ్రహపతిధరల మధ్య నీ కారణమున । హెచ్చుతగ్గుల దూరంబు లెసగుచుండు ||

తే|| అట్టులొకచుట్టు మున్నూఱు నరువదైదు । నొక్క-పావునాళ్లగును, భానూదయాస్త
మానముల హెచ్చుతగ్గులు మఱియు ఋతువు లిందు కల్గు వసుధయందెల్ల యెడల ||

భూదేవియాత్మ ప్రదక్షిణారంభము :-

మ|| రవిచుట్టుంబయనించు వేళ, భువి గుండ్రంపుగిరుల్ చుట్టకన్,
పవలున్ రేలును మారకుండె, నొక పార్శ్వంబెప్డు రేయి రెం
డవ పార్శ్వంబు, సదా దినంబగుచు నుండన్, గొన్ని వేలేండ్లకే,
యవనీ చక్రము స్వప్రదక్షిణము చేయంజొచ్చె, విష్ణ్వాజ్ఞమై ||

వ|| దీనిని సూచించు నొక పురాణ కథ గలదు.

చం|| యనియు, యమునతనన్ బరగు నాదిమ దంపతులందు, భర్త ప్రా
ణము విడువంగ దుర్దినము నాకిది యంచు మహార్తనాదముల్,
యమి యొనరింప, శ్రీపతి దయామతి రేలు పవళ్లు దెచ్చె, న
ర్యముడుదయింప; రోదనము నయ్యమి మానెను రోజు మారుటన్ ||

సూర్యుడు - సంజ్ఞ - శని :-

ఉ|| అంగిరసాగ్ని వెల్వడె మహాప్రభ నొక్కెను యోగ సిద్ధినాన్,
నింగి వెలుంగుచున్ గనియె శర్వరి యూసుతెఱు, విశ్వకర్మ స
త్వంగ సమేత గోళ జనితంబయి వెల్వడె, సంజ్ఞనామ త
న్వంగి, గురు గ్రహంబునకు బాంధవి, చెల్లికి పాత్రియాటచేన్ ||

తే|| పాలజలధి నుండి రవియుద్భవము నంది । తల్లి చుట్టును జేయు ప్రదక్షిణములు ।
ఉద్భటోష్ణ గోళమగుచు నొక్క-నాడు । సంజ్ఞ నాకర్షణము చేసె సవితకాన ||

ఉ|| మున్నొక కాలమందు రవి ముంగిట నిల్చెను, సంజ్ఞ నామమున్.
గొన్న గ్రహంబు, సూర్యునకు గ్రాగి ద్రవించుచు నంత భాస్కరో
త్పన్నములైన యావిరులు, తద్రపమున్ గొని సంజ్ఞ ఛాయలో,
గ్రొన్నెల విచ్చె; నిల్లు శని గోళము పుట్టెను శ్యామ వర్ణమై ||

వ|| ఈ శని గ్రహము నేడు భూమికి పదుమూడు కోట్ల యిరువదిలక్షల, యోజనముల
దూరమున నుండి సూర్య ప్రదక్షిణములు చేయుచున్నది.

తే॥ సంజ్ఞ పిత విశ్వ కర్మ తత్తనయపడెను । బాధగమనించి వేవేగ వచ్చిరవిని
పట్టి చిత్రిక, యా పొట్టు పాలకడలి । యందురాలి సుదర్శనంబయ్యె నచట ॥

తే॥ విప్పదీసిన ప్రత్తియటొప్పెనపుడు । సవితృ బింబము లాగెను సంజ్ఞ మేను ।
సంజ్ఞ గోళము చిట్లగ జన్మమంది । రశ్వినీ దేవతలుదుద్వయంబు మింట ॥

శుక్రుండు :-

ఉ॥ అంగిర సాగ్నియందుదయమై, భ్రమియించుచు శుక్రుడొక్క నా
డంగలు నైచుచుంబఱచె నంబరవార్ధిని గ్రుంకు వేళ్క, త
త్సంగమ, మడ్డి, భాస్కరుడు సంజ్ఞను లాగిన యట్లు లాగగా,
బొంగర మట్టులర్యముని పొంత భ్రమింపగసాగె చుట్టుగన్ ॥

ఉ॥ భూతల మట్టులా గ్రహము పొల్పెసలారును దృష్టి, క్రథక
మూత చయంబు క్రమ్మి, మెఱపుల్ గనరేగును, దీర్ఘ రాత్రులన్;
చేతన సాగరంబు వలె, చెన్నగు రంధ్రము తప్పిణంబుగన్,
పాతిక యోజనంబులయి, ప్రాకును బహ్మాండి నుండి ప్రాగ్దిశన్ ॥

వ॥ ఈ శుక్రగ్రహమునకు వేగుచుక్కయనియు పేరుగలదు.

ఆ॥ వేగుజుక్క చుట్టు వింత మారుతమొప్పు । యుత్తర ధ్రువంబు నుండి వేచి ।
యుబుకుచుండు, దద్దుపోర్ద్వ మేఘములందు । మిగుల పెద్ద మెట్టి మెలగుచుండు ॥

వ॥ శుక్రుని యట్లే, బుధ, గురు, కుజ, గురు, శని, గ్రహములును, కుజుని ప్రక్క వీధిలోని
గ్రహ శకలములును, సూర్యునిచుట్టు పరిభ్రమించుచున్నవి. అట్లే యురేనస్, నెప్ట్యూన్
ప్లూటో మొదలగు గ్రహములును సూర్యుని చుట్టు తిరుగుచున్నవి,

జీవ సృష్టి :-

వ॥ భారతీయుల లెక్కప్రకారము, కృత, త్రేతా, ద్వాపర, కలియుగములు కలిసి యొక
మహాయుగము, అట్టి డెబ్బది యొక్క మహా యుగములు కలిసి యొక మన్వంతరము;
అట్టి పదునాలుగు మన్వంతరములు కలిసి, బ్రహ్మకొక పగలు పూర్తియగును. ఆ పగటి
పూట బ్రహ్మ సృష్టికార్యము చేపట్టును, పిమ్మట పదునాల్గు మన్వంతర కాలము
బ్రహ్మకొక రాత్రి. అట్టి రాత్రివేళ బ్రహ్మాండమంతయు ప్రళయగర్భమున మునిగి
యుండును. ఈ యిరువది యెనిమిది మన్వంతరముల కాలమును బ్రహ్మకల్పమని
యందురు, అట్టి బ్రహ్మకల్పములు ఇప్పటికి ఇరువది వేలకు పైగా గడచినవి. ఇప్పుడు

* కృతయుగము = 17,28000సం॥లు; త్రేతాయుగము = 12,96,000సం॥లు; ద్వాపరయుగము = 8,64,000సం॥లు
కలియుగము = 4,32,000 సం॥లు

మనము ఏడవ మన్వంతరమైన వైవస్వత మన్వంతరమునందలి యిరువదియెనిమిదవ మహా యుగములోని కలియుగమున నేడు జీవించుచున్నాము బ్రహ్మదేవుని యొక్క నేటి జీవ సృష్ట్యారంభమునకించుపూర్వము -

తే|| గ్రహములన్నిట సిథిరాగ్రహము బ్రహ్మ । దేవ్రు మనమున నింపెను దీపకాంతి
అవని తనచుట్టును దాజుట్టు నపుడె యతడు । భూమిపై జీవులను సృష్టి చేయదలచె.

తే|| వసుధ చుట్టును గల గాలిపై నదేలి । పొల్చు ఓ జోనము పదార్థపు జవనిక
అర్కమోష్ణిమనది కొంత యడ్డగించు । గాన మనగలదిక మీద మానవాళి ||

తే|| అని తలచి జీవసృష్టికార్యమును బ్రహ్మ మొదలుపెట్టెను. భూమిపై ముదితుడగుచు
కమ్రిసుముహూర్తబలము సంకల్పబలము । కలిసి కృతకృత్యుజేసెనా కమలభవుని ||

శ్రీ మహా విష్ణువు నివాసములు :-

తే|| విశ్వమునకవలకలదు విష్ణులోక । మచటనే కాక భూలోక మందెసంగు ।
మేరుగిరిమీద విష్ణువు మెలగుచుండు । నందఱకు సాయ మొసరింప నాత్మనెంచి.

తే|| ప్రళయమునదాగు విష్ణుగర్భమున విశ్వ । మంత ప్రళయ వేళ దుగ్ధాబ్ధి పుట్టు,
నందువట పత్రిశాయియై యలరుహరియు । బొడ్డుదమ్మి నిద్రింప శంభుండు, ధాత ||

ఆశ్వాసాంతము :-

కమల విలసితము } భువియు గ్రహములు పొడమిన రీతుల్ । సువిదితమొనర్చి స్ఫురణకు సోకన్
దివి రీతి రచనను; తెలిసె కదా ! నీ । కవి ? వనజభవుని యతివ । మదంబా !

గద్యము :-

ఇది శ్రీ శ్రీవత్స సగోత్ర, తేకుమళ్ళాన్వయ సంజనిత, రాజగోపాలరావు తనూభవ, రామచంద్రరావు నామధేయ ప్రణీతంబైన ఆంధ్రోదయమను నామాంతరమున వెలయునట్టి "శ్రీ తెలుగువారి ఆదిచరిత్రము" అను తొలికథయందు ఆదిఖండము ప్రథమాశ్వాసము.

మంగళం మహత్

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

* ఒకొక్క 'మనువు' పాలించుకాలము ఒకొక్కొక్క మన్వంతరము. పదునలుగురు మనువుల పేర్లు :-
స్వాయంభువు, స్వారోచిషుడు, ఉత్తముడు, తామసుడు, రైవతుడు చాక్షుషుడు, వైవస్వతుడు, సూర్య సావర్ణి, దక్షసావర్ణి, బ్రహ్మసావర్ణి, ధర్మసావర్ణి, భద్రసావర్ణి,రుద్రసావర్ణి,(రౌచ్యుడు)ఇంద్రసావర్ణి(భౌమ్యుడు)

# తెలుగువారి ఆది చరిత్రము

## ద్వితీయాశ్వాసము - సుమేరుఖండము

శా॥ శ్రీవత్సుండగు విష్ణుమూర్తి తవయున్ చేపట్టి, యత్యున్నతం
బై వర్ధిల్లెడు సత్యలోకమున గౌర్వర్వ భర్తతో నేలుచున్,
దేవవ్రాతము నీ పదాబ్జముల భక్తిన్ మ్రొక్కి దీవించు వా
గ్దేవీ ! ఈ రమణీయమైన కథనేదెల్పన్ వినన్ రాగదే॥

మేరు పర్వతము :—

చ॥ కలదు కదా ప్రసిద్ధమగు కాంచనశైలము, విష్ణు భార్గవీ
నిలయము, సత్యలోక రమణీగణసేవిత శృంగ్యమూల ము
త్సల కమల ప్రసూన రసబంధుర శైవలి నీ సహస్ర, ము
జ్వల నవరత్న కందర విశాలము, మేరునగాఖ్య మిద్ధరన్.

సీ॥ చిట్టిబొట్టు వేళ చిన్నారి భూదేవి - భక్తిదండమిడిన పసుపుగౌరి;
జీరకమ్ము, గుడమ్ము చేర్చి పృథ్వీకన్య - తలను వెన్నుడిడిన వలపు ముద్ద;
వసుమతీ వైవాహపరవధూకృతిమైన పైడి తలంబ్రాల పర్వతంబు,
ఆదిమానవజాతి కావాసమై పాలు - కుడిపిన పుడమి వక్షోరుహంబు ॥

గీ॥ మాతృదేవత సార్వభౌమత్వ మెఱిగి । యేడు దీవుల పుత్రీయిలకొసంగు
మహిత సుస్వచ్ఛ సౌవర్ణమకుట మనఁగ నెసఁగు హరిసిరి పట్టిల్ల పసిడిమెట్టు ॥

ఉ॥ ఆయపరంజి కొండ కటకాయత సానువు లభ్రయానముల్
చేయు దివౌక సప్రతతి సేదలు దీర్చు ప్రదేశపంక్తులై,
ఆయిన. చంద్రబింబ కిరణావళి నిద్దురబుచ్చు శయ్యలై,
శ్రేయము ప్రేయమున్ గలుగజేయు నటన్ గుమికూడు వారికిన్.

తే॥ ఈ కథారంభమైన కొన్నేండ్ల పిదప, । భూమిపై ప్రాణులింకను బొడమకున్న
కాలమున, నుత్తరధ్రువాగ్రమునమొనసె । గాన, మేరువు పేరందె నీ నగంబు.

తే॥ ధరణి బొంగరమట్టుల గిరులు తిరిగి । నిరత సూర్య ప్రదక్షిణల్ నెఱపునప్పు ॥
డొరగుటను, నించుకించుక జరిగి, ధ్రువము । కనకగిరి వీడి యుత్తరగామియయ్యె

ఉ॥ ఆ కనకాద్రి సీమ భువి నెల్లర పూర్వ పితామహాళికా
ద్యాకర; మందు సిద్ధులు, సురాసుర నాగ తెలుంగు లుద్భవం
బై, కకుబంతరోర్విని విహారస పూర్ణ మొనర్చి; రంబుజీ

ఉ॥ అంత్యగమ క్రమంబున దదద్రి సమీపము వృక్షకీర్ణమై,
జంతు విహంగ కీటకర సంచర సుందరమై తనర్చె; నా
ప్రాంతము పచ్చనెన్నిగల పట్టయి రూపుగొనెన్; వసుంధరా
కుంతల భూషణమ్ములగు క్రొవ్విరులయ్యెను పూవు జొంపముల్.

శా॥ నానాటన్ ధ్రువ దూరమైన హిమసాంద్రద్రావ ముక్తావనీ
స్థానంబంతయు గ్రావమ్మునే వసారిలే పద్మాకర స్తోమమై,
నానానోకహ పంక్తులుల్లసిలు కాంతారాంబరా చ్ఛాదమున్,
మేనన్ హర్మ్యగతి తాల్చె; నైజము కదా మీనాక్షికిన్ సిగ్గిలన్.

క॥ ఏతత్స్థాన మధ్యంబున । శీతల నవ్యాత్యచ్ఛాంతాంబు చిత్రామయమై
స్రోతస్విని ప్రవహించెను । వాతాహతి లఘుతరంగ వైసారిణమై.

తే॥ నాటి మొలచెను చిన్న నేరేడు మొక్క; । ఆ నదీ శీకర స్పర్శ నలరి యలరి,
ఆ నదీ బాలతో నాటలాడి యాడి, । పెరిగి జవ్వని యయ్యెను తరువధూటి,

సీ॥ అల్లంతనారంపు టపరంజి కొంపతో - నెనగాగ తనమ్రాను మొనయ జూచు;
గగనాలు కనలేని కనకాద్రిశిఖలతో - నీడగా తనకొమ్మ లెదుగజూచు,
పదినేల వన్నెల పైడి భూధరముతో - నీలుగా తన చాయ దిద్దజూచు;
కదలింప శక్యంబు కాని భద్రాద్రితో - సమముగా తన బలమ్ము మరజూచు,

గీ॥ మహితయశమును గన్న హేమగిరితోడ - సాటిగా తన కీర్తి విస్తరిల జూచు
యౌవనారంభ ధైర్య సాహసములకును । పోటిపడెనిక నాటపట్టు నేరేడు చెట్టు ॥

ఆ॥ జరుగ కాలమిట్లు జంబూ మహీజము । మొగ్గ తొడిగి, పూత పూచి, కాచి,
తీయనైన పండ్ల తోయగా నక్కెచ్చె, । ఫలరసమ్ము కార్చె జలములందు॥

క॥ ఆ పండ్ల స్పర్శ చేతను । ఆ పండ్ల రసామృతంబునానుట చేతన్
లేపసుపు వన్నె దాల్చెను । దాపగ యందలి జలము హాటకద్రవమై ॥

క॥ ఆనెయి 'జాంబూనది' యను । నామము తత్తటిని కచ్చె, నవసంభవతత్
బావీకరమ్ము సార్థక । నామము 'జాంబూనదంబు' నాగన్ బరనెన్ ॥

ఆ॥ ఇతర మిత్రులైన యిసుక రేణువులకు । నిసుక తిన్నెలకును నిచ్చెపండ్లు,
స్వర్ణమయ మొనర్చె వాని నాకుటజము, బలిమి చెలిమికన్న కలదె మిన్న ॥

ఆ॥ పెక్కుఫలము లిచ్చి పికశుకాద్యాశ్రిత । పక్షితతికి గూర్చె బహుళ తృప్తి,
అచటబడిన గింజ లవనీరుహంబులై వృద్ధిగాంచి। తల్లిపేరు నిలిపె ॥

తే॥ ఇక్షుమధురంపుస్తన్యలోదృష్టిదనిసి, । తల్లిపాలను పెరిగెడు పిల్లవోలె,
నిత్యనూతనపుష్టి సంధించుకొనియె । సహజశక్తికి తన్నదీ చంచలాక్షి ॥

శా॥ అంతన్, గొన్ని సహస్రవర్షముల ప్రాయంబంద నాశాఖ భూ
ప్రాంతంబందలి యేడు దీవులకు పేర్లన్ బెట్టునాడే బృహత్
సంతానప్రభృత వృక్ష కారణమునన్ 'జంబూ' ఖన నీదీవి య
త్యంత ప్రాభవ కీర్తులన్ బడసె సప్తద్వీప సంఘంబునన్.

## మానవుల పుట్టుక :-

క॥ ఆ మేరునగము చరియల । హేమాపగ యొడ్డునంటి యొసగెడు విటపిన్
గా మానవుడు పుట్టెనొకపు । నామెకు సంతానవృద్ధి యయ్యెను త్వరలోన్ ॥

తే॥ నిత్యజవ్వని యావృక్ష నీరజాక్షి । తొలి పడుచువేళ నుదయించె నిల నరుండు;
వృద్ధిగాంచెను నరజాతి; విస్తరించె । తమ్మి మొక్కలగమి వోలె దైవకృపను

క॥ క్రోడము. భల్లూ, పాకలి, పగ రేపెట్టిన గాసి కేసరి, వృక ఖడ్గ,
ద్వీపి, వ్యాఘ్రాదులుండ । నోపమి, తొలి నరులు బ్రదికి రుత్సాహమునన్ ॥

సీ॥ కందమూలమ్ముల, గాయల గసరుల - ఫలముల క్షుద్బాధ బాపుకొనుచు,
కహ్లార కువలయ కాసార నిమ్నగా - జలముల దాహోపశాంతిగనుచు,
ఇసుక తిన్నియలపై, వసుమ బీజములపై - విపినాంతరంబుల విశ్రమించి,
గుబురు కుమదల గుచ్ఛముల్ పెనుచలి - గాలుల కడ్డుగా గప్పుకొనుచు,

గీ॥ బాలభానుని వేయెండ బడుగులిడుచు । రేయి తొలిజాము వెన్నెల హాయిగనుచు,
చీకటులవేళ దాగుచు చెట్లమీద । బ్రతుకుసాగింప నరులలవాటుపడిరి ॥

తే॥ చంద్ర సూర్య పరాగ ఝంఝానిలాభ్ర । పంక్తులుఱుములు, పిడుగులు, వర్షపాత,
మరుణబింబము, శోణ సంధ్యాగమంబు । చిమ్మచీకట్లు, మెరుపులు చెవకదిటవు ॥

ఆ॥ అదరి, బెదరి, వెఱచి, యంతకంతకునట్లు రంబునేర్చి, యంతరంగ భీతి
నెప్పుడెట్టిముప్పు నీ మహాశక్తులు । తెచ్చునోయని మది హెచ్చరింప ॥

క॥ ఆ వన సీమను దిరిగెడు । నావులమందల యటులను, హరిణములటులన్,
జీవనముల సంచలటుల, జీవించె నరుండు సంఘజీవిగ నచటన్ ॥

తే॥ ఆకలిని బాపుకొన శశ, హరిణసూక । రాది మృగముల చేపల, నండజముల
తినుట నేర్చిరి క్రమముగా మనుజులెల్ల; సాత్వికంబెఱుఁగదు కదా జఠరవహ్ని,

తే॥ వ్యాఘ్ర సింహాదులు నరభక్షణంపు । రుచి మరగ, స్వీయ రక్షణముచితమనుచు
చెట్లకొమ్మలు, గ్రావముల్ సేకరించి. చావ మోదుచు వచ్చిరి జంతుతతుల.

పల్లెల నిర్మాణము :-

తే॥ నీటి కెలకుల దరి వనవాటికలను । కొట్టి పర్ణశాలలు కట్టి, చుట్టు కంచె
కట్టి నివసించి, పదునైన కటికి శిలలు । కొమ్ములును రక్షణార్థమై కూర్చుకొనిరి ॥

తే॥ శిలల, కొమ్ముల నాయుధములుగ మలచి, । రాతి పాత్రల, కొయ్యపాత్రలను జేసి,
పిట్టలను పెక్కు మృగముల వేటలాడి, । భుక్తి సాధించి, యభివృద్ధి పొందు వేళ,

తే॥ రాలరాపిడి. కొయ్యల రాపిడికిని । నిప్పు పుట్టించి వంటలు నేర్చుకొనిరి,
జంతుచర్మము గోడలికాచ్ఛాదనముగ । కట్టుటకేగిరి, ప్రబలె నాగరికతటుల ॥

చ॥ పదములు సృష్టిచేసి, చిఱువాక్యచయమ్ములు కూర్పనేర్చి, స
మ్మదమున పిట్టపాటలకు, ముందుతరమ్ముల పిన్నవారికా
పదములు నేర్చి, యెఱుంగ నొరుల భావములన్ గ్రహియింప జేయు నిం
పొడసెను నాదిభాష నుపయోగములోనికి వచ్చి రచ్చటన్ ॥

క॥ బలవంతుఁ డొందఱబలులో । బలరాజని పట్టినొకనిఁ, పలుపూరుషులో
కల పెద్దయౌ కుటుంబము । లలరగ, పెక్కిండ్లు, పల్లె లచ్చట వెలసెన్ ॥

ఉ॥ మచ్చికచేసి వన్యపశుమండలి, నా పశుపంక్తి మేతకై
పచ్చిక నేలనేర్పరచి, వర్ధిలు వేళ, క్రమక్రమంబునన్
హెచ్చి కుటుంబముల్, జనము లేగుచు వచ్చిరి దూరసీమ గ్రాం
బచ్చటి కిండ్లు నేర్పరప, పల్లెల నేపి సుఖించిరచ్చటన్ ॥

మ॥ వివిధ క్రూరమృగావళిన్ వనములన్ వేటాడి మర్దించుచో,
భువన ప్రాంతపు కొండ్లమేసి పసులన్ పోషించి కాపాడుచో,
సప నీ ఖండములందు మొక్కలను వేయన్ సాగుచో, నాటుచోన్,
నవలా పూరుసులెల్ల పాల్గొని సమగ్నంబైరి కార్యంబులన్ ॥

మ॥ జననాంగంబులు చాటుచేసికొను నిచ్చ తేనెమ్మదిన్ నింప, నా
జనముల్, చెట్ల బెరళ్లు, నారలును, రాజీవాది పత్రాదులున్
వినియోగించిరి కంటివృష్టికి క్వచిత్ విఘ్నంబు గల్పింప; నా
వెనుకన్ గట్టిరి నారబట్ట; లరిగెన్ వేలేండ్లీ మధ్యలోన్ ॥

తే॥ ఒకరికొకరికి సరిపడకున్న వేళ । నే విషయమైన సలజడు లెగయు వేళ
ఊరి వారందరును జేరి యొక్క చోట । తగు పరిష్కృతి జేసిరి తగవు దెలిపి.

క॥ స్త్రీలును, పురుషులు, వృద్ధులు । బాలురు, బాలికలు, పడుచువారును నీ పే
రోలగముల బాలుకొనిరి । బాలుండు సుభాషితంబు బలుకదగు గదా ?

సీ॥ దేహానోశ్శక్తితోఁ దెచ్చి సాగుకు మేంత - కడవులు నిండిన పుడమిగముల;
నవని చక్కఁగ దున్ని, వ్యవసాయమొనరించి - బంగారుపంటలు పండఁజేసి;
పసుల మందల మేపి పాలు పెరుగును వెన్న - నేయి, మజ్జిగ జున్ను చేయుటెఱిఁగి
నిటపీశలమ్ముల వేటాడి మెకముల, - పులుగుల, దుర్జంతువులను దునిమి ॥

తే॥ కష్టమొనరించి, చెమ్మటల్ గార్చి, ఫలము । వారు సకుటుంబముగ దృప్తి నారగించి
సుఖములందిరి; కృతజ్ఞతల్ జూపి రక్షల । ప్రకృతిశక్తులపై కత్యంత భక్తి నెరగి ॥

క॥ జనసంఖ్య పెచ్చుపెరుగగ, మనుగడకై వలసపోవు మనుజులు పలుయో
జనముల దూరప్రాంతము । లను నడచుచు నేగవలసె నక్కాలసారుల్ ॥

ఆ॥ వలసకెప్డు రేగపలెనను నంశంబు । నేకుటుంబమునకు నా కుటుంబ
మిష్టపూర్తి దేల్చ గష్టమం చెంచిన, । నుచిత ఫణితి వెలిపి సూరివారు ॥

సీ॥ "ఒకరికొకరమైతి మోసుతా సోదరా ! : ఎవరికివారమే యింకమీఁద
నూటి తిప్పకుమయ్య; శుభము నీకగు - ధైర్యసాహసములు నీకు సహచరు" లని
ఉన్నయూరిని వీడి, కన్నవారిని వీడి, - అన్నదమ్ముల వీడి, ఆస్తి వీడి,
తోఁబుట్టులవీడి, తోటి మిత్రులవీడి. - ఇల్లువాకిలి వీడి యేగువారి ॥

గీ॥ కీచ్చి పంపుచునుండిరి తోచ్చు పసులు, । తిండి గింజలు, చలిదియు నిండుగాను,
పరికరమ్ములు, పాత్రలు, వస్తుచయము;।"మమ్ము మఱువకు" మనుచును మఱల మఱల॥

తే॥ ఉమ్మడిగ మేసె పశువుల యూళ్ళు బీడ్లు; । ఎవరికందిన భూమి వారలమీదున్ని
సాగుచేసిరి సకుటుంబ భోగముగను; । యిచ్చమై దాని విడనాడి యేగువఱకు ॥

తే॥ ఫలము చాలక వెతలుచో వలసలకును । ప్రతి కుటుంబమునందును ప్రథమ సుతుండు,
భ్రాతలకు ముందు సాగున బయలుటచేత. । వాసికీ భూమి వదలు రివాజు ప్రబలె ॥

ఉ॥ ఆవిధ వేల యేడులకు హాటకశైలపుటన్ని దిక్కులన్
జీవిత సాధనార్థమయి చేరి, జలాశము నిమ్నగా తట
స్థావర మండలంబులను స్థాపనజేసిరి పల్లెపట్టులన్,
బావులు త్రవ్వి రాపగలు పజ్జలఁ రేని నివాస భూములన్ ॥

సీ॥ గంధమాధనీనాను గహ్వారీధరపంక్తి - ప్రాగ్దిశాతలమున వచ్చెనడ్డు,
దక్షిణంబున 'నిషధ' ధాత్రీ ధరశ్రేణి - తరలనీదయ్యె ముందరకు జనుల,
పశ్చిమంబున 'మాల్యవంత' పర్వతపంక్తి - యెదురయ్యెపాదముల్ కదలనీక,
'నీల' కీలోచ్చయ నివహంబులుత్తర - కకుభగమున కుడ్యగ తిని నిలిచె

గీ॥ ఈ చతుర్గోత్రములమధ్యనింక బ్రదుక ! చాలదయ్యెను చోటు భూజనుల, కపుడు
ధైర్యమొనరించి, యా మహీధ్రముల దాటి । కనిరి విస్తృత భూమి భాగమ్ములంత॥

**మానవులు 'ఇలావృతము' నుండి బయలుదేరుట :-**

తే॥ మేరుగిరిచుట్టు నిన్నాళ్లు మెదలినట్టి । తమ 'ఇలావృత వర్గంబు' తరలి వెడలి
రాశ్రపేరేప, జరకంబులంతుకముల । వోలె ముందుకుముందుకు పోవచి నడప

క॥ చేరిరి రమ్యక వర్షము । నా రీతి నుదీచ్యగాము; లటనేరెకుల్
మీఱ, హిరణ్మయ వర్షము । చేరిరి, మార్గమున దాటి శ్వేతాద్రి తతిన్ ॥

క॥ ఇంకను సంకను దీచ్యము । వంకకు శృంగాద్రి దాటి వాలేగి చలిన్
జంకక నుత్తర 'కురువ' । స్థాంకమున వశించి యుత్తరాబ్ధిని జేరన్.

క॥ ఆ యుత్తరకురు భూముల । నాయబ్ధితటిని, నా వారణ్మయంబునబుట్టెన్
శ్రేయశ్శ్రేయద వేదా । మ్నాయములని "తిలకు" లోకమాన్యుండు తెలిపెన్.

ఆ॥ కడలి నీరు గడ్డకట్టిన వేళల । మంచుపైన నడచి, మనుజులేగి,
రబ్ధిదాటి నేటి "అమెరికా" దీవికి, । వనధిలంకలకును వలస పోయి.
ఆ యుత్తరకురువర్షమున

సీ॥ కరుకుడుగట్టిన మంచుగడ్డల గుట్టలు - చెలంగెనైరావత శ్రేణులట్లు;
కాదంబినీ మాలికా నిర్గతాంబు ధా - రలు రాలె వడగండ్లు రాలినట్లు,
తరువులు శైత్యాగ్ర తాహతిన్ మోడులై - యందందు నిలిచె దయ్యంబులట్లు;
చలితాకిడిక్ జంతు చర్మధారణ చేసి - యగుపించిరి జనుల్ మృగములట్లు,

గీ॥ మందమయ్యెను చర్మము, మదిశిలాయె, । శాకములు లేక భుక్తి మాంసంబెయయ్యె,
ప్రొద్దుపొడువని చీకట్లుపోతుమీఱి । యొక్క మొగిసిల్చె నేటిలో పెక్కునాళ్లు.

తే॥ అవనిపై నిలునట్టు భాగ్యంబు లేక । నేలబొరియల వల్మీక నిలయులైరి
భుజగములబోలె, చీమల పోల్కి తొలుత । తెచ్చి భద్రము చేసిన తిండి తినుచు.

తే॥ భానుడుదయింప, మొదలిడెవలు రేలు, చెట్లు చిగురించె. గనబడె జీవరాశి,
పరిమళము లేని పూవులు విరిసె, మఱల । కొలది నెలలకె వెనురేయి యలముకొనియె

వ॥ ఇలావృత వర్షము నుండి

తే॥ ప్రాగ్దిశకు నేగి, "భద్రాశ్వ" వర్షమందు । స్థిరపడినవారు ప్రాగబ్ధి తీరమునకు
వ్యాప్తిజెంది సుఖించిరి, వారి సీమ । పరగు "చీనా" యనెడు నామకరణమంది.

తే॥ పడమటను "కేతుమాలాఖ్య వర్ష"మేగి । స్థిరపడినవారు "దను" వను ద్వీపవలికి
వ్యాప్తిజెందను మొదలైరి, వారి సీమ । 'ప్రాగ్ - యూర'పను పేర బరగునేడు

తెలుఁగవారి పూర్వులు హరి, కింపురుషములను, నైలునదీ తీరమును చేరుట :-

వ॥ 'యముఁడు' అనువాని సాయకల్యమున

తే॥ దక్షిణమున హరి'హరివర్ష ధరణిపేరి । తెలుఁగువారి పితామహుల్ తేజరిలిరి;
వ్యాప్తిగాంచిరి "సింకియాం" గనగ నేఁడు।పరగు 'హరివర్షము' న వేల వత్సరములు

ఉ॥ అంతట దక్షిణాభిముఖులై చని కొందఱు సొంపు నింపుదత్
ప్రాంతపు "హేమకూట" మనుపర్వతపంక్తిగమించి, చూచిర
త్యంత సమున్న తాయత మహామహి "కింపురుషాఖ్యవర్గమున్"
సంతత హృన్మనోజ్ఞము, ప్రశాంతము నేఁటి "టిబెట్" ప్రదేశమున్.

వ॥ ఆ వర్షములందు తెలుఁగువారి పూర్వులు నివసించిన పశ్చిమ భాగము కొన్నాళ్లకు
"లింగవనము" అను నామమును, "లింగబాణదేశము" అనునామమును పొందెను.

తే॥ అచట స్థిరపడి పశ్చిమాశావకాశములకు మెలమెల్లగానేగి వలసగొనిరి
దేశదేశాల నేఁడు దీవి యందు నైరృతిని 'నైలు' నది జన్మ నగము వఱకు.

తే॥ నైలునది ప్రవహించు ప్రాంతంబునకును।వరుణ మాడ్యము లానాఁడు వసధిమయము।
లబ్ధి పడమట పెనుదీవి, యామ్యమందు । గొప్ప దీవియు నలరె భూగోళమునను.

తే॥ ఆ ఇళావృతము వీడి అన్ని దిశల । కరుగునెడ సహజముగ స్త్రీయాది భాష
గొని చనుటజేసి శబ్దైక్యమెనయు నాఁటి । వఱకు మన తాతలేఁగిన పదములందు.

క॥ నైలును 'కాళీ' గౌరి, । నీలా, (అ) సిత నాగ బోన్కాని, మును జనులు భూ
పాలకగ గొలిచి, యిడిరి ని । వాళులు, నైవేద్యములును, బలుపూజాదుల్.

కు మే రు ప ర్వ త ము :-

శా॥ ఆ నీలాపగ జన్మదేశమున నాహార్యంబు పోల్చెన్ సుర
స్థానంబున్ తల కొమ్మలన్ బొడిచి, ప్రస్థప్రస్రవణ్యుక్తమై,
నానానోకహ, పక్షిజంతు యుత కాంతారోద్ధతిన్, శృంగముల్,
తేనెల్ నింపెడు కోశ సంచయములో, తిగ్మారి శాఖాళితోన్.

సీ॥ భూమధ్యరేఖపై పొలచి నిల్చుట చేత - నధికోష్ణమెల్లప్పుడావహింప,
ప్రతిదినంబును వర్ష పాతంబునన్ నాని దళదిశావ్యాప్తమై తరులు పెరుగ,
సింహ, శార్దూలముల్, చింపంజిలును, గొరిల్లాలు మున్నగు జంతు జాలమెసఁగ,
నిండు నీరంబులో నిర్ఝరశ్రేణులు - ప్రవహింప రొదలతో పవలు రేలు,

గీ॥ కాకులైనను జొరలేని కారడవులు, । చీమలైనను జొరలేని చిట్టడవులు
కలిగి, శిఖరాగ్రచయము లాకసము నంట, । నుండెగిరి నేఁటి "ఆఫ్రికా" ఖండమందు

వ॥ మన తెలుఁగువారి పూర్వుల సోదరుల రాకతో

చ|| అవధు లెఱుంగజాలని యనంత వినిర్మల సుప్రశాంతి క,
త్యవిరళ శాంతి సమ్మోద సుఖానుభవమ్ముల కుంకుదైన య
య్యవని ధరమ్ము పై పులులు, నావులు, లేళ్లను, సింహ నాగముల్
లవ, కుశులట్లు చెల్మిగ జెలంగెను విస్మృత నైజవైరమై.

తే|| వారి ఇలావృత వర్షంపు మేరుగిరిని । జ్ఞప్తికిన్ దెచ్చు నీ మహా శైలమునకు
పేరిడిరి 'మేరు' నగమని, గౌరవాభి । మానములు పొంగి పొరలగ మానసముల.

క|| తమ తల్లితండ్రులు తాతల్ । తమకున్ మతిమతి దెలిపిన తద్గిరి వృత్తాం
తములన్వయించి ప్రేమ్మె । రుమహార్ధమునకు, దనిసిరి రోచిష్మతులై.

తే|| గిరులు రెండును నొక పేర బరగుకతన । తికమకలు మున్ప్రజపములు తివిరి; రంత
పాతనగము 'సుమేరు' నాఁ ప్రథితమయ్యె; । క్రొత్తగిరి 'కుమేరాద్రి'గా రూఢమయ్యె.

తే|| కొండయూటలు ప్రవహించె కోనలందు; । పిల్ల సెలయేఱులందందు వెల్లివిరిసె;
చెదరుమదరుగ నగులును చెఱువులలరె; నా మహార్ధముదరి పీఠభూమియందు.

ఆదిశక్తి :-

ఉ|| అక్కడ పాఱు నీల నది ఆదిమశక్తిగ తొల్లిపుట్టి, పె
న్నిక్కగ నా 'కుమేరుగిరి' నెంచుకొనెన్; సృజియించె తోడుకై
పెక్కు శతాబ్దముల్ జనుల ప్రేముడినేలి సుఖంబు గూర్చెనం
చక్కడ భక్తి తత్పరత నంద ఱెడన్ ఘటియంతు రంజలుల్.

తే|| ఒడ్డు పొడుగుల వనతరులోడి క్రుంగ, సౌష్టవ, బల, విక్రమ దార్ఢ్య, పుష్టి యె
యష్టశక్తులు వీర వజ్రాంగ శోభ । తనర విహరించె తేజః ప్రతాపశక్తి.

సీ|| శారద కౌముదీ సాంద్రాభ్రశోభతో । - నొయ్యారమొలికించు నొక్క వేళ,
నిప్పులుగురియించు నేత్రగోళములతో - రక్కసిత్వము జూపునొక్క వేళ,
చిఱునవ్వులొలికించు చెలువంపుమోముతో మక్కువల్ మురిపించు నొక్క వేళ,
ఉగ్రాకారుణాక్ష్య, వాగుపల వర్ణంబుతో నుద్ధతుల్ గాండ్రించునొక్క వేళ,

గీ|| ధిక్కరించిన వారల యుక్కడంచు, । శరణు జొచ్చిన వారల కరుణజూచు,
శాతవము జూపువారి నాశనమొనర్చు । నాశ్రయించిన వారల కభయమిచ్చు.

చ|| మదగజ, సింహ, ఖడ్గమృగ మండలి, వ్యాఘ్ర, లులాయబృందముల్
మొదలగు జంతు లవ్వనిత ముష్టి హతిన్ జెగడొంది సన్నలన్
మెదలు, భుజంగములు వణకు; మేదిని వార్ధి వనాద్రి పంక్తితో
నదరు తదంఘ్రి ఘట్టనల, హుంకృతి దల్లడిలున్ పయోవముల్.

సీ॥ మధుర పుష్కర పూర్ణ మంజులకాసార - విసరముల్ కనులకు విందు చేయు,
నళినాకరమ్ముల నాళీకముల నిత్య - నవశోభ కనులకానంద మొసఁగు,
కంజాత వీధుల గదలు రాయంచల - నివహముల్ కనుల పండువ లొనర్చు,
అంచ బాలికలతో నాటాడు చిఱుమీల - గుంపులు కనులకు నింపుగొలుపు;
గీ॥ అచటి తరువులు కనులకు హాయిగూర్చు, అచటి ప్రకృతి కనులకు నాస్వాదమగును,
అచటి జనుల మెప్పు కనులకు నమృతసార, । అతుల మా 'పద్మవన' దేశమవనియందు.
తే॥ పద్మదేశము నుండి శైవలిని చేరె । చంద్రదేశంబు గగన సంచార మేఘ,
చుంబితోత్తుంగ భంగయౌచు, తరులతల । గుల్మచయముల పడిద్రోసికొనుచు సరచె.
తే॥ దక్షశపిత శశాంకుఁడా ధరణిఁ జేరి । నీల నది చెంత వసియించి నిష్ఠురంపు
తపమునను పొందె మాసార్ధ విపులవృద్ధి, కాన, నది "చంద్రదేశమై" గణుతి గాంచె.
తే॥ అచట ప్రవహించి స్త్రీల రాజ్యమును జేరె । సుమములను బోలె, పారావతములబోలె,
వంచలను బోలె భామినులలరు సీమ, । వారి ప్రాజలనంది దీపనమొసంగె.
శా॥ స్త్రీయే సృష్టికి మూల, మాకరము, పృథ్వీ మర్త్యవృద్ధి స్థితి
శ్రేయంబుల్ మహిళాప్రసాదములు, నారీ సేవకా వృత్తికిన్
ప్రాయ బాదున బుత్రపుత్రికల నుత్పాదింప జన్మించు స
ర్వాయుష్కాలపు బానిసల్ పురుషు, లే న్యాయంబు క్షేయంబటన్.
క॥ ఆధికృతి, యధికారము, । నేధిత సర్వాధిపత్య, మిల నరమాతం
గా ధోరణ శక్తియు, యో । షాధీనంబని యెఱుఁగుదురచటి వివేకుల్.
చ॥ కలవు కుటుంబముల్, పురులు గ్రామములున్ జననీ ప్రపాలితం
బులయి, తదంతరంగనలు పూరుషులార్జన చేయు సొమ్ము వా
రల యిలు పెద్దగంటగును, రాజ్యము రాజ్ఞి, దమాత్య మం
డలము, చమూపతులే, వివిధ నాథులు పాలకులంగనా మణుల్.
మ॥ చలికాలంబునగాని దేహముల నాచ్ఛాదించుటల్ లేని యా
లలనా రాజ్యము కామ భోగ విలసల్లాంపట్యమైనన్, ప్రజల్
మొలలన్ జేలము జుట్టసాగి, నియమంబుల్ వేష భాషాదులున్
వెలయన్ జేసిరి; పూరుషాళికిని తప్పెన్ స్వేచ్ఛ తద్రీతిగన్.
ఆ॥ ఇల్లు వెడలి వీధి నేనరుండేనియు । నాఁడు తోడు లేక యరుగ జనదు;
ఇరుగు పొరుగు యువిదలింటికి వచ్చుచో । తలుపు వెనుక కేగి నిలువ వలయు.
ఆ॥ ఆస్తిపాస్తులందు హక్కులంగనలవి; । పెత్తనంబు లింటి పెద్ద స్త్రీవి;
బిడ్డలున్న యతివ వేఱింట కాపుర । మునకు నాస్తిపంచుకొనగవచ్చు.

చ॥ మనుజుల పూజలన్ దనిసి, మన్ననలన్ బరితుష్టి నంది దీ
వనల, వరంబులన్ రుచివాక్కుల భాగ్య, మరోగ, మాయువున్,
జనులకొసంగుచుండి. యొక సాంధ్య పరాగ వసంతవేళ న
మ్మనమున నెంచితిన్ నదిగమారితి యుదీచ్యము గాగజంపగన్,

క॥ అనదిని నేన, కావున, । దానికి పూజాదులిచ్చి తనుపుడికపయిన్;
నేనెపుడు మీకుగూర్తును । నానా విధ రక్షణంబు నా సుతులారా !

వ॥ అని తెలిపిన,

ఆ॥ ఆమె కష్టు చెప్పుటపరాధమగునని, । ఆమె తమ్మువిడుటకార్తి జెంది,
ఆటనె నదిగ నుండునని కొంత యోదారి, । మిశ్రభావగతులు మెదలమదుల.

ఆదిశక్తి నీల (నైలు) నది యగుట :-

ఆ॥ వెడల జనము, లంత వేకువజామున । భూరి వర్ష ధార పుడమి గురిసి,
ప్రొద్దుపొడుచువేళ నిద్దుర లేపించె । పెద్ద హోరు చెవుల దద్దరించి.

తే॥ కలఁగి మేల్కాని శబ్దదిగ్గమనులగుచు । నచట గనిరి మహా ప్రవాహమును, భూమి
దొలచుకొని, దూసుకొని పోవు తోయ గాంచి । నాదిశక్త్యవతార, నీలాఖ్య నదిని.

మ॥ ఫలదుర్వారమహావార వాహమయి, విభ్రాంత ప్రజా స్తోమమై;
సతత స్పర్శన వీచికాభ్రమణ చంచత్సక్ష భీతాండజ
ప్రతతిధ్వాన విమిశ్ర భంగనివహ ప్రాదుర్భవద్ఘోషమై,
కృతఫేనావృతమైన నీలనది పొంగెన్ పాత్రశంఖాబ్ధికిన్.

తే॥ అపుడు కూడిరి కర్తవ్యమరయ జనులు; । "ఆదిశక్తికి నరబలి యవసరంబు,
కాన, నిచ్ఛమై రండెవ్వరైన" ననిన । పలికె నిష్టాగ వృద్ధ దంపతుల జంట.

తే॥ ఆ జతకు నప్పుడిడి తృప్తి భోజనములు, । చెల్లయాకుల, పూల భూషితులజేసి;
పడసి యూరెల్ల వారి దీవనల, నీలనదికి గొని చని కంఠముల్ నఱికి రచట.

తే॥ ఎల్లరకు బొట్టిడిరి రక్తమంచుకంత, । నీట బడవైచి తలల మొండెముల, భక్తి
నర్పణమొనర్చి, పూజించిరా స్రవంతి । నాదిశక్తిని హృదయ భయంబు తీర.

తే॥ ప్రాణికోటికి సహజము భయము భ్రాంతి, । దాని నుడుప నరబలి యుపాయమయ్యె,
అంతగా వివేచన వివేకాదులెఱుగ । జాలని యమాయకపు నాడు జగతినెల్ల.

చ॥ తమనిక కన్నతల్లివలె నత్తటినీ మణి ప్రోచు నెల్లకా
లమునను నమ్మకంబు జనులన్ గలుగన్, గని, యా కుమేరు దే
శమును గమించి, 'పద్మవని' చాయకు మార్గము తీసె మారుతో
ద్గమున హతంబులైన జల ద్రవజమట్లు ప్రవాహ వేగమై.

వ|| ఆ నీల నది.

తే|| అచట నుండి "బెర్బెరము" ను, నచటనుండి । ధీభ్యమని యెడు నీజిప్టు దేశమునను
మెలఁగి యానీలనది "శంఖ" జలధి గలసె । 'మెడిటరేనియ' నను నేఁటి కడలియందు.

క|| హరి, కింపురుషఘులందును, । వరుణుదెసన్ నీలతటిని పరిసరమందున్,
యిరుతావుల నడి సీమల, తరతరముల నిలిచిరి మన తాతల తాతల్.

వ|| అంతియకాక, నేఁటి భారతదేశమండలి పశ్చిమ ప్రాంతమున, ఈ నాఁటి బెలూచిస్థాన్, సింధ్, దక్షిణపంజాబ్ ప్రాంతములందును వారు నివసించిరి.

తే|| ఈ చరిత్ర కారణమున నేదినంపు । బ్రాహ్వియను బెలూచిస్థాన భవ్యభాష
ఆంధ్రభాషా కుటుంబమునందు చేర్చ । బడుట జరిగెను, మనకది భ్రాతయగుట.

వ|| ఇట్లు కాలము సాగుచుండ,

కురువర్షమున ఉప్పెన :-

ఉ|| ఉత్తరతీర భూమి మిహికోదధి బాడబవహ్ని పుట్టి, యు
వ్వెత్తున భంగసంఘము మహోద్ధతి లేచి, మహీరుహాగ్రముల్
చిత్తుగముంచి పుష్కర పరీకృత భూరి విశాల ధాత్రియై,
మొత్తముగా హరించె జనమున్, పశు జంతు, విహంగ సంహతిన్.

ఉ|| అంతకుముందు శీతల మహానిలముల్, పెకలించి వృక్షముల్,
జంతు నరాదులన్ దమ నిశాంతములన్ జొరజేసి, వీచి దు
ర్దాంతత నొక్కజా, మిఁక ప్రశాంతత బూనెను, స్తబ్ధమయ్యె; నొ
క్కింత తుషారవారి కురియించెను. మబ్బులు చిన్న జల్లుగన్॥

శా|| వాసంతాంత విహాయ సాంద్రములు గప్పన్ సాంధ్య శోణ ప్రభన్,
వాసెన్ ఘస్రము కాచ చీఁకటి కమావాస్యంబు తోడై, ప్రజన్
గానీన్ జెట్టెను మధ్యరాత్ర్యుత విపత్కాలంబు ప్రాప్తించె' భూ
వాసుల్ గాటపు నిద్ర మై మఱచి, సౌభద్రాత్ములై తూఁగుచోన్.

తే|| వేయినాల్కలజాతవేదు వోలె । పగలు పట్టిన త్రాఁచయి, పడగ విప్పి
భంగసంఘత మొక్కటై పొంగిపడియె । పంచి పెట్టుచు మరణంబు ప్రాణులకును.

ఉ|| ఎక్కడవారినక్కడనహీ నబలంబున నీట ముంచి, పె
న్నుక్కిరి బిక్కిరిన్ జనుల నూపిరి వీడగ జేసి నిర్దయన్,
పెక్కుడు యోజనంబు లతివేగమునన్ బయనించి. యాగి పెన్
చక్కగ దారితీసె నిజసాగర గర్భమునన్ వసింపన్.

తే|| తిరిగి కదలికే మఱిలేదు కిరటమునకు । బలమధికమయ్యె తొల్లిటి బలము కంటె
పుట్టమెట్టలు, నిండ్లును, భూరుహములు । దాని లాగుడు శక్తికి తాళవయ్యె.

తే|| అబలోద్ధతి పెక్కుంద్ర యసువులుడిపె; చెట్లు, మొక్కలు, లతలు నిర్జీవమయ్యె,
జలధి చరములు తెరలి భూస్థలిని మడసె, అంబుదశ్రేణి కార్చెనుష్ణాశ్రుధార.

ఉ|| వేకువజామునన్ జలులు భీకరమై, సకలోత్తరోర్వి యా
తాకిడిన్ శిలాభ మవిదారకమైన హిమంబు కప్పి, శ
వాకృతి దాల్చె, భూగత గృహంబుల నింకను జీవులున్నచో
రాకలు పోకలున్ జరిపి రక్షణ చేయుట కడ్డు నిల్చెచున్॥

ఉ॥ ఉప్పెన నీట దేలి, గమనోద్ధతి బోవుచు చెట్ల కొమ్మలన్
జప్పున బట్టి, కొందఱు భుజంగ చయంబులతోడ మృత్యువున్
దప్పకొనంగ జాలి, చలి దప్పిక యాకలి బాధలోర్చి, పెన్
ముప్పుగమించి చెట్లు దిగి ముందటగాంచిరి ఖేదదృశ్యముల్

క|| ఆ రేయి నటుల బ్రదికిన । వారలలో గలరు వసుధ భాగ్యము కలనన్
భూరి జ్ఞానులు, వేదా । పారవిదు లిరువులు సుజన వందిత చరణుల్.

సీ|| ఏ వంక జూచిన నావంక మృతజంతు - పశుమానవ కళేబరశతంబు;
లొండొరుల కౌగిలి నొదిగి గేహములందు - మరణమొందిన యాలుమగల శవము;
లక్కున జేరి పాలానుచు మడసిన - బిడ్డల తల్లుల పీనుఁగులును,
పసి, పడుచు, నడివయసు, ముసలి తనము - విలువ మన్నైన బొందెల చయములు;

గీ॥ మిత్తి బలవంతముగ నీరు మ్రింగ జేయ,।నుబ్బి యుప్పు నీటను నాని, యొరసి యుడికి
ప్రేతకళకప్పి, కట్టిగా బిఱ్ఱబిగిసి । యక్కడెల్లను పడియుండె దిక్కుమాలి.

సీ|| ప్రాణమారిన శరీరముల పజ్జల జేరి - వాడిముక్కుల జీల్చు వాయసములు;
ఏ చోటు నుండియో యేతెంచి, యటుప్రాలి, - గుమికూడి, గెంతుచు ఘోరభంగి,
ప్రేవులు కండలు పెకలించి, కడుపార - భక్షించి, త్రేన్చు రాఁబందుగములు;
వివిధ దేహాంగముల్ భీభత్సముగ బంప్ల - గొఱికి చీలిచి, మ్రింగు కుక్క, నక్క.

గీ॥ వెలుగు బంటులు, తోడేళ్లు, పులులు, నఖులు,।ముక్కుల దొలచి,మాంసముల్ మెక్కనీటి
పక్షులున్, గొక్కెరలు, గృధ్రవాయసములు । కోర్కెలీడేర విందులు గుడిచెనచట.

సీ|| ఎంతొ రుచిగనున్నదీ తొడ, తినరమ్మ - భామినీ ! యనెడు రాఁబందు మగండు;
ఈ నాలుకల రుచి ఏనాడు నెఱుఁగము - ప్రేయసీ । తినుమను విహఁగభర్త
ఈ మెదడు రుచికి నేదియు సరిరాదు - పిల్లలార ! యనెడు తల్లి పిట్ట;
ఏ నాఁటి పుణ్యమో ఈ పీనుఁగుల పంట - కదలి వేరండను కాకిగుంపు;

గీ॥ గుడ్లురిమి, పండ్లు బిగపట్టి, ఘుర్ఘురించి । యరచి, మొఱిగి కఱువఁదూఁకి, యాగ్రహించి,
దగ్గఱకు వచ్చు మృగముల దరుము జంతు। జాలముల మధ్య దొరలె కంకాళ చయము.

సీ॥ అపుడు గ్రీష్మారంభమైనను తత్సీత - కురుసీమ శవములు కుళ్లుకుంట
భోజ్యముల్ పలునాళ్లు భోక్తల జఠరముల్ - తిరికగ పూరించి తృప్తిఁగూర్చె,
పిదప పురుగులోడి, భీషణ దుర్గంధ - మంకురింప జేసె నన్ని రుజలు,
కాకులు, రాఁబందు లాకలిగొని, కుళ్లు - క్రిములతో మెక్కెను ప్రీతితోడ

గీ. ఆగతులు చావుతప్పిన యచటి జనులు । వ్యాధి తో కొందరు సురలు వాసిరచట;
ఎప్పు, డేరీతి, నెచ్చోట, నెవరికిలను । తీరునో కాలమేరికి తెలియగలదు ?

క॥ జల నిధిపొంగిన కథ విని, । యలజడిపడి, బంధు జనములాయుప్పెనకున్
బలియైరో బ్రతికిరోయని । తెలిసికొనం జనిరి నికట దేశనివాసుల్ ।

తే॥ తరలిచని, చూచి డెందముల్ దద్దరిల్ల । భూరి దుఃఖాశ్రువులు వర్షధారలట్లు
రాల్చి, తీరనియార్తినిట్టూర్చి, యార్చి । భగ్నహృదయులు చింతానిమగ్నులైరి।

సోమకుని కథ :-

---

క॥ సోమకుఁడను నొక మూర్ఖుఁడు । భీమబలుఁడు ధూర్తుఁడుగ్ర భీకర రూపుం
డామనుజులమధ్య నిలిచి । వ్యోమము మార్మ్రోగ ఘోర పూర్ణుండయ్యెన్.

ఉ॥ వాని మనంబునన్ మెఱుపువల్లిక వోలె స్ఫురించె, వేదవి
జ్ఞానధనుల్ భువిన్ వెలుఁగ, సంద్రము పొంగగనేల ? పొంగినన్,
మానవరాశి నీగతిని మారొకని ముంగగనేల ? అఫదల్
జ్ఞానులు ముందగా నరసి, చాటక మిన్నక యుండు టేటికిన్ ?

మ॥ అని, యాజ్ఞానులు యొద్దకేగి, "ఇటులన్యాయంబు వాటిల్లె, ను
ప్పెన రాకన్ గమనించి దేవతల సంప్రీతాత్ములన్ జేసి, ము
ప్పు నివారింపక పోవుటేల కలిగెన్ పూర్ణంబుగా దెల్పి, నా
యను మానంబును దీర్పుఁ"డంచడిగె దుఃఖావేశ కోపోగ్రుడై.

వ॥ అనిన సోమకునకు వేదవిదులిట్లనిరి

చ॥ అనవరతంబు దేవతల కందఱకున్ మనసార మ్రొక్కి, భ
క్తిని, తగురీతి, వారిమది తృప్తిపడంగ నివేదనార్పణం
బొనరిచి, భీతి దక్కి యుంటనుండగ, నించుక నెట్టి సంజ్ఞయున్
మనకు లభింపజేయక, నమానుష వైఖరి దాల్చి రేటికో.

మ॥ ఇసుమంతైనను ముందు మేమెఱుఁగుచో, నే హెచ్చరింపో యొకం
డొసఁగన్ జాలెడు వార మేము మదిలో నూహించి, ఈ దేవతా
విసరం బిట్లొనరించు టక్కజము గొల్పెన్ మాకు, తా
వసులైనన్ దెలియంగ లేరుకద దేవవ్రాతహృత్ప్రేరణల్.

ఆ॥ "చావును పుట్టుక సహజము । జీవులకు కిల; దేవతతుల చెయిదములకునే,
లా వగపేల; దుఃఖమువల; । దేవిధిగుందినను వత్తురే మృతులిద్దరకున్.

వ॥ అనిన

తే॥ అనియె సోమకుఁడది విని; "యార్యులార! । ఇంతమాత్రమెఱుంగుదు నేను గూడ,
సహజమే యొక్కరేయిని చావులిన్ని ? వీని వారింపలేని మీ వేదమేల ?

మ॥ "ఈ చక్కట్లు వినంగరానివటకే నీ దుస్మృతులే నేఁడు మీ
వాచా ప్రౌఢిమ ప్రాణమొందుటనొ, తత్ప్రాప్తంబు లేకున్నచో,
ఈ చావుల్ కలుగన్ కతంబు లెవియో యీ వేద వాక్శ్రేణిలో
నేచోటన్ బరికింప నేనొకని, మీరీనాఁడు తేల్చన్ వలెన్.

తే॥ వేదవిదుల కసాధ్యంబు లేదు, మీకు । గతము మఱపింప సాధ్యము కానియెడల
ఇట్టి యుమ్మడి మరణంబు లింకముందు । కలుగకుంటకుపాయముల్ తెలియవలయు॥

వ॥ అనిన సోమకునకు నార్యులుపలికిరి "దేవకోపవహ్ని తెచ్చుముప్పు,
వారు తృప్తులైన ప్రజలు సుఖింతురు, । తెలియలేము వారి తృప్త్యతృప్తి.

తే॥ "వారు దయయుంచి సూచించుపట్ల తప్ప । అరయజాలము రానున్న ఆపదలను,
వారు స్ఫురింపజేసెడు పట్ల తప్ప । కానరావదలకు కష్టకారణములు.

తే॥ "నీవడుగు ప్రశ్నలకు వేద నివహమెల్ల । ఎన్నిసారులు వెదకిన, నింతకంటె
దొరకదు జవాబు, కాన నీ దుఃఖమేది । ప్రాప్తకాలజ్ఞుఁడవు కమ్ము పట్టు వీడి."

వ॥ అనిన, నా సోమకుఁడు

తే॥ "ఎందలేదది మఱయ, మీరిరువురిట్లు । చావుకనుకప్పి మనుట మీ స్వార్థ పరత
కొకనిదర్శనమును, మృతులకు సవాలు, । దుస్సహము నాకు, వారి బంధువుల కెల్ల.

తే॥ "మీకు గనువిత్తునొక యేడు, మూఁకమిత్తి । తప్పెడు విధంబు దెలుప వేదములవరసిఁ
కాక తక్కిన మీ చావుకనులజూతు, కానిచో సోమకుఁడను కాను నేను."

తే॥ అని, యనుచరులను బిలచి, ఆ యిరుపుర । నుత్తరపయోధిలంకలందొక్కచోట
ఖైదు చేసెను, బహుకోప, ఖేద, మూర్ఛ, । ధూర్త, తాపమిశ్రిత మనోద్వేగుఁడగుచు.

తే॥ వారితో నాగకుత్తర వర్షభూము । లందుగల వేదవిదులను ముందు ఖైదు
నందిన విదులలో జేర్చి, "యందఱొక్క । పెఱవు వెలువుఁడుమ్మడి చావు పృథ్వి వీడ."

తే॥ అనుచు నోచ్చరించిన సోమకాఖ్యుమదికి । తృప్తిచేకూర్చు మార్గమదృశ్యమగుట,
పారిపోయెడు మార్గమప్రాప్తమగుట, చర్చలొనరించిరచట విచారపడుచు ॥

చ॥ తలఁచిరి వేదవిద్యల నుదాహృతులైన సమస్త దేవ మం
డలముల, నర్థి వేడిరి కటాక్షు, మిలాతలమందు మూఁక చా
పులిఁక నివారణంబగు నపూర్వ విధాన శుభోదయంబుకై
కొలిచిరి రేబవళ్లతియకుంఠితభక్తి దదేక దీక్షతోన్.

తే॥ అటుల తమకు స్ఫురింపఁజేయుట సాధ్య । మైన, తగిన ప్రత్యామ్నాయ మాత్మనెంచి
సోమకుని దృష్టిఁపరచువచోవిధాన । మైన కోరిరి దేవ సంహారిని విదులు.

తే॥ ఇట్లు ప్రార్థించు నా విబుధేంద్రులెల్ల । తమకు పట్టిబంధించు నుద్ధతున కెట్టి
హానియును కోర, రదియె విద్యయును, బుద్ధి । జ్ఞాన సంపదయు గల సజ్జనుల తీరు.

తే॥ ఇది యటుండఁగ, వేదవిదుల మాట । జ్ఞప్తికిని వచ్చె నొకనాఁడు జనుల కల్ల
పుత్తడిగిరి చేర కడలి పొంగువార్త; । అలజడి జనించె పలుహృదయములందు.

తే॥ చదువులును వ్రాత లెఱుఁగని సత్యకాల । మగుట, వేదముల్ మెదడులయందునిలిపి
రట్టి పూజ్యుల సంఖ్యయత్యల్పమగుట । వెదకి రుప్పెన పిదప కోవిదుల కొఱకు

తే॥ తెలిసె నుత్తరకురుసీమ జలధి మునుగ । బ్రదికిరని యెట్టులో యొక విదులజంట
ఆ ద్వయము, రమ్యక హిరణ్మయమ్ముల నేఁడు । గురును, బంధితులనుచు నుత్తరపు దీవి.

ఉ॥ ఆమెయి పెద్దలన్ని విషయంబులు పూర్తిగ సేకరించి, యా
సోమకుఁడాసి, "యేటికి విశుద్ధ జనంబుల వేద విజ్ఞులన్,
ధీమతులన్, జనప్రియుల, ధీరుల, శాంతుల, మాన్యులన్ మహో
ద్దామము మీఱ నుంచితి వుడన్యపు టవ్వలిదీవి; సోమకా !

ఉ॥ ఇక్కడనక్కడన్ బలుపురించుక యించుక కాని నేర్పరే
పక్కన నైన ముఖ్యమగు పన్నములన్, భవదీయబంధితుల్
చక్కగ నేర్తురన్నయును సాంతముగా, నిఁక వారు లేనిచో,
దక్కదు భూమి కాగమకదంబము, ధర్మము నేలపాలగున్.

వ॥ "కాన, వారినివిడువు" మనిన జనులకు

చ॥ జరిగినదెల్ల వాఁడు కడు సత్యముగా వివరించి, యిట్లనెన్.
"నరులకు మేలు చేయునని నమ్మియనాదిగ వేదరాశులన్
శిరముల నుంచుకొంటిమి, సుశీలురు, పూజ్యులు భక్తి వానిసిన్
దరతరముల్ పఠించి, రపి తప్పక రక్షణ గూర్చు వంచిలన్."

తే|| "అట్టిచో నున్నతము యోజనాయతంబు । నైన కెరటము వసుమతి పైనబడియె,
వార్ధిమునిగె నాయుత్తర వర్ష మెల్ల, । మడసిరెల్లరు నొక్క పదిమంది తప్ప."

తే|| "వేదములు మనకపుడిపలేదు రక్ష; । వేద విదులును కాపాడలేదు జనుల;
నాటకము విజ్ఞులను వారి పాటవంబు, బూటకము వేదమని నాకు తేటపడియె."

మ|| "ధ్రువమైనన్ మదికిట్లు, వేదములనే తూష్ణీకరింపన్; వెసన్
వివరం బేర్పడ, లోతుగా నరసినన్, వేద్యంబగున్ ముప్పు త
ప్పు విధం బెయ్యొక యోడ సంగి గడపున్, మున్ముందుకున్ మేలగుం
చవకాశంబును, గౌరవంబొసగి తెవ్వ వైదిక శ్రేణికిన్."

తే|| "పట్టుపడునేని మార్గమే వైదికులకు । వేదకీర్తికి భావి పృథ్వికిని మేలు;
పట్టుపడదేని, వేదము వైదికమును । మోసమని తేలి ప్రజల యామోదముడుగు."

తే|| "అనుపయోగములట్టియధ్యయన తతులు; । జనుల బెదరించి వ బెట్టు సాధనములవ్వి,
ఇట్టిమోసమునే సరికట్టదలచి । హాతమొనర్తు వారి నీవత్సరాంతమందు."

వ|| అనిన సోమకునకు పెద్దలిట్లనిరి.

తే|| మేదినికి దేవదత్తముల్ వేదచయము; । లిచ్చ మేరకు దయతోడ నెఱుంగజేసి,
తక్కినది మానిరా దేవతా గణంబు; । చేయగలదేమి, మనమింక చెప్పుమీవు.

తే|| "తెలుపనిది తెలుపలేదని । తెలిపినది నశింపజేయుదివురుట మేలే ?
అలవిక మించిన పనికై । బలవంతము చేయమనకు పాడియె, బుధులన్ ?"

తే|| వేదములనందఱకు వలె విశ్వసించి, । రంతియేకాని దుర్బుద్ధి నవతరింప
చేయలేదా యవమాయకుల్, చెఱను మాన్పి । విడువుమింక సోమకా ! వేదవిదులనెల్ల.

వ|| అనిన, నంగీకరింపక,

క|| "వచ్చెడు ముప్పును దెలియక । వచ్చిన ముప్పులను త్రిప్పిపంపగలేక,న్
హెచ్చుగ జ్ఞానము ద్రచ్చని । పిచ్చికు వేదజ్ఞులేల ? వేదములేలా ?"

తే|| "శక్తి లేనట్టి యీ వేదచయములుంట । గ్రుడ్డిగా వాని పాలించు కుబుధజనులు
బ్రతికియుండు భువికి శుభంబుకాదు; । కాన, చనుడింక ప్రజలపై కనికరమున."

వ|| అని సోమకుడనిన

ఉ|| ఓటమినంది పెద్దలు "పయుక్తమె మూర్ఖుని యొద్ద సామముల్ ?
మేటి భుజాబలంబు తల మీదకు దెచ్చెను, వీని కన్ను; లిం
కేటికి జాగు వేగముగ నేగి చెఱన్ విడిపింప మాన్యులన్ ?
చేటును కోరి రమ్మను కుచిత్తుఁడెఱుంగున శాంతి మార్గముల్ ?"

వ|| అని తలపోయుచుండ

క|| బలిమిని విజ్ఞుల గొనిచన । దలకొందురు పెద్దలనుచు దలంచి యతండున్
జలమున నుత్తరలం కా । నిల యుండై మూంక తోడ నిలిచెను పోరన్.

వ| పెద్దలు పైన చెప్పినట్లు తలపోసి

మ|| అని, స్వర్ణాచలభూమి నొక్కసభలో నాలోచనల్ చేసి, వా
ర్ధిని క్షేమంబుగ నీదు నాయకుని సాధింపంగ, నాలంపు వా
హిని తోడన్ జనె నుత్తరాబ్ధి; కిది యూహించెన్ మదిన్ ముందు, కా
వున, నా సోమకుండడ్డగించె నొక గుంపున్ దెచ్చి, యాపోయనన్.

మ|| సముదాహార్య గరుత్సమూల దళనోత్సాహ ప్రకోపజ్వల
న్నముచిధ్వంసకులీల, జృంభిత బలోన్నత్యస్ఫుర ద్వీర వి
క్రమ సంఛేదిత శత్రు మస్తక సహస్రస్తోముడై, శీతకుం
భమ సీహభ్రన్నికటావనీ జనులు చేపట్టన్ జయశ్రీ నటన్;

ఉ|| సోమకుడోడి పోవ, నిసజొచ్చెను బంధితులున్న ద్వీపమున్,
హేమన గోర్వినాయకుడు నిజబలంబున నబ్ధినీది, యా
సోమకు ద్వంద్వయుద్ధమున శోషితు జేసి, హరింప బాణముల్
భూమిని ప్రేల్చె వాడు ఘన భూరుహమూర్విని వ్రాలు కైవడిన్.

తే|| వేదవిదులను చెఱవిడిపించి పంపి । రవరి సీమకు వారిని హేమగోత్ర
నికటవాసులు. వారి నాయకుడు నపుడు, । ధన్యవాదములర్థించి తరల నిడులు.

తే|| పెనుకపలి మత్స్య మటులీది వినుతిగొన్న।నాయకుడు 'మత్స్యమూర్తి' గ నామకరణ
మంది, భూజనుల ప్రశంసలందె, నిదియె । ధరణి రూపొందె మత్స్యావతార కథగ.

వ|| అంతట

ఉ,| ఉర్విని కాంచనాద్రి కడనున్న ఇలావృత వర్ష మెల్లెడన్
సర్వజనంబు సోమకుని చర్యకు గొందలమంది, వేదముల్
నేర్వవలెన్ బ్రసంఖ్యనని నిశ్చయులై పఠియింప నెంచగా
బర్వెను వాంఛ, భావిదిన భద్రతకై పలువర్ష సీమలన్.

చ|| ఒనర హిరణ్మయంబున, దదుత్తర వర్షమునందు వేదవి
ద్యను మననం బొనర్చిన వదాన్యుల దోడ్కొని వచ్చి, యభ్యసిం
చను మొదలైరి లావృతపు సజ్జను, లయ్యని యొద్ద నంజనా
తనయుడు సర్వవిద్యలను తత్పరతన్ విని, నేర్చినట్లుగన్.

తే॥ వలస సీమలగుందును తొలిసివాస । సీమలను సంఖ్య పెరుగుట జేసి జనులు
తరలి యేగుచు నుండిరి తండములుగ, । వ్యక్తులుగ, మాటిమాటికి వలసగొనుచు.

క॥ తొలివలసలదరి తావ్రలు । తొలి సీమలదరినెసంగు తొల్లిటి వలసల్
సులువుగ క్రిక్కిరియుటచే । బలితంపు సమస్యలుద్భవంబయ్యెనటన్.

క॥ ఉత్తరవర్షంబుల గించిత్తైనను చోటులేని స్థితి ప్రాప్తింపన్,
దత్తరమున తొలిసీమకు । దత్తటపుంబూర్వ, వరుణ, దక్షిణములకున్

క॥ తరలగ జొచ్చిరి సంతత । గురుతర బృందముల వేలకొలది జనంబుల్;
సురుచిర వేదజ్ఞానము । ధరణిన్ వ్యాపింపసాగె దిన్మూలమునన్.

తే॥ ● ఇలావృత సీమ 'కశ్యపుం'డనంగ । నుత్తముండు వేదవిద్యాజ్ఞుడొక్క ఘనుడు
నైరృతి సముద్ర తీరమున నివసించె, । నతని పేరున నది *కశ్యపాబ్ధియయ్యె.

ఉ॥ చక్కగ వృద్ధియై యతని సంతతి సంఖ్యను పెక్కు పల్లెలన్
చుక్కలు సంఖ్యపై మోయుచు చొప్పున, కొన్ని తరంబు లేగగన్,
మిక్కుటమయ్యె సంఖ్యలట, మేదిని మోయగ జాలదయ్యె, నీ
చిక్కును దీర్ప కాశ్యపులు చేరిరి యోచన చేయ, నొక్కచోన్.

మ॥ "మనలో కొందఱు సౌమ్యవారుణ దిశామార్గంబులన్ దూరమే
దినులన్ జేరుట యుక్తమా । సచట పృథ్వీభాగముల్ సందె" నం
చని రత్యున్నతి వృద్ధు, "లచ్చటి యసంఖ్యాకులే మమున్ నెక్కుడున్
జనుమంచాలము చేయరే" యనెడు ప్రశ్న శ్రేణి కావృద్ధులున్

వ॥ జవాబిచ్చుచు

సీ॥ యామ్య; వారుణముల నధికంబుగ ననా - క్రమిత భూభాగముల్ గలవు చాల,
ప్రజలకు తిండియు, పసులకు మేతయు - సులువుగా లభియించు స్థలములవ్వి,
ఒకచోటకాకున్న నొకచోటికేగుట - కవకాశమక్కడ నపరిమితము;
ఆ ప్రాంతముల నుండి యప్పుడప్పుడు వచ్చి నెడలువారలు చెప్ప విషయశుద్ధి,

గీ॥ భిన్నమిా యున్నట్టి నిలావృతము దీన్య । వర్షములు జన సాంద్రతా బాధితములు,
ప్రాచ్యవర్షము వానితో పాటిసంద్రు । రఖిలహితముగు మామాటలాడరింప.

తే॥ అనిన విని, పిన్న "లాకాంచనాద్రిదరిని । కరతలామలకము జనగణసుఖంబు,
కరతలామలకమిక్కడి కష్టవితతి, । యటకు మనమేగు టుత్తమమౌనుకాదె ?

* కశ్యపాబ్ధి = Caspian Sea

తే|| అనిన, వృద్ధులు "జనులు కష్టార్జితముగ । బడయు చుందురు సుఖ, మిల్లు పైడికొంప
నైన కష్టార్జితమె సుఖ, మధికజనము । తగ్గకుండిన నిలువదు తత్సుఖంబు.

తే|| "వలసపోవలె స్వర్ణాతివాసులైన, । ప్రజ లెక్కడ దీర్చెను పనియొ, సాగొ,
వేటయో, పశుపాలవో విధిగ జేసి, । పాటు పడవలె కొంగ్రొత్తచోటులందు."

వ|| అని విశద మొనర్చిన, కొందఱు యామ్య, వారుణములకు బయనమైరి. కశ్యపాద్రి ప్రాంతమున

మ|| ప్రవహించెన్ 'దితి' యన్న దే యొకటి తత్ప్రాంతంబునన్, దన్నటన్
నివసింపన్ నెలవై, కుటుంబములు పొందెన్ 'దైత్య' నామంబు, వే
సవి కానిమ్ముగ యెండిపోవ, పెను కష్ట ప్రాప్తికిన్ గ్రుక్కి, వ్రా
ద్ధన దుఃఖానల జాతకోపశిఖలన్ వాక్పాళినాకించుచున్.

వ|| దైత్యులిట్లనిరి.

మ|| "తన వేదప్రభకోడి, మేఘములమధ్యన్ దూఱు మార్తాండుం ద
త్యన్న సద్యోన్నత కీర్తికశ్యపుని దేహాంబందు జన్మంబు నం
దిన మమ్మాదలడాల్చలేరె కనకాద్రి ప్రాంత సద్వాసు, లీ
యనుమానంబులు కట్టిపెట్టి మనకీయన్ గోరుడాతిథ్యమున్"

వ|| అనిన దైత్యులకు వృద్ధ కాశ్యపులిట్లనిరి,

తే|| కశ్యపుని పూర్ణ విద్యాప్రకాశ మెవరి, । కున్నది మనలోన, గౌరవ మొరులొసంగ ?
ఈయవచ్చు నాతిథ్యము నేడునాళ్లు, । శాశ్వతాతిథ్యమిచ్చుట జరుగ దెపుడు.

తే|| "ఇంతమాత్రమున కచట కేగనేల ? । ఇట్లె మిటనాతిథ్య మేము మీకు
"దితి" మడుల నింపవలెను, సందియము వలదు, । వలసగాను వారలింతలో పయనమగుడు"

తే|| అనిన, దైత్యులిట్లనిరి, "మీకర్థమగుట । లేదు మా బాధ, మాకిట లేని సుఖము
వారు కేటికి మేరుపర్వతపు సీమ ? అంపుదుము వారి వలస, కేమచటనిలిచి"

వ|| అనిన వృద్ధులిట్లనిరి :

తే|| "వారికిని లేవు మనకంటె బహుళ సుఖము । అచటివారును వలసలకరుగుచుందు,
కీర్తివ్రతగ, దండులకు మనకెట్టి కార । ణమును లే; దూరకొనుడు కోపమును మాని"

వ|| అనిన, నంగీకరింపక

తే|| "తప్యలార ! చెప్పిరి పెక్కు రచటివారి । సుఖములను గూర్చి తెరగప్ప జూడవలదు,
మాకు చోదినిచో, వారి మారణంబు । కనుల జూతు" మనుచు లేచి చనిరివారు.

తే|| విజ్ఞులును, మూర్ఖులుండే సభ విడచి చనిన । తిరిగి రమ్మనుటుపయోగకరము కాదు
కాన వగవక, కాశ్యప ప్రజలు వలస । కేగు జన నిర్ణయ మొనర్ప సాగిరంత.

ఉ॥ కయ్యము మీఁద దృష్టినిడి కాశ్యప దైత్యులు మేరుసీమకున్
జయ్యన నేగి, యిమ్మనిరి శాశ్వత భూములు, గేహరాజి, సా
హాయ్య మసాధ్యమయ్యెను సహస్ర జనావళి, కంత, కోపునై,
నెయ్యపుమాటలన్ విడచి, నిల్చిరి. కయ్యమొనర్ప సిద్ధమై.

తే॥ అచట పెద్దలలో ధర్ముఁడనెడు ఘనుఁడు । పలికె । "కశ్యపసుతులార ! పాడికావు
కోపతాపంబు, లిట్టి కోర్కులను దీర్ప । నెవరు కొంపలు తీసి మీకియగలము ? "

తే॥ "కాశ్యపులు గాన మిమ్ములఁగారవించి ఏడు దినముల యాతిథ్యమిత్తుమిచట,
తృప్తులై చనుఁడిది మంచి తీరు మనకు, । యుద్ధమేకోర మేమును సిద్ధమిపుడు"

క॥ దురమును కోరగ దైత్యులు । శర కార్ముకులౌచు నెదురు చనిరావేళన్
నర, నారాయణులను । సోదరులాహవనిపుణమతులు, ధర్ముని సూనుల్.

క॥ ఇటు వేయిమంది పోరగ । నటు వేయి జనంబు నిలిచె నాహవ భూమిన్,
పటుతరదైత్యోగ్ర శరః । పటలంబుల వాతబడియె పలు ప్రాణంబుల్.

వ॥ అంతట

మ॥ నిలయాంబోధర మండలోద్భవ మహాశీలాంబుధారాసహ
స్రలసత్ భూధర ఖండితోరు శిఖర వ్రాతావళిన్ బోలి, దై
త్యుల యస్రారుణ రక్తసిక్త వికటోగ్రోన్మత్త శీర్షవ్రజం
బులు డుల్లెన్ భువి ధర్మసూనుల ధనుర్ముక్తాశుగోద్ధూతమై.

మ॥ నరనారాయణ చాపబాణహతి వంధ్య ప్రౌఢులై పాఱుచో
తరుమంగొట్టెను వెంటనంటి చని యోధద్వంద్వ మా దైత్యులన్,
గరువంబంతట నోటనాన్చుకొని, స్వగ్రామంబులన్ జొచ్చి, వే
యరుగన్ సాగిరి యామ్య, పశ్చిమ దిశా హర్మ్యంబులన్ దాఁటుచున్.

వ॥ ఇట్లు.

మ॥ తమ దేవత్వము కోలుపోయి యసురత్వ ప్రాప్తియున్, యామ్యది
గ్గమనా గత్యము ముందుకున్ నడపగా, క్రవ్యాదషండాధిపుల్
తమకున్ త్రోవలు చూప, నైరృతికి శ్రాద్ధస్వామి తెన్ దిక్కుకున్
గమియింపన్ మొదలైరి పూర్వ దిశజుల్ కన్నోటు జెగ్గింపగన్.

ఉ॥ శ్రావణ వర్షపాతమున సహ్యవి నిర్గత వారి పూరమై
శైవలినీ సమూహములు సాగెడు రీతిని, పూర్వ దేవతల్
త్రోవల, డొంకలన్ బడిన దుర్భరఖన్దతి, నెయ్యమిచ్చి, సం
భావన చేసి రయ్యసుర పంక్తుల తొంటి తెలుంగమ ప్రజల్.

తే॥ అచటివారాదరింప దైత్యావళులను । స్థిరపడి, క్రమక్రమంబున జేరుకొనిరి
నీలనది దరిసీమల చాలమంది, । కలసిపోయిరి తొంటి యాగతుల తోడ.

తే॥ "అసురు" లను పేరు వారలకబ్బె; నటులె 'సురలు', । 'దివిజులు' నని మేరుగిరి నివాసు
లొప్పి; రిటు వేగ పెక్కుడు; లుక్కుమీఱి । యాక్రమించిరి సురసీమల సురజనులు.

క॥ సమయము కొఱకై యోపిక । నమృతమథనమువఱకాగి, యసురులు సంగ్రా
మమునకు దిగి; రది రెండవ । యసురాసుర యుద్ధమనఁగఖ్యాతంబయ్యెన్.

తే॥ వేవెలుగులోన వేకీల వెలయువాఁడు, । పైడిమల, కదలి సెజ్జను బరగువాఁడు
లాతిమొత్తములకు మిత్తి. లచ్చిమగఁడు, । గెలుపు గూర్చెను. వేలుపు బలగములకు.

## ప్రియవ్రతుఁడు

తే॥ అంత, సందఱకంటెను. నధికు, సకల పావను 'ప్రియదార్కు' ను ప్రియవ్రతుని వివిధ
ప్రజలు పోరపొచ్చెములు లేక బ్రదుకుటెట్లొ । నిర్ణయము చేయలేక, నా నిశితబుద్ధి.

వ॥ జంబూద్వీపమున హిరణ్య దేశము (Iran) అటనుండి శంఖాబ్ధి, నీలనది, కుమేరు ప్రాంతము వఱకును. శ్యామ, కశ్యప సముద్రముల పరిసర ప్రాంతములను, చాక్షుసానది (Oxus) పశ్చిమమున దానవనది (Danube) ప్రాంతమువఱకును అసుర, దైత్య, దానవులకును. ఉత్తర ధ్రువము నుండి హిమాలయ పర్వతశ్రేణి వఱకును అమరులకును కేటాయించి, సురల భూమికి పాలకుఁడుగ ఇంద్రుని, రక్షకుఁడుగ విష్ణువును గురువుగను, మంత్రి బృహస్పతిని నియమించెను. వారి యనంతరమున అవే పేర్లతో ఇతరులను సురలెన్నుకొనవలెననియు, నూఱుయజ్ఞములుగాని గొప్ప తపస్సుగాని చేసినవారు మాత్రమే ఇంద్రపదవికి అర్హులనియు, పల్లెలు, పట్టణములు గణరాజ్యములై యుండవలెననియు, ఇంద్రుని, విష్ణుని తపోధనులగు మునులు తమ ఇచ్ఛవచ్చినప్పుడెల్ల దర్శింపవచ్చుననియు పరిపాలనాదులలోని లోపములను తెలుపవచ్చుననియు, మునులు ఎవ్వరికైనను ఎట్టి శిక్షనైనను విధించవచ్చుననియు, వారిని మాత్రమెవ్వరును శిక్షింపరాదనియు, ఇంద్రుని, విష్ణుని సురాసుర దైత్యదానవాది నాథులను సైతము వారు శపించి పదవీ భ్రష్టులను చేయవచ్చుననియు ప్రియవ్రతుఁడు శాసించెను. జంబూద్వీపమును తొమ్మిది వర్షములుగ విభజించి, 'ఇలావృతము' మున్నగు పేర్లను పెట్టెను. పశ్చిమమున కుమేరు, నీలనదీ ప్రాంతముల నుండి తూర్పు మహాసముద్రము (Pacific Ocean) వఱకును. (ఆ పరిసర ద్వీపములు సహితముగా) గల హిమాలయాది [Pathai Himalayas, Edbruz, Cancusus etc ] పర్వత శ్రేణుల ప్రాంతమును, దానికి దక్షిణ ప్రాంతమును, దక్షిణ సముద్రపు లంకలును "భా ర త వ ర్ష ము గా" నామముంచెను. కశ్యప సముద్ర ప్రాంతము

అమరేతర దేశముగా నిర్దేశితమయ్యెను. ఇంద్రుని రాజ్యమునందలి ఇలావృతమునకు 'స్వర్గము' అని నామమొసంగెను. అసురాదుల రాజ్యములనేకములు. అసుర, దైత్య, దానవులకు గురువుగను, మంత్రిగను శుక్రుని నియమించెను. సురల జీవితములును, అసురాదుల జీవితములును చాలకాలమవిద్యుక్తముగా జరుగుచుండెను. తెలుగువారు ఇంద్రుని రాజ్యభాగమగు హరి, కింపురుష వర్షములందుండుటచే 'సుర' లైరి.

పశ్చిమ, దక్షిణ వలసజట్లు, - జరామన్యుడు, దక్షుడు

తే॥ దైత్య, సుర జీవితంబులు తరతరంబు । లిట్లు సాగెడు వేళ మహీతలంపు
టుత్తర ప్రాంత సీమల నుద్భవించె । బహుళ జనసమస్యలు తప్పక క్రమంబు.

మ॥ జన సంఖ్యాధిక కారణంబున నుదీచ్య ప్రాంతముల్ నిండి, కాం
చన శైలావృత భూమి క్రిక్కిరియ, ప్రాజ్య వ్రాతముల్ విశ్వక
ర్మను బ్రార్థించి పరిష్కృతిన్ గసితి, దుర్మార్గంబు యుద్ధంబు, స
జ్జన కర్తవ్యము శాంతి మార్గమె కదా సర్వ ప్రపంచంబునన్.

చ॥ వనములు, హార్మ్యముల్, నగరపంక్తులు కట్టిన శిల్పవేత్త యం
త్రనిపుణుడింద్రుని జమును దైత్య విరోధి సుదర్శనంబు జే
సిన రణవస్తు కల్పన విశిష్టవిశారదుడర్క సానప
ట్టిన మహితాత్ముడాతడు పటిష్టమొనర్చెను కార్యపద్ధతిన్.

ఉ॥ దక్షుని నాయకత్వమున దక్షిణభూముల కేగి, స్వీయ సం
రక్షణ పోషణన్ తరతరంబులు వృద్ధినంగ బల్వురన్.
'చాక్షుస' దాటి పశ్చిమ దిశాతలమందలి కేతుమాలమం
దక్షతు పుష్టి వృద్ధిగన బల్వుర నాతడు నిర్వచించుచున్.

తే॥ అపరదిశ కేగు జట్టు నాయకుని జేసె । ఘను 'జరామన్యు'డనెడు "వ్యోతను"కుమారు
విశ్వకర్మ నిర్ణయమును స్వీకరించి । యనుసరించిరి విజ్ఞత గోచరింప.

వ॥ అసురాదులకు కేటాయించబడని భూముల కేగుడని వారిని విశ్వకర్మ శాసించెను.

ఉ॥ మెల్లగ నా ఇలావృత, సుమేరు ధరాధరసీమ వీడి, యు
త్ఫుల్ల భవిష్యదర్థులయి, ద్రుతగ చేకొని ధైర్య సాహసో
త్ఫుల్లవి తాత్మశక్తి జనితంబగు నమ్మకమున్, ముఖప్రభల్
తెల్లము చేయ నిర్భయము, తీరుగ సాగిరి రెండు జట్టులున్.

తే॥ తరలి పెండ్లికి జను జనతండమట్లు । వననిధిని గూడ నురుకు స్రవంతులట్లు,
సేతువును దాటు వానరసేన లట్లు । నడచి కోలాహలంపు సవ్వడులు రేగ

తే|| పదపడగ జరామన్యుఁడు బయలుదేరి,| చాక్షుసా నదిని తరించి జట్టుతోడ,
మాల్యవంతా చల శ్రేణి మధ్య నుండి | అడుగు పెట్టెను కేతుమాలాఖ్యసీమ.

తే|| "రక్తమెక్కాలె మనలది, రంగ"టంచు | అచటివారి పూర్వుల సోదరాసురులగు
నతిథులకు తావొసంగి రత్యాదరమున | శాశ్వతంబుగ తొల్లిటి జనులు దయను.

వ|| పిమ్మట కొంతకాలమునకు దైత్యులచట చేరగా, దానవులు వారికిని చోటిచ్చిరి. దానవులతో దైత్యులు కలసిపోయిరి. కొన్నితరములకు జరామన్యుని సంతతిలో 'జరామన్యుఁడు' అను పేరే కల నాయకుఁడుద్భవించెను.

తే|| మఱల కొన్నేండ్లకా జరామన్యుజట్టు | ముందునకు సాగ మఱి కొంత భూమి కొఱకు
అచటి దానవానీకము లడ్డుపడిన, | "నిలువుఁడిఁక, పడమటికేగనీయఁ" డనిరి.

తే|| నిత్య ఘర్షణతో కొన్ని నెలలు నేండ్లు | గడవ, కయ్యములందలి ఘాటు హెచ్చె;
దానవ శ్రేణి గ్రామములదాఁటి చాల |. పడమటికేగుయత్నము భగ్నమయ్యె.

వ|| కేతుమాల వర్షమున నిట్లుండ, దక్షిణముగా తొల్లి బయలుదేరిన దక్షుని జట్టునకు

క|| స్వాగతమిచ్చిరి దక్షిణ | భాగముల జనంబు దక్షవర్గంబునకున్,
సాగెను సవ్యంబుగ నను | రాగార్ద్రిత కొన్ని వత్సరంబులు; పిదపన్,

తే|| అచటి దైత్యుల పూర్వ వైరాగ్నికీల | లడ్డువచ్చెను దక్షజనాభివృద్ధి
పథమునకు; నేల కఱవయ్యె వారి మంత్ర | తంత్రముల కారణంబున; దక్షుఁడపుడు

తే|| ఆదిశక్తిని పూజించు నచటి జనుల | నంగడిను కాళికాలయమందు జేర్చి,
పెద్ద యెత్తున కాళిసంప్రేతిఁజేసి, | వేడుకొని కాళి నిక్కట్లు వేగదీర్ప.

తే|| పిమ్మటను సాగరోద్గత పృథ్వినాక్ర | మించె దక్షుఁడు; కాళిబూజించువారు
మెచ్చికనుచుండ, దైత్యులు మిత్తి జూడ | దక్షునకు దేవికిని, భక్తి తతికి ధడిసి.

తే|| చాల కాలము సుఖదమై సాగెనిట్లు | తరతరంబులు; పెద్దలై దక్షసుతులు
మహీధరించిరి "దక్ష" నామము వహించి; | వసుధ కళ నిండె నుద్యానవనమువోలె.

తే|| కొలుచుచుండిరి భూదేవి నలఘుభక్తి | నాదిశక్తిగ, కాళిరూపావలంబు
యైన తల్లిగ, తమవాంఛితార్థదాయి | గ, తమ కెఱిఁగిన దేవతాగణముతోడ.

వ|| చాలకాలమిట్లు జరుగుచుండ, హరి కింపురుషముల తెలుఁగులకును దక్ష జనులకును చెలిమి వృద్ధియయ్యెను.

## శివుఁడు

క|| శివుఁడను తరుణ వయస్కుఁడు | జవసత్వధనుఁడు సమర విశారదుఁడొకండా
భువిని బొలిచె తెలుఁగుల, దే | వ వనంబున పారిజాత పాదపమటులన్.

క|| తెలుఁగుల గణరాజ్యములో । తెలుఁగుందంపతులు "శక్తి", త్రిశశాఖ్యలకున్
గలిగిన పుత్రుఁడతండు । వలసకు జని పలు తెలుంగు వారల తోడన్.

తే|| వారు చేరిరి కైలాస పర్వతంపు । ప్రాంత భూముల; నట స్థిరపడిరి వేగ;
పిదప, దక్షుఁడు శివునకు పెండ్లి చేసె । తన కుమార్తెను "సతి" యను తరుణి నిచ్చి.

మ|| ఉదయించెన్ సతి స్వర్ణ గర్భమున బాహు స్ఫూర్తి వంతుండు, స
మ్మద దంతావళిదాన పుష్ట గహనక్ష్మాజాభ దేహుండు, నీ
రద వర్ణాంగుఁడు, భూరి సాలకుటజ ప్రాంశుండు, మాతాపితో
న్మది తాఁకుండగు వీరభద్రుఁడు రణాంభోజాతదృగ్గోచి యై.

క|| పెట్టనికోటగ తనకున్ । దిట్టరి యగునల్లుడుంట, దిటవున్ గొని, యి
క్కట్టులు శత్రువులిఁక దల । పెట్టనుచు నెంచు వేళను, దైత్యుల్,

తే|| దక్షపాలిత భూమి నుద్ధతిని జొచ్చి । కొల్లగొట్టిరి గ్రామముల్, గోగణముల
దోలుకొని చని, రపుడు క్రుద్ధుఁడయి, సాయ।పడగ శివుఁడేగె శూల, చాపములుదాల్చి

తే|| దైత్యులా పినాకి మహోగ్ర ఘాటికికాగ । జాలకంఘ్ముల బడి రక్షశరణమనుచు;
నొట్టు పెట్టిరి మంచిగ నుందుమనుచు; బుద్ధికలిగి ప్రవర్తింప బూనుకొనిరి.

తే|| అట్టులయ్యును, గొఱ్ఱెలబట్టి తినగ । పొంచు తోడేళ్ల మాడ్కి చరించు దైత్య
ఖలులయెడ నప్రమత్తుఁడై మెలఁగ వలసె; శరణ మిచ్చి నందులకిది సరత శిక్ష.

మ|| హిమవత్పర్వతపంక్తి వాయుదిశయం దేపారు కాలాబ్ధ్యుదీ
చ్యమునన్, కశ్యపవార్ధ్యుదీచ్యమున బూర్వాదిత్యులావాసమై,
తమకున్ సాధునిగా తెలుంగములు, దైత్య వ్రాతముల్ గొల్చు శం
భు, మృడున్, శూలి, సతీపతిన్ గొలిచి రంభోజాభ చిత్తంబులన్.

క|| తెలుఁగులు "కోయ" చతుర్జా । ఖలలో నొక శాఖవారు,కాలము గడపన్,
తెలుఁగుల వలె కాకను, కో । యల నాగరికులుగ నుండి రందఱకంటెన్.

తే|| ఆ తెలుఁగులలో తానొకడై పొడమిన । శివుఁడు తెలుఁగుల, కోయల, క్షేమ శుభము
లరయుచుండె దక్షజనుల, యక్షజనుల క్షేమ శుభములతో పాటు చిత్తమలర.

మ|| మనుచుండన్ జనులిట్టు, లచ్చట జరామన్యుండు తోడ్పాటుకై
మనవుల్ పంపెను, తమ్ము క్షేమముగ ద్రుంపన్ దానవౌఘంబు వే
చనుదెంచెన్, వడిరమ్మటంచు, నపుడంచద్వేగియై సైన్యమున్
గొని, యేగెన్ శివుఁడుగ్రమూర్తి యగుచున్, ఘూర్ణిల్ల నాశాంతముల్.

క|| యక్షులు, తెలుఁగులు, కోయలు, దక్షుని సంతతులును, ప్రమధ గణములు, విరూ
పాక్షు ననీకము జేరిరి । మక్షికలుగ జేసి, రిపులమర్దన జేయన్.

తే|| కశ్యపాబ్ధికి శ్యామసాగరమునకును । నడిమి త్రోవను శివుని సైన్యములు చేర
పది దినంబుల కావాల ప్రాంత సీమ । కా జరామన్యు సంతస మ్మభమంట.

చ|| *దనువను నొక్క శైవలిని తత్ స్థల పశ్చిమ పార్శ్వ భూమిలో
మొనసెను, తద్ధునీ తటము మ్రోలను 'దైత్యులు' కూడ చేరుటన్
'దనుజులు' 'దానవా' ఖ్యులయి తక్కనకాద్రి సమీపవాసులే
రిని దరిజేరనీక పలురీతుల బాధలు పెట్టుచుండినన్.

వ|| తొల్లి ప్రియవ్రతుఁడు కేతుమాల వర్షమున దానవ నదీ ప్రాంతము వఱకే దనుజులకు కేటాయించి యున్నందున

ఉ|| శంకను పశ్చిమంబునకు నేగిన, దానవ కష్ట కల్పనా
పంకము నుండి తప్పుకొని, భాసుర జీవన సిద్ధి మార్గపూ
గాంకిత వృత్తి నిర్వహణకష్టములుండవటంచు నెంచుచో
నంకిలిపెట్టిరి యుభయ పార్శ్వద చర్యకు దానవప్రజల్.

తే|| "పడమరకు నేగి యచట నివాస మూదు, । మపుడు మా పీడ మీకుండ" దనిన వినక
"మీరు వెనుకకు పొండని మేము కోర । ముందు కేగుదు మననేల మూర్ఖులార"

తే|| అనుచు గద్దించి, దానవులడ్డు నిలిచి, "మున్ను రానిచ్చి రేమేరు భువికి మమ్ము"?
పొండు, పొం"డన". నట చోటు పూజ్య మిచట । చాలకలదని ముందుకు సాగబోవ,

తే|| కనకగిరి సీమవాసుల గదలనీక, । తరిమి వెనుకకు, "కాంచనగిరికి తెరలి
చనక, నిలిచిన మిమ్ము క్షేమముగ మట్టు । పెట్టుదు" మనిరి దనుజులు భీతి కదుర.

వ|| అట్టియెడ

తే|| ఆ జరామన్యు కబురంది యటకు జనిన । శివుని సైన్యము దానవ శ్రేణిదునుమ
దనుజ మస్తక పంక్తులు తాటికాయ । లట్లుపడియెను కంపింప ధరణి తలము.

తే|| కూలబడెను తెలుంగుల క్రూర ఖడ్గ । ధాటి కోర్వక నఱికిన తరుల వోలె
దనుజ కాయంబు లీధర దద్దరిల్ల, దానవ స్త్రీల యార్తనాదములు రేఁగ.

తే|| సాగవిఁక దమ యాట లాజ్ఞలునటంచు । కాళ్ల బేరంబు చేయఁగ గదలివచ్చి
యాదనుజు లీయకొని కట్టి యడ్డు పెట్ట । కుంటకను, వైరము తలపకుంట కెపుడు.

తే|| అప్పుడేగి జరామన్యుఁడనుచరులును । కేతుమాలాపు పడమటి భూతధాత్రి
యందలి యుదీచ్య మధ్య భాగావనులను । జేరి, స్థిరపడి, పటువృద్ధి జెందిరచట.

తే|| ఆ జరామన్యు పిదప నాయకుని పదవి । దాల్చె నాతని సుతుఁడు 'ద్యోతనుఁడు' చతు
డతని పేరున *'ద్యోతిను' లనఁగ నచటి । జనులు తత్సంతతులు నీ జగతి వెలయ.

* దను వు — Danube

నను నిరువురు పుత్రులు కలిగెను.

తే|| వారి భూముల నాగ్నేయ ధాత్రియందు, । దానవుల ధాత్రి యుత్తర ధరణియందు
వలసగొనెను, యక్షుల కుటుంబములు కొన్ని । పల్లమున నీరు ప్రవహించు భంగినచట.

తే|| శ్యామ, కశ్యప వార్ధుల యామ్యమందు । గాక, తత్తీరభూమి భాగములనుండి
చాల భూభాగమున దైత్య జనులు, దాన । వులును వ్యాపించి రంబుజకులమువోలె.

ఉ|| కాలము సాగ నిట్లు, శివు కామిని దక్షజ భస్మమౌటచే
చాల దినంబులున్మదుని చాడ్పున భూతల మెల్ల చుట్టి, శై
లాలయ గోత్ర పుత్రి "నుమ" "నార్య" ను శంభుడు పెండ్లియై, కనెన్
బాలుర దంతి వక్త్ర శిఖి వాహనులన్ రజతాద్రి వాసుడై.

వినాయకుడు - అఖుడు

తే|| "అఖుడు" దైత్యుల నాయకుడయ్యె చాల । యేండ్లకతడు దక్షనృపుమహీతలంబు
నాక్రమింప, శివుడు వినాయకుని నంపె । సాయమిచ్చి తెల్గుల, యక్షజనతతుల

తే|| తెలుగులు చెలరేగి, యఖుని బలము తోడ । మిగుల చెలగాటమాడి రిపుత్తిగూర్చి
రఖునితోపోరి నిర్జించె నంబ సుతుడు । తోకముడిచి పరుగిడ దైత్యులు భయమున

తే|| నెత్తురులు కాల్వలై పాఱి నిలిచి పోవ । కశ్యపాంభోధి యెద్దినై గడ్డకట్టె
దైత్యశవములు దొరలెను దాని మీద; । దుఃఖమున వాడె దైత్యభూద్రుమము లెల్ల.

కుమారస్వామి

వ|| పిదప కొన్నేండ్లకు

తే|| కేతుమాలంపు దానవుల్ గీష్పతి భువిని । జొచ్చి, చెఱపట్టి కొనిపోవ సురవనితల,
శరణుజొచ్చెను. శివుని వాసవుడంతట । కార్తికేయుని తెలుగసైన్యముల నంపె
దానవుల జంపి, విడిపింప మానినులను, । దనుజ విభుడగు తారక దైత్యు దునుమ.

తే|| యోధులారుర కెనయగు యుద్ధ పటిమ । కలదు మన్యుము కొక్కొక తెలుగు వీరు
నకును; వారలగాంచి యానందమంది, స్కందు సేనానిగా జేసె శక్రుడపుడు.

తే|| మెఱసె తెలుగుల కత్తులు మెరుపులట్లు; । తెలుగుల విశిఖములు పిడుగులవలె పడె
తెలుగుల జయశంఖారవములు । దరిమి ఖరములయ్యె దిశల మేఘ గర్జనలలు,

తే|| జలములందలి నాళీకజాలకముల । మదమహా బలనాగాంగ మండలంబు
చించు పోలిక వైరుల జంపి చెండె । తెలుగుయోధాళి యుద్ధభూతలమునందు.

తే|| తెలుగు వీరులు దానవబలగములను । జీల్చి చెండాడ, చాల్వున జీవనములు
శోణమై, తీర ప్రాంతంబు జొచ్చి, దాని । పాటల మొనర్చె; నెత్తుట బలిసె నేల.

* ద్యోతనులు = Teutons

తే॥ పాఱలిపరచిరి హతశేషు, లందు, వారి । నాయకుఁడు "తారకుఁడు" క్రౌంచ నగబిలంబ
తూఱి, వెన్నంటి త్రుంపె స్కందుండువాని, । అసుర మహిళల స్వస్థల మంపిరపుడు.

## యముఁడు

తే॥ యముఁడు నాయకుఁడుగ నసంఖ్యాకమైన ప్రజలిలావృత వర్షంబు వదలి, దక్షి
ణావనుల నిరవంది; రాయమునికతన, । దక్షిణము యామ్యమను పేరుదాల్చి యొప్ప.

తే॥ సంఖ్య పెరుగుటచే నిట్లు చనిరి జనులు । పెక్కు జట్లు మున్నూఱేండ్ల కొక్కసారి
యముఁడను పేర బరగె వారి నాయకుఁడు నెల్ల । వేళల; నిటుల సాగెను వేలయేండ్లు.

సీ॥ జన సంఖ్యచే చోటు చాలక చనువారు, - పొరపొచ్చెములు పుట్టిపోవువారు,
క్షామముల్ పీడింప, కదలి యేగెడు వారు, - కాటకంబుల క్రుక్కి కదలువారు.
పోరాటములనోడిపోయి పాఱెడువారు, - దారిద్ర్యమున క్రుగ్గితరలువారు,
పగతుర నడుమ నివాస మొల్లనివారు, - పలుబాధలకు జిక్కి బసలువారు.

గీ॥ ఉన్నదానికంటె నున్న స్థితిగోరి । బలము, తెలివి తమకు గలవటంచు
విక్రమించి యుఱుకు వివిధ వయస్కులు । వలసపోవుచుంట వాడుకయ్యె.

తే॥ దక్షిణమునకు నీరీతి తరల జనులు । మూఁడునూఱేండ్ల కొక్కొక్క మాఱుగాను
కింపురుష, హరివర్షముల్ పెంపుగాంచె వీరి వలసలతో నిండి విస్తృతముగ.

తే॥ చాల యేండ్లిట్లు గడచిన కాలమందు । చాల శాఖలుగా వారు చీలి; రందు
బలము, తేజముగల శాఖ తెలుఁగు శాఖ, । ఉజ్జ్వ తెలుఁగులకు హిరణ్యులకు చెలిమి.

తే॥ స్వర్గమనెడు నిలావృత వర్షమేలు । నింద్రునకు గంటకంబయ్యెనిట్టి చెలిమి.
అతఁడె హరి, కింపురుషములకధిపుఁడగుట । తిప్పలెన్నొ యొసెట్టెను తెలుఁగు జనుల.

సీ॥ కడమ శాఖలలోన గంధర్వ, కిన్నరుల్ - యక్ష, గుహ్యకులు, విద్యాధరులును.
నాగులు, సిద్ధాదినరులెసఁగిరి, యక్ష - గుహ్యకుల్ కైలాస గోత్రదేశ
వాసులై, తెలుఁగుల పజ్జకాపురముండి - కోయశాఖయగు తెల్గులతో సాన్ని
హిత్యంబు నెఱపుచు, నత్యంత భక్తితో శివునిగొల్చి, కుబేరుఁడు విభుఁడుగను.

గీ॥ బహుధనాఢ్యులై "అలకా" ఖ్య పట్టణంబు । కట్టి; భద్రాశ్వనికటమునందు
కిన్నరులు, గంధర్వులు మిన్నలైరి; । గిదితర సురలెల్లఁగ నడిధాత్రియందు.

క॥ ఈ సురల జనులు, నసురులు । భాసుర భద్రాశ్వ జనులు భారత భువిలో
వాసమొనర్పగ వలసల । కై సతతము దక్ష జనులు నరుగుచునుండిన్

వ॥ ఇలావృతాది వర్షముల నుండి వలసలకేగినవారిలో

తే॥ నేరములకు, తప్పులకు నీతి బాహ్య । చర్యలకు, నాస్తికత, కనాచారముల, క
సాంప్రదాయములకు బహిష్కరణ శిక్ష । నంది వలసల కేగిరి కొందఱందు.

తే|| పెద్దలను శిక్షించుట పెద్దతప్పు । గాపరిగణించి, విష్ణుని గనని పాల
కుల, జయ, విజయులను, శిక్షకు గురిచేసి । బంధుయుతముగ వెలివైచి పంపిరచట

వ|| కశ్యపవంశ సంజాతులును, సుగుణఖనులును నైన జయ, విజయులను వెలివేయుటఎట్లు
తటస్థించెనన,

జ య, వి జ య లు

---

తే|| ఇలను 'ధర్మ' ప్రజాపతి "హింస" యందు । కనెను సనకసనందనాదితనయ వితతి
వారు మునివృత్తి గైకొని పేరుగాంచ, శాసనంబయ్యె వారి వాక్యముదయంబు.

చ|| కనకమహాగృహ మెక్కి కటకస్థల నిర్మిత విష్ణు హర్మ్యమా
సనక సనంద నామ ముని సత్తములొక్క విభావరిన్ జొరన్
జనునెడ, ద్వారపాలకులసమ్మతి నడ్డిరి; "వేళకాని వే
ళను జనరాదు సుండు మునులార ! తగున్ దమి విశ్రమింపగన్.

తే|| "సేదదేరుడు మీరు నిశీథమందు, । తగిన సౌకర్యములు మీకు తనరజేసి,
వేకువను లేపి నిద్దుర, విష్ణుమూర్తి । ప్రథమ దర్శనమిప్పించి పంపగలము"

తే|| అనిన, "నెప్పుడైన నేగెడు హక్కు మాకు । కలదు కావున పోనిండు గవని తెఱచి"
యనిన, వారించి, ద్వార పాలన మొనర్చు । జయుడు, విజయుడు పలికిరాసంయములకు

తే|| "హక్కులున్నను, విసియోగ మదను పదను । తెలిసి చేయుటయుక్తము, తెల్లవారు
జాము వఱకును నీ తల్పశయనులకుడు, । త్రాగి యీ కొబ్బర జలంబు ప్రస్తుతంబు"

మ|| అని, యందిపంగ నాగ్రహోగ్రులయి, "మీ అంతస్థులన్ మీఱి, మా
కునయుక్తంబులు యుక్తముల్ దెల్పు నా క్రూరత్వముల్ శాప భా
జనులన్ జేసెను మిమ్ము, దేశము నవశ్యంబిప్పుడే వీడి మీ
జనవర్గంబుల తోడ నేగు, డిది మా శాపంబు మీ క్రొవ్వుకున్"

తే|| అనుచు బొబ్బలు పెట్టగ నాలకించి, । విష్ణువచటకు విచ్చేసి విశ్వసి విషయమెఱిగి
శాపమును క్రమ్మరించెడు శక్తిలేమి, । నెటును దోచక మునులతో నేకమయ్యె.

తే|| ఎవ్వరకుగాను తాము మునీశ్వరులకు । నడ్డు చెప్పిరో, యాతడే న్యాయదూరుడ
డయ్యెనని నివ్వెరపడి. జయ, విజయులప్పు । డడుగ శరణము వెన్నుని, నాతడనియె

తే|| "మన నిబంధనావళి మునిజనులకిచ్చె । శిక్షలను వేయు నధికారమక్షయముగ,
వారివాక్పరిపాలనా బాధ్యతలను । వైచెనవి ఇంద్రుపైన, నాపైన, సతము.

తే|| కావ, మీరేగు రెటకేని, నేను చేయు । గలది లే "దని మోమోటములను మాని
చెప్పె నిర్ద్వంద్వముగ వెన్నుడెప్పుడైన । కాతురే సేవకుల నధికారజనులు.

తే॥ తేలుకుట్టిన యట్టులా తీర్పుతోఁప, । జయుఁడు విజయుఁడు పెద్దల నయము దెలుప
ప్రార్ధనలు చేసి, కడగంస్లబాయజేయ । నడిగి, రాకోర్కి ఫలియింపదయ్యె, నవుడు.

తే॥ జయ, విజయులాది స్వజనుల జట్టిలావృ । తంబు నూడి వెడలి, కోపతప్తులగుచు
శ్యామ, కశ్యపకార్ధుల యామ్యమందు । విడిసి, పగబూనిరా ఇలావృతులపైన.

తే॥ తమ్ము రక్షింప నడుగు ముందరకు వేయ । వలసినట్టి యా విష్ణువు పలుకఁడయ్యె
నొక్కమాటయు తమచేత యొప్పటంచు । పెద్దలకదరి వారికి భృత్యుఁడగుచు.

మ॥ అనియత్యాగ్రహ మంది యోచనలు చేయన్ సాగి యా మేరు భూ
మిని స్వాధీనము పొంది, బానిసలుగా తన్మేటినీ నాయకా
గ్రని కాయంబు లచేత నూడిగము నిర్వర్తింపజేయుంగ, వ
డ్డినచో, వెన్నుని ద్రుంపఁగా బ్రతిన పట్టెన్ తద్వయంబుద్ధతిన్.

ఆశ్వాసాంతము

ప్రసారణ ఫలితము } మనుజు లెచట జన్మగనిరో, యెటిటన్ । జని, జగతిని విస్తరణము గనిరో
మన తెలుఁగులు సంభవ మెపుడెచటన్ । గనిరో చెపితి వాగ్వనిత ముదమున

గద్యము

ఇది శ్రీ శ్రీవత్స సగోత్రాంతర్గత తేకుమళ్లాన్వయ సంజనిత రాజగోపాలరావు తనూభవ రామచంద్రరావు నామధేయ ప్రణీతంబైన "ఆంధ్రోదయము" అను నామాంతరముగల 'తెలుఁగువారి ఆదిచరిత్రము' అను తొలి కథయందు "సుమేరు ఖండము" అను ద్వితీయాశ్వాసము.

మంగళం మహత్ * శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



# తెలుఁగువారి ఆదిచరిత్రము

## తెలుంగను ఖండము అను తృతీయాశ్వాసము

క॥ శ్రీసఖి వాణి తెలుగుల భాసుర పూర్వంబు, వారు భారతభూమిన్
వాఁ మొనర్చిన కథయును నే సంక్షిప్తముగ దెలుప, నిలువుము వినగన్.

### హిరణ్యాక్షుఁడు

తే॥ జయుఁడు విజయుఁడు వెలియయి జనుల నడప, చేరి నివసించిరి హిరణ్యసీమ యందు
పఖ్యతగ తొల్లి యటనున్న జనులతోడ; అవియె 'పారశీకము,' 'ఇరా'ననెడు సీమ.

తే॥ అట, జయుని సుతుఁడయి హిరణ్యాక్షుఁడుదయమయ్యె, విజయునితొలియపత్యముగ బుట్టె
నసురుఁడు హిరణ్యకశ్యపుఁడ మరులెదల కతఁగొని వారి మనములు గడ్డకట్టె

ఉ॥ వెన్నుని, నిందఁజేసెన్ దునిమి, వేలుపు పెద్దలచేత నూదిగం
బున్నెర యింపజేయదలపోసిరి; మౌనుల జావగొట్టి, యా
పన్నులజేసి, వారి గరు వంబునడంపగ బూని, రబ్జగ
ర్భోన్నతి నిందు డూద్పుగతి; యుద్ధము పుట్టె సురాసురాళికిన్.

తే॥ ఆ హిరణ్యాక్షు తాకిడి కాగలేక పారిపోయిరి ప్రియములదేవత; లసుడు లి
లావృతమును కొల్లగొనగ, బాపురనుచు నేడ్చి రితర దివిజులు; లక్ష్మినుఁదదరి,

తే॥ శంఖ చక్ర గదాఖడ్గ శార్ఙ్గధారి యేచు నేతెంచె బహుళసైన్యంబుతోడ,
సావానమొనర్చె నాహిరణ్యాక్షు దుసుమ పవిదినంబులు, నెత్తురుల్ పాఱభువిని,

ఉ॥ ఆ రుధిరంబునన్ బడవలట్టుల తేలె కళేబరావళుల్;
వీరుల మొండెముల్ తలలు ప్రేవులు కండలు మాంసఖండముల్;
దారుణభంగి రాపులుగు తండము గ్రద్దలు కాకులున్ క్షుధల్
తీరగ జీల్చి, లాగి, తిను దృశ్యము చూపరు గుండె ద్రచ్చగన్.

వ॥ ఇక విష్ణుమూర్తితో పోరజాలక

శా॥ భూకంపంబులు దెచ్చుటల్ దెలిసి, యా పూర్వామరుండిందుత్రిస్వ
ర్లోకంబందునదెచ్చె కంపనము మేరు క్ష్మాధర ప్రాంతమం;
దా కంపంబున చాపచుట్టవలెనై యా క్షోణి పాతాళమున్
దాకెన్. బాయగ ప్రాణముల్ సురలు తద్ధాత్రీస్థలంబంతటన్.

తే॥ ఆహిరణ్యాక్షుఁడపుడొక హ్రదమునందు దాగబోన, నాయత్నము సాగనీక
హరి సితవరాహధాత్రిశునట్లు జలము పంకమును ద్రొచ్చి, బయటకు వాని లాగి,

తే॥ పట్టి తునిమె హిరణ్యాక్షు బడవనాఁడు భీకరాహవమందున విష్ణుమూర్తి
ఆర్తముఖులయి విలపింప నసురజనులు హర్షనిర్భరులైరెంత నమరులెల్ల.

### హిరణ్యకశ్యపుఁడు

వ॥ హిరణ్యుల రాజుగా నెన్నుకొనబడిన హిరణ్యకశ్యపుఁడు తక్షణము విజృంభించి

చ॥ అమరుల సేనలన్ దరిమి, అద్భుతమైన ప్రతాపదర్పముల్

సమరవరిత్రియందు వికచంబొనదించెను; పట్టి కట్టినా
యమరుల నాయకాగ్రణుల; నా చేబ నెందిన తోటకాడల
ట్లమిత కళావిహీన వదనావళితో బడియుండి రాసురల్.

ఉ॥ మౌనుల జావగొట్టి, "తమమాన్యులమంచు నహంక్రియామతిన్
జ్ఞానవిహీనమైన జపసవ్యపుకీర్తులు, శాప, దండనల్
మానుడు; మానకున్న బరిమార్తును మిమ్ముల తక్షణం"బటం
చానలుపెట్టి పంపె; నింక న్యాయము గూర్చుడటంచు పృథ్వికిన్.

వ॥ ఆహిరణ్యకశ్యపుడంతట ప్రియవాక్కు అను ప్రియవ్రతుడు నిర్దేశించిన ఇంద్రుని రాజ్యమునంతటిని
స్వాధీనపరచుకొని, బందీలైన అమరనాయకులను తనరాజధానిలో సేవపుపనులకు
బానిసలుగా నియమించెను.

ఉ॥ పిమ్మట విష్ణుమూర్తికయి వీథులు, వాడలు, పల్లె, పట్నముల్
క్రమ్మరక్రమ్మరన్ వెదకె; కాని మహాప్రధనంబు సేతకై
దమ్ములు లేక, వేళకయి దాగి కొనెన్హరి, సూర్యరాకకై
తమ్ములు రాత్రిపూట విగతప్రిభలై తటివేచుకై వడిన్.

తే॥ కింపురుషహరి వర్షములింపు గొలిపె। తెలుగుల నివాసమై; వారి చెలిమి వృద్ధి
యయ్యెనాడు హిరణ్యకశ్యపుని తోడ, । నతడితరసురలెద నలక్ష్యము వహింప

నృసింహుడు

శా॥ ఆ రాజేంద్రుని రక్షచేయు నొక సింహం బప్రమత్తంబుగా
ద్వారంబందున, ద్వారపాలకుని యొద్దన్ శృంఖలాబద్ధమై;
అరిశిన్ జనకాల, మచ్యుతుడు మాయావేషమున్ దాల్చి,తత్
ద్వారోద్యోగిని ద్రుంపి, సింహమును మత్తన్ జేసి మద్యంబునన్.

మ॥ ఉసికొల్పెన్ సురవైరి మీద: కది రాజోత్తంసుపై దూకె, సొ
మ్మసిలన్జేసెను వ్రేటుతో; పెటికి తన్మాంసాంత్రిహృన్మస్తముల్,
మెసవన్ సాగి. పితల్వసించు నెడకంపెన్ వాని; నట్లాస్నంపుం
డసువుల్ బాసెను. ఖేదమందగ హిరణ్యాద్యాసురప్రాంతముల్.

తే॥ నరుడు, సింహము తెచ్చెను మరణ మిట్లు ; అది నృసింహావతార కథాదిరూప;
మిట తలను సింహ మన, మితర శమల । నొదలుహరి, తల నరుడని నుడువుచుంద్రు.

వ॥ ఇట్లు

మ॥ హరిజృంభించెనుసాయశాలి యయి; ప్రహ్లాదున్ హిరణ్యాత్మజున్
వరపాలుండుగ, విష్ణుభక్తునిగ సన్మానించె: నింద్రాదిభూ
వరులన్ రాజుల జేసె వారి కుశలప్రాంతాళికిన్ : శాంతినె
ల్లరు జీవింపగసాగి· రుగ్రకరవాలం బుల్ పడెన్ మూలలన్ .

## ఇంద్రుఁడు తెలుఁగువారిని బాధించుట

హిరణ్యకశ్యపునితో తెలుఁగువారును, కోయలును చెలిమి వహించిరన్న నెపమున
తమకున్ పెన్నుదయన్ లభించిన సువిస్తారావనిన్ తెల్గువా
రును, కోయల్ నివసించుటన్ మనమునన్ రోషించి, శైలారి పా
లనకున్ మాయగ, దూలగొండితనమున్ లక్ష్యంబుగా నెంచె; దు
ర్దినముల్ ప్రాప్తములయ్యె కోయతతికిన్ తెల్గుప్రజాశ్రేణికిన్.
విష్ణుదర్శించి యాస్థితి విన్నవింప । మందలించె దేవేంద్రుని మాధవుండు;
కొంత కాలము నడచె ప్రశాంత సరళి; । తిరిగి మొదలిడె క్రౌర్యమా సురముఖుండు.
విష్ణుమూర్తి మఱల పాకశాసనుని మందలించుచు నిట్లనియె:
"ఎచట దెబ్బతగిలె నేనియు, కాలినే । కుంటుచు పరుగెత్తు కుక్క పోలె
అన్నియిక్కటుల కాతెల్గు వారిపై । కోపమూనుదేల, గోత్రవైరి ?
"తెలుఁగులు కార్యతత్పరులు, ధీరులు, విజ్ఞులు, సాంపరాయకం
బులను జయింపరాని బలపూర్ణులు, విగ్రహ కోవిదుల్; పరుల్
కలవర మందు పెన్ కలసికట్టు తనం బదివారి సొమ్ము; దై
త్యుల యెడవారు మానవతతో చరియించిరి; కోపమేటికిన్?
"పూర్వము సనకసనందనులు జయ విజయులకు దేశబహిష్కరణ శిక్షవిధించిరి కదా ?
"అతతి విబంధనలు వెలి । వేతకు గారణములయ్యె, విద్దూరములై,
నైతిక దూరములై, పురు । హూతా ! యిటు దారితీసె యుద్ధావళికిన్.
"న్యాయ మనుకొన్న వైపున నాత్మ నిలిపి, । చెలిమి చేసి రసురులతో తెలుఁగు వారు;
పాలితులు నేడు; కృపజూడవలయు నీవు; । వారి జోలికి పోయిన వచ్చు ముప్పు.
"మొగముపై కోపమును జెంది ముక్కు కోసి । కొన్నయటు లౌను హరిహాయా ! క్రూరవర్త
నంబు తెలుఁగుల యెడ; కావున, మొదటికిని । తెచ్చు కొనకుము నీగతిన్ దివిజనాథ !
"ఆహిరణ్యకశ్యపుజు ప్రహ్లాదునెట్టు । లాదరించుచు నున్నామొ యటులె వీరి
జూడనగు మనకు; పదగ చుట్టయైన । పాము వైరియగునె మేఘవాహనుండ!"
అని కమల నాథుఁడు హితబోధయొనర్చి చనియె.
శ్రీపతి యెదుట బిడౌజుం । డూపెను తల; పిదప మఱల నుద్ధతి మీఱన్
కోపము తాపము మనమున । రేపెట్టుకొని, తొలి నాఁటి రీతికి తొడగెన్.
అచటికోయః, తెలఁగుల సద్దమైన । తిప్పలను పెట్టసాగిరి త్రిదశజనులు
వృత్రహుని ప్రోద్బలంబున వికట మతిని; । క్రమముగా తిరిమించి రాగమున బడిరి.
ఇది యిట్లుండ, ప్రహ్లాదునకు విరోచనుండును, విరోచనునకు 'సుర్తాసువ' యను
భార్యయందు 'బలి' యను నుద్భవించి హిరణ్యులచే వరుసగా రాజులగా నెన్ను కొనబడిరి.

కోయలు

తే॥ తెలుఁగు లధికనాగరికు లై చెలగుచుండ । కొన్ని యేండ్లకు విడిపోయి కోయజాతి
రజతగిరి పోంత వాసమేర్పరచుకొనియె; । తెలుఁగు వారలతో మైత్రికలిగి మెలఁగె.

వ॥ తెలుఁగువారిని శివునితో సమానమైన దైవములుగా వారు పరిగణించుచుండిరి.

శా॥ కైలాసాచల దేశభూములను 'లింగం'దన్న కోయప్రభుం
డేలెన్ పెక్కుడు వత్సరంబులు ప్రజాహృద్యంబుగా; దీనులన్
జాలిన్ బ్రోచుచు, నా హిరణ్య బలికిన్ సంపూర్ణసన్మిత్రుఁడై,
ప్రాలేయాచల కన్య కారమణి కార్యా దేవికిన్ భర్తుఁడై.

తే॥ అతఁడేలెడు కోయ రాజ్యంపు తూర్పు । వైపున తెలుఁగు వారి నివాసములకు
లఁవని ఇంద్రుడేలుబడిని వడసినవసి । తిరుగబడి వెడల గొట్టెను త్రివశధవుని.

మ॥ శతమన్యుండు బృహద్బలాన్విత మహాసైన్యంబుతో తెల్గులన్
హతమార్పన్ జను దెంచి, సంగరమునం దత్యంత భంగంబునం
ది, తెలుంగుం బలగంబు వెంటపడ, నద్రిశ్రేణులన్ దాఁటి, దుః
ఖితుఁడై పాతె నిలా వృతావనికి భగ్నీభూతచేతస్కుఁడై.

బలి చక్రవర్తి

తే॥ అంత, శంభుని సూచన నను సరించి, । తమకు రాజుగా నెన్నికుర్తాసు బలిని,
ఉల్లసించిరి మనము నందెల్లజనులు । చల్లగానేల నిల బలి చక్రవర్తి.

తే॥ కొన్ని యేండ్లకు మూఁకతో కులిశధరుఁడు । దిగిన రణముకు బలితోడ, తెలుఁగు జాతి
బలికితోడయి, ఇంద్రుభూస్థలి జయింప, । పారిపోయెను దివిపీడి వజ్రపాణి.

తే॥ వెన్నుకడకేగి తనగతి విన్నవింప । "వేల్పులును నీవు నేలిన విధము వెగటు
కొలిపె జనులకు, పొరుగు రాజులకు, నాకు; । అసురుఁడయ్యును బలి కడు న్యాయశీలి;

తే॥ "యుద్ధమాతనితో చేయు టొప్పు కాదు; । సమరమున గెలుచుటయు నసాధ్యమింద్ర ।
గ్రహగతియు వానికనుకూల కాలమనుచు । దెలిసె; కావున నాగుము నలువదేండ్లు

ఆ॥ "పాలితుల సుఖంబు వాంఛింప జాలని । ప్రభువుకేల నిత్యరాజ్యలక్ష్మి ?
కాననమున కాయకసరులు తినుమింక; । బొడ్డుమల్లెకేల బోడి తలకు ?

తే॥ "తెలుఁగులను రెచ్చ గొడితివి తెలివిమాలి; । దీపమును గాలిలో పెట్టి దేవు మహిమ
కోర, నదినిల్చి వెలుగునే యూరకుండ? । తెలివి తక్కువ జబ్బుకు కలదె మందు?"

తే॥ అవిన వెన్నుండు, త్రిదశేశుఁడాశలుడిగి । వెల్లనయి మోము, కన్నీరు వెడల కనుల,
గుండెగడియలు పడ, మేను కొయ్యబార, । తరలె శచితోడ నడవికి తపమొనర్ప.

తే॥ తల్లికుర్తాసు వొట, । 'కుర్తాసు బలి' య । టన్న పేరున ప్రఖ్యాతుఁడైన బలి హి
రణ్య, దివి, హరి, కింపుర్ష రాజ్యనాథు । డయ్యె నైరృతి దిశ 'కుమేరాద్రి' వఱకు.

తే॥ ప్రజల చల్లగ నేలిన ప్రథిత యశుఁడు; । శిబి, దధీచులతో బోల్చ జెల్లుదాన
పరుడు, కోయలను తెలుఁగునరులను కడు । గొప్పగా గౌరవించిన గుణి యతండు.

## లింగవాన్ పర్వతము

తే॥ నేఁటి 'టిబెట్' టను దేశాన, నాఁటి 'లింగ । బాణ' దేశపు 'లింగవాన్' పర్వతంబు
కల; దది సుమేరు నిభమయి కాన్పించుచుండు । నున్న తాయత శిఖర సంపన్నమగుచు.

వ॥ కింపురుష వర్షమునందలి ఆ ప్రాంతమును దర్శింతునని తెలుఁగులకును, కోయలకును బలి చక్రవర్తి కబురంపగా, ఆనాఁటికి

మ॥ తమ రాజోత్తముఁడీయలా తలము సందర్శించు నేఁడంచు సం
భ్రమ కౌతూహలహర్షపల్లవితహృద్రాగాతిరేకార్ద్ర భా
వములంభోధితరంగ సన్నిభములై వర్ధిల్లి పొంగన్, తెలుం
గములున్ కోయలు లింగవన్ నగము దాకన్ వేచి రాయామినిన్

మ॥ చలికాలంబున మధ్యమాసమగుటన్ జాబిల్లి పెన్మంచు క
వ్వల నస్పష్టముగా గనంబడియె నభ్రహ్రాదినీ కైరవం
బుల గుచ్ఛంబుగ; నంబరోడు తతి జీమూతా వళిన్ దాఁగె;రే
పులుగుల్ చేసెను సన్నసన్న రొద లాభూమీధ్ర మూలావళిన్.

ఉ॥ పూచిన రేకబంతి, విరిపూచిన చిక్కని ముద్దబంతి, కా
లోచిత నూత్నపుల్ల కణదోత్పల పంక్తి, సువర్ణ పుష్పముల్
లోచన పర్వమై, పవన లోల తదీయ సుగంధ మాధురుల్
వీచె మనోజ్ఞమై యచట వేచిన మానవ నాసికావళిన్.

తే॥ సంపెగ, గులాబి, చేమంతు లింపుఁనింప, । మహిళల లరిరి ముద్దచేమంతు లట్లు;
బాల బాలిక లొప్ప పూబంతు లట్లు. । పురుషులచ్చటి యున్నత గిరుల దోల.

తే॥ కరువలి, చలి, మంచులకు గొంగళుల దాల్చి । నిలిచి రెల్లరు తమ రాజు బలిని జూడ,
అతఁడేలెడు క్సౌభాగ్య మాత్మదలచి, । పిల్లలకు జెప్పి యాతని పెక్కు కథలు.

తే॥ బలియరుగుదెంచి పెద్దసిబ్బంది తోడ । తెలుఁగులను కోయలను జూచి పలుకరించి
యొక్కొకరిని; ఫలంబుల నొక్కొకరికి । స్వయముగా నిచ్చె నెల్లరు సంతసింప.

క॥ తన బలగముతో నట విడి । సెను బలి కొన్నాళ్ళు తెలుఁగు సేనల నడుమన్;
గుసగుస నాగిరి శృంగం । బును నెక్కు తలఁపు లతనికి బుట్టెను మదిలోన్.

క॥ తెలుఁగుల జోదులు కొందఱు । మల కొన జేరెదు సులువగు మార్గము జూపన్,
బలియును నూర్గురు జోదులు । తిలకించిరి శిఖరమెక్కి దిశ లెనిమిదియున్.

తే॥ పలికె బలి యప్పుడటనున్న వారి తోడ : "కలరు పదునాలు కళ్లాల తెలుఁగు వారు
కలరు కోయలు పంద్రెండు కళ్లములు గ, । సురల కళ్లాలు పదునెన్మి దరయనేఁడు.

క॥ "తలపెట్టెనేని సమరము । మలమల మాడ్చును దివిజుల మనబల; మాఖం
డలుఁడోడుట తథ్యం; బతి । సులభముగ గెలుతుము మనము సుర నాథునిపై

క॥ "దండెత్తి వచ్చు నెప్పుడొ । ఖండన మొనరింప దివిజవర్గము మనపై;

ఉండగవలె మనమెప్పుడు । చెండుటకై పైరిజనుల సిద్ధముగ, వెసన్."

వ॥ అని, బలి చక్రవర్తి తిరిగి తన రాజధానికి వెడలెను.

వామనుఁడు

తే॥ పెక్కు తేండ్లిట్లు కడచిన పిదప కశ్య । పాన్వయంబున వామనుఁడనెడు బుధుత
దుద్భవించెను; వేదాదు లొనర నేర్చి । విష్ణ బ్రహ్మచర్యంబు నిర్వహించె.

తే॥ వెన్నుఁడప్పుడు వజ్రిని బిలువ నంపి, । "దానపరుడైన బలి నెటులైన వేడి,
స్వర్గ, హరి, కింపుషముల బడసి, నీకు । నా ధరణు లీయ వామను నా శ్రయింపు"

తే॥ అన, మహేంద్రుడు వామను నా శ్రయించి, । "ఓయి, కశ్యపకుల హంస ! ఓ మహాత్మ,
బలము మదమున కుర్రాసుబలి హరించె । నాదు సామ్రాజ్య సర్వ మన్యాయము గను;

తే॥ "సమరమున వాని నోడించు శక్తిలేక, । నృపుఁడ నౌటను యాచింప నేరకుంట,
అడుగ వచ్చితి నీసహాయ్యంబు; నన్ను । పాలముంచుము కశ్యపవంశ తిలక !

తే॥ "దానపరు డౌట, నీదు పాత్రత నెఱింగి । కాదనక, ఇచ్చుబలినీకు నేదియైన;
తూర్పు టర్ధ సామ్రాజ్య మట్లర్పణం బునందు, । మన్యుల కిది సుసాధ్యంబుకాదు

తే॥ "పదప దానిని నాకిచ్చి, హృదయ బాధ । తీర్చి, యడవి పాలైన యాదీను గావు"
మనుచు బహుళార్తి మొఱ పెట్ట, నామహేంద్రు, । తొంటి విభవము, నాటి యభోగతిఁ

తే॥ మదిదలఁచి, శరణిచ్చి, వామనుఁడు పలికె: । "ఆహిరణ్యదేశాధిపు, నా బలీంద్రు
వడిగి తెత్తును నీరాజ్య మమరనాథ! । అతని దాతృత్వ గుణమిందు కాట పట్టు"

వ॥ అని, ఇంద్రునంపి, వామ నుఁడు బలి చక్రవర్తిని దర్శించి,

ఉ॥ "స్వస్తి, హిరణ్య గాజ్యధవ! స్వస్తి, విరోచనరాజ సంభవా !
స్వస్తి, మహేంద్ర రాజ్య హర! స్వస్తి, సురాసుర మేదినీ పతీ !
స్వస్తి, త్రిమూర్తి భక్తవర! స్వస్తి, సుపాలిత కోటి సౌఖ్యదా !
స్వస్తి, బలీంద్ర ! దానగుణ భాసిత పావన పాణి పంకజా !

ఉ॥ "నీవలె,నోయి రాజశశి! నేమను కశ్యప వంశజాతుఁడన్ ;
సేవిత సద్గురూత్తముల చెంగట నేర్చితి సర్వవిద్యలన్ ;
నీవు మదీయ ప్రౌఢిమను, నేర్పు పరీక్షమొనర్చి, యుక్త మౌ
ఈవిని నాదు కోర్కెమెయి నిత్తువటంచును నమ్మి వచ్చితిన్.

ఆ॥ "పొట్టివాఁడనగుట, పెట్టెను నా పేరు । వామనుండటంచు పద్మభవుఁడు;
కోర్కెకలిగె చేయ, కుర్రానువ కుమార! । బ్రహ్మచారినగుచు బహుశతపము"

వ॥ అనిన విని, బలి చక్రవర్తి ఇట్లని యె:

మత్తకోకిల ॥ "పిన్న వాఁడవు, కాశ్య పుండవు, ప్రేమ కల్గెను నీ పయిన్;
నిన్ను జూడగ పొంగెనెందుకొ వింగి దాతను నెమ్మనం,

బన్ని విద్యల నేర్చి ప్రౌఢిమ నంది నాఁడవు; శుక్రుఁడే
విన్ను నేఁడు పరీక్ష చేయును; నేర్పుచూపుము వామనా!
"అసురగురు వరేణ్యుఁడా శుక్ర దేవుఁడు । నిను పరీక్షచేసి, నీదు ప్రౌఢి
యగ్రగణ్య మనుచు నాతఁడు పలికిన, । నిత్తునీవు కోరు నీవి నీకు."
ఎనిమిది దినములు వామను । సునిశితభంగిని పరీక్ష శుక్రుఁడు చేసెన్;
మనమున మోదము నిండగ, । ననియెను బలి చక్రవర్తి కతి విస్ఫూర్తిన్.
"అసుర, దేవ, మానవాళి నేఁడెఱిఁగిన । విద్యలన్నిట ననవద్యమైన
ప్రౌఢి వామనునకు గాఢమై యొప్పారు; । సందియంబు లేదు సార్వభౌమ!"
ఆ శుక్రాసురబలీంద్రుఁడప్పుడు మహాహ్లాదంబునన్ "వామనా!
నీ కంటెన్ మన వంశ సర్వమున పాండిత్యంబునన్ మేటియౌ
రాకా చంద్రవిభుండు లేడొకఁడు; గర్వం బయ్యె నిన్ జూడగా;
నీ కాంక్షించెడు దేదొ తెల్పు; మది నేన్నిక్కీయ సంసిద్ధుఁడన్."
అనిన,
ధన్యవాదము లర్పించి ధరణి పతికి । "దానమున కీర్తి కలుగుట తథ్య" మనుచు,
స్వర్గ, హరి, కింపురుష వర్ష చయము కోరె । వామనుఁడు, శుక్ర బలులు విభ్రాంతి చెంద,
పలికెనప్పుడు బలితోడ భార్గవుండు । "వటిప్రపనుపున నీతండు వచ్చెననుచు
మది కిపుడు రూఢి యయ్యెను; మాను మీవి; । మోనమిది; లొంగకయ్య, శుక్రాసు తనయ!"
అనిన, బలి చక్రవర్తి
"ఆడిన మాటకు తప్పుట । పాడియె గురు దేవ! మీఁద పడినను మిన్నుల్?
వేడిన పుడమిని గొనని । మిమ్మడింభకు" నని, వటునకు నింపుగ ననియెన్:
"పలికితిని చేతు తనమని, బ్రహ్మచారి! । అట్టినీ కేల యీ రాజ్య? మక్కఱంబు
తోఁచె; నైనను తప్పను తొంటి మాట" । అనుచు ధార పోసెను వామనునకు భూమి.
దానమంది, దీవించి శుక్రాసు బలిని, । "నీ హిరణ్య, మసురధరణీ తలంబు
సుఖముగానేలు కొమ్మి యశోధనాఢ్య! । యీవి యిచ్చిన ధరజోలి కేగకుండ"
అనుచు వాక్రుచ్చి, వామనుఁడరిగి యింటి । కిందురిన కొసంగె బలి తన కిచ్చినట్టి
సీమ; లాతఁడు పట్టాభిషిక్తుఁడయ్యె; । వనికి నేగె తపమునకు వామనుండు.
రజతగిరియును, కోయల రాజ్య సీమ । తెలుఁగు వారు వసించెడు దేశమెల్ల
సంక్రమించె గావున త్రిదశపతి, కతఁడు । కోయల, తెలుఁగుల వెడల గొట్ట గడగె.
బలిని కలియగ కోయలు తెలుఁగు వారు । "ఈవి యిచ్చిన ధరజోక్యమేను పూన
జనదు; దక్షిణ దిక్కుగా జనుడు మీరు; । హిమగిరి శ్రేణులను దాఁటి, ఇంద్రుపీడి."
అనిన, తెలుఁగు వారిట్లనిరి:
"ఆ పురుహూతునిన్ రణము నందున చిత్తొనరింతు మార్య! మా

వైపున మీరు చేరకయె, వాయువు తోడ్పడకుండ నగ్నియే
చూపెడు నట్లు విక్రమము; చూచుచు నుండుడు మా వమీకపుం
నైపుణి" యంచు బల్కు, జననాథుఁడు కాదని వారికిట్లనెన్

క॥ "పురికాల్పి తేను మిమ్మని । వారిహయుఁడపనింద చాటి ఆగము చేయన్;
కరుణించి నన్ను, మీరీ । పరిణామము తేకు దాహనంబుకు దిగుమన్

వ॥ "కావున, భారతవర్షంబున కేగుడు; మీకు శుభంబగును."

## 'బిందో'ల కథ

తే॥ అని బలి పలుక, వారటు లరుగనెంచ, । వంకలో పెద్ద చిక్కొక్క దద్దు తగిలె;
కోయలు యపరిశుభ్రతకు గనలి, శివుఁ । డొకగుహను వారి బంధించె నమ్మడిగను.

తే॥ వారలెల్లరు కళ్యాణి భక్తులగుట, । వారి దయజూడ వేడెను భర్త నాకె;
ఆద్రిగుహనుండి వారి నాయకుని విడచి । పెట్టి, శంభుఁడు వానితో నిట్టులనియె;

తే॥ "కలవు 'బిందో' విహంగముల్ కడలి దరిని, । వాని పిల్లల నెటులైన పటి యిటకు
తెచ్చెదవయేని, విడుతు నిన్నెచ్చి, యపుడు । కొండ గుహనుండి యందఱు కోయ జనుల.

ఉ॥ ఆతఁడు తక్షణంబ చని, అంజలిచేసి హిమాద్రి పుత్రికిన్
చేతము కార్య తత్పరతచే పరి పూరితమై చెలంగ, సూ
ర్యాతప, వర్ష, శీతములు కన్నిటి కోర్చుచు, ధ్వాంత సాంద్రమౌ
రాత్రులందు జంకక, విరామ మెఱుంగని దీక్ష తోడ్పడన్.

తే॥ కనబడిన వారి నడుగుచు గమ్యమునకు । జేరు త్రోవ, నడచినడచి, యడవులను
వదుల, కొండల దాఁటి, బురదల, నిసుక । నేలల గడచి, నాలుగు నెలల పిదప

తే॥ కడలి యొడ్డున 'బిందో' లు కాపురంబు । చేయు వృక్షంబు చెంతకు చేరె । నతఁడు;
కానబడియె వృక్షశాఖలకు నడుమ । పెద్దగూడు, దందు బిందోల పిల్లలుండె.

తే॥ పెద్ద పక్షులు తమకును, పిల్లలకును । తినుట కాహారమేదైన తెచ్చు కొఱకు
వెడలె కాబోలు నడవికి, కడలిపైకి; । తగిన యదనిది పిల్లల తస్కరింప

తే॥ అనుచు తలపోసి, ఇది భూరిమఘమె కాక, । నేరములలోన కడు పెద్దనేర మౌర
కన్నకడుపుల సీరీతి కాల్చుటేమ, । తల్లితండ్రియు విలుచేరి తల్లడిలరె?

తే॥ "చెట్టు క్రిందనె వేచెద పిట్ట జంట । గూడుచేరెడు వఱ" కని కూరుచుండ,
చాల సేపటి కుదధి గర్జనము వోలె । ధ్వని జనించెను, క్రమముగ దగ్గఱించె,

తే॥ అంతలో గూటి పిల్లల హర్షరుతము । చెవులబడె; వ్రాలె బిందోలు చెట్టుమీఁద,
సమసె తోడనె తద్గరు జ్జనిత రవము; । పిల్లలకు మేఁత పెట్టెను పిట్ట జంట.

తే ఏనుఁగుల దెచ్చి యాహారమిడిన యట్లు । కానబడె స్పష్టముగ కోయ జేసి; కాతఁ
డచ్చెరువు నంది బిందోల యమిత శక్తి । కాశ్మలో, దానికుప్పొంగి యంజలించె.

తే॥ భూరికాయముల్ కొడవళ్ళ, బోలుగోళ్ళ । వాడి ముక్కులు వటశాఖవంటి తొక్క

లెట్టికన్నులు మెడకిర్రింద బొట్టుసంచు । లలర, దళకరి బలము లైనట్లు తెలిసి,
చూచు చుండగ, పక్షులు చూచి యడిగె; । "ఎవడ వీవేల గూర్చుంటి విచట?" వనుచు
అతఁడనియె: "కోయ రాజ్యాధిపతిని. 'లింగ । డం(డ్రుడ నన్ని తెలుపుచు నంజలించి
శివుఁడు పంపిన పని. తాను చెట్టుమీఁద । నొంటరిగనున్న పిల్లల నంటకుంట
తెలిపి. కోయజనుల విడుదలకు గోరె । గట్టి సహకార మా విహంగములనతఁడు
అంత. యోచించి. ఆ పక్షు లనియె నిట్లు: । "నీ బుణము తీర్చు కొందుము నిందు పెంతల
తోడ: పిల్లలు. మే. మీవు కూడ పోద । మా యమా సతీ శివదర్శ నార్థమిపుడె.
"మేము దిందో విహంగముల రాణి రాజులము మమ్ము 'రాయ గృధ్రిము" లందురు.
అనుచు. లింగని ఫలభుక్తి నాదరించి. । తల్లి వీపున పిల్లలు. తండ్రి పైన
కోయరాజును నెక్కించు కొని ప్రయాణ । మైరి కైలాస గిరికి విహాయసమున.
రెండు రోజులు పయనించి వెండి కొండ । పైన వ్రాలిరి లింగడు. పక్షి చయము;
దక్షిన మొనర్చి. మ్రొక్కి కాత్యాయనికిని । విన్న వించిరి సంగతుల్ విశదముగను.
గౌరితోడ్కొనివచన, శంభు కడకునేగి. । వలగొనిమ్రొయొనర్చి సాష్టాంగ వందనములు,
వారు నిలువ, నబ్బుర పడియె శివుఁడు; । దీవన లొనంగి. ఇచ్చి యాతిథ్యములమి.
బంధనము మాన్పి. కోయల వదలి పెట్టి. । పక్షులన్నింటినని పెను వార్థిదరికి;
తెలుఁగు పెద్ద తెలుంగమదేవు కపుడు । పరిచయము చేసె లింగడు పక్షితతిని.

## హిమాలయములు

సురపతి నిరంకుశత్వము । భరియించుట కిష్టపడక, బలిసూదనపై
నరిగిరి తెలుఁగులు కోయలు । గిరి బేధిని వీడి, రజతగిరికందరమున్,
కోయలకు లింగ నరపతి । నాయకుఁడై నడప, తెలుఁగు నరవాహినికిన్
నాయకుఁడయ్యె తెలుంగముఁ డాయతవక్షుఁడు సమున్న తామల భుజుఁడై.
అప్పుడు పార్వతీదేవి వారిని దీవించి. "త్రోవలో హిమాలయ పర్వత శ్రేణి కలదు;
"హిమపూర్ణంబును. వ్యోమ శీర్షమును. మాహీధ్రోపలా పాతని
త్యమునై. ప్రయాణికుల కత్యాపాయదంబైన యా
హిమవత్ శైలము భూరికుడ్య నిభమై. ఇంద్రుండు పాలించు రా
జ్యములన్ వేఱొనరించి నిల్చు పెను హద్దై భారతా ఖ్యావనిన్.
"హిమ పద్గిరి నేపుట్టిన । కమనీయ విశాల సీమ; కావున నాకున్,
కొమరులు స్కందగణేశుల । సమముగ ప్రియమౌను భక్త జనతతులారా!
"ఆడితి చిన్ననాఁడు తుహినాద్రి కటిస్థల వన్యభూములన్;
పాడితి జాహ్నవీ సలిల పంక్తులతో శ్రుతికల్పి. పాటలన్;
తోడుగనున్న నెచ్చెలులతో విహరించితి మంచు బాటలన్;
జోడుగ వేటలాడితిమి శూలియు నేనును క్రూరజంతులన్,

శా॥ "చంచన్నేత్రకురంగ, జంబుకముఖన్, శ్వావిత్, వృకవ్రాతముల్,
పంచాస్యంబులు, ఖడ్గ, భల్లూక, కిటి, వ్యాఘ్రాది జంతు వ్రజం,
బంచత్సాగరగర్భ సంజనిత జంత్వోఘా వశేషంబులన్
మంచుంగుబ్బలి మీఁద గానబడు తన్మార్గోరు సంచారికిన్.

తే॥ "ఏలయన సబ్ధికడుపులో చాల నాళ్ళు । కడపి, యుద్భవమంది, యాకనము నంటి
పెరిగె నీధాత్రిధరపంక్తి, పృథ్వినున్న । యఖిల పర్వతముల నున్న తాగ్రిమగుచు.

వ॥ మీరు మానస సరోవర ప్రాంతము మీఁదుగా పోవుట మంచిది." అని

చ॥ పలికె "హిమాద్రి కద్దరిని, పశ్చిమ భూమికి నిర్గతంబ్రజల్
వలసలు వచ్చి తూర్పునకు వ్రాకు ప్రయత్నము చేయుచున్నవా
రలుక వహించి మీ పయికి నాలముకున్ దిగవచ్చు; జాగరూ
కులరయి సాగి, మీరెదురు కోవలె వారల నక్కడక్కడన్.

తే॥ "కార్ముక, పరిఘ, తూణీర, ఖడ్గధారు । లై యరుగ వలె మీలోన నధికబలులు;
కలడు నాయకుఁడుగ తెలుంగముఁడు మీకు; । కాన దాఁటుదురన్ని యిక్కట్లు మీరు

తే॥ "వార్ధిదెస, సింధునది పాటు ప్రాంతమెల్ల । సింధుదేశ మిటు హిరణ్య సీమవకు;
అచటి జనులెల్ల సుక్షత్రులగుటజేసి । యదునగను వారి సాహాయ్యమ వసరమున.

వ॥ "వారు మీ పూర్వుల సోదరుల వంశములవారు " అని, పునర్దీవించి యంపిన,

తెలుంగముఁడు

తే॥ ఈశాన్యదిశగ నా జను లరుగ సాగి, । మానస సరోవరంబున స్నానమాడి,
హిమమహోన్నత పర్వతాగ్రముల నడిమి । బాటల గమించి చేరిరి భరత భువిని.

తే॥ జాఱిపడియె నవశ్యాయ శైలపార్శ్వ భూరి నీరశిలాల; బాటసారు లందు
కోయ లింగనితో మఱి కొంత మంది । నలిగి, నది త్రోవలో హతాన్మరణ మంద

వ॥ ఇట్లు విధివశమున త్రోవలో 'లింగో' మరణించగా

ఉ॥ ఆకులపాటు చెంది, నయనాంబుధ వృష్టికి సూత్నపంకజా
కాకర వారమేర్పడ, మహావ్యథ గుండెలు బాదు కొంచు, శీ
ర్షాకలనంబు లొండొరుల హస్తములన్ గదుచేసికొంచు, ను
ద్భీకర శోక కీలికలు ప్రేగుల జొచ్చి దహింప, నోర్చుచున్.

ఉ॥ కోయలు, తెల్గులన్ మృతులకున్ జరిపించి యథోచితక్రియల్,
చేయున దేమిలేక, గుణ సింధుఁడు లింగని సాహసక్రియల్
స్వీయమనంబులన్ మెదల, చింతిలి చింతిలి, భారతోర్వికిన్
బోయెదు మార్గమధ్యమున భూరి విపద్ హతులై కలంగుచోన్

తే॥ నాఁడు కోయల యందుండె మూఁడు తెగలు; । 'ఊకు' 'వేప. 'పూస' మనునట్టినవి మూఁడు
పొందె 'ఊకము. 'మార్కము: 'పూస' మనెడు । పురుషులను వారి నాయక పుంగవులగ.

ఇట్లు, తెలుంగముని నాయకత్వమున తెలుఁగువారును, చేకము, మార్కము, పూసముల నా
యకత్వమున కోయతెగలును చని చని.
కాంచిరి కొన్ని రోజుల కొకానొక దీర్ఘిక; దాని నీట రా
యంచలు తేలెనీదుచును. నాడుచు. మున్గుచు, స్నానమాడి ఖ
షించుచు సజ్జనాళముల; చెంగటి తీరమునన్ బకాళి వి
శృంచలమై జపంబులను సల్పును చేఁపల బట్టి మ్రింగగన్.
విడిసి యచ్చట. నారేయి విశ్రమించి. । పిదప నరుణోదయంబున నదిని దాఁటి
నిశ్చయించిరి; ఇంతలో నింగి దోఁచె । సూర్యుఁడస్తాద్రి జేరెడు సూచనలును.
ఆ సూర్యుఁడు
కానబడె చెక్కు తీసిన కందగడ్డ । వలె; నపర గగన తలము పసుపు పూసి
కాళ్ల పారాణి దిద్దిన కాంత వోలె । తోఁచె; మెల్లగ రవి క్రుంకె దుర్బలుఁడయి.
మొగములను పద్మసంఘముల్ ముడుచు కొనియె; । కప్పుకొనె భూమి నల్లచీఁకట్ల ముసుగు
కొంతసేపటి కుదయించె కుముదమిత్రుఁ । డాకసంబున విరిసె చంద్రాతపంబు.
ఆన్నెల వంక గాంచి కుముదావళి మోములు విస్తరించె; సం
పన్నతనొందె గంధవహపంక్తి సుగంధము నిండి; క్రోదిరిన్
వెన్నెల నీరమై కనుల విందుగ పాఱినయట్లు తోఁచె; నా
సన్న యశర్వీజయ సాంద్రతకున్ శుభసూచకంబులై.
ఆ నడు రేయి దూరముగ వన్యనివాసుల పల్కు సందడుల్
వీనుల దోఁచినన్, గిరిజ ప్రీతి వచించిన హెచ్చరింపు హృ
న్మానస వీధులన్ మెదలె; "మమ్ముల హాయిగ 'లింగ బాణ' దే
శాన వసింపనీని దివిజ వ్రజ మియ్యెడ" యన్న పెన్ పగన్
తెలతెల వారు వేళ, రణధీరత నాయుధ పాణులై తెలుం
గుల బలగంబులేగె పలు కోయల దోచ్కొని; నిర్జరుల్ మహా
బలయుతులై యెదుర్కొనిరి; బంధుర సంగరమయ్యె; నిర్జరుల్
తెలుఁగుల ధాటి కోర్వగల తేకువ చాలక పారిపోయినన్
త్రిదశుల వస్తుసంచయము తెల్గులు, కోయలు కొల్లగొట్టి, వ
మ్ముదమున నాజ్య భక్ష్యములు మోపుగ వండి, భుజించి, త్రేన్చుచో
కదలెను సూర్యుఁడస్తగిరి గట్టులు దాఁటి; ధరాతలంబునన్
మొదలెను రాత్రి చీఁకటులు; మింటను నిండెను తారకా తతుల్.
మఱుదినంబున తొలిసంజ మలయు వేళ, । పడవలకు దెచ్చి యచ్చటి పల్లె వార
లంచలుగ వారి నెల్లర నచటి నదికి । నవలి యొడ్డుకు దాఁటించు నవసరమున
వరద ప్రారంభమయ్యెనాపగను; హెచ్చె । నందఱును దాఁటిరెటులో, నాయకులు తప్ప;

వఱద వేగము హెచ్చి తీవ్రత వహింప. । నదన తేర్రైరి పల్లెలు పడవలింక.

తే॥ అంచిరవుడు బిగ్గరగ నాయకులు: "మిగుల । కరుణజూడుము మమ్మహూ శరణదేవ!
ఇచట నీ వున్నచో, వేగనేగుదెంచి । అద్దరికి జేర్చు మమ్మిప్పు శార్త వరద!"

వ॥ అనిన యుత్తర క్షణమున

తే॥ మొసలి తెగవాఁడు కచ్ఛపము తెగవాఁడు । నైన యిద్దఱు పడుచువారటకు వచ్చి.
"ఎక్కరేవి మావీపుల నిపుడు మీరు । భద్రముగ మోతు మవ్వలి వైపు" కనిరి.

తే॥ మొసలి, తాబేళ్లుగా మాటి, ముందుపిలిచి. । "మోసగింపముమి"మ్మని బాసచేయ.
కచ్ఛపము వీపుపై తెలంగమును, వూన । మును, కడమ పెద్ద లిద్దఱు మొసలి నెక్కి

తే॥ తనువులను కలిపి బిగించి త్రాళ్లతోడ । వేలువేలుగ మొసలి తాబేళ్ల కపుడు
పయన మొనరించి రాపగ వఱద నీట; । అంత, నది మధ్య వలకేగి, యచటనాగి

తే॥ మొసలి తాబేళ్లు "నీటిలో మునిగి మిమ్ము । సంహరింతుము: తప్పదు చావ" నంగ
కత్తిదూసి యఱచె తెలంగముడు కనలి: । "మీరు పడుదురు ముందుగ మృత్యువాత"

వ॥ అనిన, మొసలి తాబేళ్లాలోచనామగ్న మయ్యె. అపుడు రాయగృధ్రములను 'బిందో' వి
లాయఱపునిని, తెలంగముఁడా పదలో నున్నట్లు గ్రహించి.

తే॥ అపుడు 'బిందో' విహంగము లటకు వచ్చి. । వారి నందఱ గట్టున వైచి. మొసలి
నాలుకను పీకె పెకలించి; యణగద్రొక్కె । కచ్ఛపము మెడ: నా తెలంగమును మెచ్చె.

తే॥ కావుననె లేవు నాల్కలు గ్రాహములకు: । కచ్ఛపగళంబు లూగుచు గానుపించు;
దేవసముఁడని రందఱు తెలుఁగు ధవుని; । ఆదరించిరి యచటి వారాగతులను.

## తెలుఁగు వారి నేపాళ దేశవాసము

తే॥ నేఁడు 'నేపాళ' మనియెదు నిత్యశైత్య । దేశపు 'ధవళగిరి' పొంత తెలుఁగు వారు
విడిసి, వ్యాపించిరచ్చట వివిధ దిశల । కోయలతో నవావాసంబు పాయకుండ.

మంజరి॥ చలికొండ కోనేళ్ల స్నానాలు చేసి. । చలికొండ నదులలో సయ్యాటలాడి.
పల్లెలను నిర్మించి, పట్నాలు కట్టి. । కాపురము చేసి రా కనుమలలోవారు.

తే॥ అచటి నదికి 'గోదావరి' యనెడు పేరు । పెట్టి, పల్లెలు పట్నముల్ కట్టుకొనిరి;
పూర్వదిశ 'నమరావతీ' పురము పెద్ద; । దటులనే 'ప్రతిష్ఠాన' మా యపర దిశను.

## తెలుఁగు వారు భరత ఖండమున విస్తరించుట

ఉ॥ వందల యేడు లిట్లు గడవన్, జన సంఖ్యలు విస్తృతంబులై
సందున, నాథువిన్ విడిచి, యామ్యముగాజని, విస్తరింపగా
కొందఱు తెల్గు వారలను, కోయలు పెద్దలు చెప్పినట్లుగా
ముందరకున్ ప్రయాణమయి, మూటలు ముల్లెల తోడ సాగగన్

వ॥ అంతట వారు చేరిన చోట్ల కూడ కాలక్రమమున

తే॥ తెలుఁగు జన సంఖ్య పెరిగి సుదీర్ఘమగుచు । విస్తృతవ్యాప్తిగాంచెను వివిధ దిశల

తెలుఁగు నాగరికత సంస్కృతియు, భాష । ప్రబలె దట్టమైయట నన్ని ప్రాంతములను.
అమరులు, తెల్గులిర్వురును నార్యులు గావున దేవ భాషయే
సమముగ నిర్వురున్ బలుకసాగిరి; భేదము[illegible]ండె పెక్కులై ;
తమ తొలి వేద నాగరికత ప్రభ, సంస్కృతియున్ విభిన్నమై
క్రమముగ మిశ్రమయ్యె నవి కాలము మెల్లగ సాగి పోవగన్.

త్రిదశుల వేద పద్ధతులకును, తెలుఁగుల సాంప్రదాయాచారములకును కొన్ని భేదములు స్ఫుటముగ నుండి, మిశ్రి సంస్కృతి యేర్పడుటకు కొన్ని శతాబ్దములు పట్టెను. ఉభయుల భాషలను కలిపి పోయి సంస్కృత భాష యేర్పడుటకును ఇట్లేకొన్ని శతాబ్దము పట్టెను.

ఆచటి భూమి 'నార్యావర్త' మనిరి జనులు । తెలుఁగుల నివాసమై యది పొలిచె గాన;
చంద్ర, సూర్యాది వంశ రాజన్యులగుచు । తెలుఁగు ప్రభులేలి రచటి పృథ్వీతలంబు.
వారి ఇతిహాసములు బహుగ్రంథప్రవచితములు కాన, నిట వివరించుట లేదు.
తెలుఁగు జాతి వారి కలసికట్టు తనంబు । తెలుఁగు జాతి వారి ధీసమృద్ధి
తెలుఁగు జాతి వారి బల, పరాక్రమములు । తెల్లమయ్యె దేశ దేశములను.

## మధుమంతము

గంగ దక్షిణమున కట్టిరి తెలుఁగులు మహిత పట్నము 'మధుమంత' మనగ;
కాలక్రమంబున 'నీల' భూస్థలినుండి,-దక్ష 'హరప్రియ' ధాత్రి నుండి,
వలస వచ్చి రటకు తెలుఁగుల పూర్వుల—సోదర వంశ్య, లసురుల సుతులు;
కొన్ని శతాబ్దముల్ గొప్పగా గడవగ,- 'దండు' 'డిక్ష్వాకు'ని తనయుఁడటకు
వచ్చి చేరగ, రాజుగా ప్రజలు వాని । నెన్నుకొని; రంత, నా దండుఁడేలు చుండ,
మట్టి వర్షించి పూడ్చెనా మహిత పురిని, । దాని దరి శత యోజన ధాత్రినెల్ల.
గురువగు శుక్రుని సుతయగు । 'అరజ'ను దండుఁడు చెరచిన, నాగ్రహ మందెన్;
కురిపించె మట్టి శుక్రుఁడు । పురియును దత్ప్రాంత మెల్ల పూడగ ననుచున్
అది దండకారణ్యమయ్యెననియు పురాణములు వాకొను చున్నవి.

## వివిధ సంస్కృతీ సాంప్రదాయముల కలయిక

సింధునది దరి ఉత్తర సీమలెల్ల । నాఁడు త్రిదశుల పరిపాలనమున నుండి
చెలిమి క్రమముగ నభివృద్ధి చేసికొనుచు । తెలుఁగు భూమితో తుదకవి కలపి పోయె,
ఉత్తరోదధి దాపున నుదయమంది, । వేదములు సింధునది పొంత పెరిగి కొంత;
పరిణతిని పొంది పూర్ణ రూపము ధరించె । తెలుఁగు వారి గంగా యమునలకు నడుమ,
ఆదిశక్తిని పూజించి రచటి పూర్వ । వాసు; లెనగె తెగలు జంతు, పక్షి, వృక్ష
నామముల; వారి యాచరణములు, సాంప్ర । దాయములు సాగె వారిలో తరతరముల,

కాలక్రమమున త్రిదశుల యొక్కయు, తెలుఁగుల యొక్కయు ఆచార సాంప్రదాయములలో కొన్నిటిని భారతదేశపు పూర్వ నివాసులును, వారి యాచార సాంప్రదాయములలో గొన్నిటిని

తెలుఁగు వారును త్రిదశులను స్వీకరించుచువచ్చిరి. ఇట్లు మిశ్రి సంస్కృతి యేర్పడెను. భాష విషయమున కూడ నిట్లే జరగెను. వివాహాది సంబంధ బాంధవ్యములు కూడ సాధారణమయ్యెను వసిష్ఠుడు అరుంధతిని వివాహ మాడెనుకదా; శుకుఁడు, శౌనకుఁడు, జాంబుకుఁడు వారి తల్లు తెగల పేర్లను పొందిరి. వాల్మీకి పుట్టతెగ తల్లికిని, వ్యాసుఁడు పల్లె వనితకును పుట్టిన మహ మహాంలు. (బ్రహ్మ = భర్మ Burma) వంగ దేశములకును తత్పరి సర ప్రాంతములకును భద్రాశ్ వర్షము వారు వలస వచ్చి, కాలక్రమమున తెలుఁగులతో గలసి పోయిరి. అట్లే భారత వర్ష భాగమ లగు భర్మ దేశమునకు తూర్పున శాంత (తూర్పు)మహాసముద్రమువఱకు గల భూభాగమునను పరిసర ద్వీపము లందును జరిగినది.

తే॥ పండితులు వేదముల యెడభక్తి జూప, । ప్రాతయాచారముల్ జనుల్ వదలరైరి;
మిశ్రసంస్కృతి కొందఱిమెప్పు పొందె; । పరిపరి విధంబుల య్యెను ప్రజలగతులు.

వ॥ కాని, ఆవిభిన్నతల నన్నిటిని లీనము చేసి కొనుచు, నొక ఏకత్వము ప్రబలమై, జనులు పొ పొచ్చెములు లేక సౌమ్యముగా జీవించు చుండిరి. అది నుండి నేటిఁవఱకును ఈ గుణము భార యుల ప్రత్యేకలక్షణము.

చ॥ తెలుఁగులు రాజ్య వర్తక తతిన్, వ్యవసాయ పరిశ్రమా దులన్
మెలగగ, పూర్వవాసులు సమీకుకృలై రితరావ వృత్తులన్;
వెలసిరి ప్రిప్రధానముగ విప్రులుగాత్రిదశార్య సంతతుల్;
కలసిరి యొక్కటై రవశి కాలములో తెలుఁగార్యశాఖిలోన్,

ఉ॥ కొండలరణ్యముల్ ప్రియము కోయల; కట్టుల గాన, యామ్యపుం
కొండలరణ్యముల్ వెదకి కొంచరిగచ్చట నిత్యవాసులై
యుండి, తెలుంగు వారల సహాచర భావముతోడ వృద్ధియై,
యండగ నుండి రాష్ట్ర హృదయంబు లెసంగ పరస్పరంబుగన్.

దండకారణ్యమున తెలుఁగు వారి వలసలు

సీ॥ కోయలతో పాటు కొందఱు తెలుఁగులు గంగకీవలి దండకావనమున
వలస గొనిరి కొట్టి వసుధారుహంబులు-చిన్న, పెద్ద నదుల చెంతజేరి
వృద్ధిజెందిరి వారు వేవేగ వేద విజ్ఞాన సంస్కృతులు భాషయును వారి
కంటవి దూరాన, యమున గంగా ద్యుత్తరాపగా తటవాసులైన తెలుఁగు

గీ॥ వారు వేదవిజ్ఞానము. భాష, సంస్కృతి, తమ విజ్ఞానమున, సంస్కృతిని, పలుకుల,
మిశ్రమము చేయ; నటులే మెలగ సురలు । తెలుఁగు విజ్ఞాన వాక్సంస్కృతులు గ్రహించి.

మ॥ శివునిన్ తెల్గులు పూజచేయ, విదునిన్ శ్రీవిష్ణు బూజించి రా
దివిజుల్ సింధునదీతటోత్తర బృహద్దేశంబునం; దిట్టులే
వివిధాచార విభిన్నతల్ చెలఁగె; నా భేదంబులెల్లన్ గమిం
చి, విమిశ్రోజ్వల సాంప్రదాయములు భాసించెన్ నిదానంబుగన్.

తే॥ తెలుఁగు లందు దక్షిణ దిశ జెలఁగు వారు । ప్రా తెలుఁగు పద్ధతుల యలవాటు మూన
కాచరించుచు నుండిరత్యా దరమున । పక్షిజంబు యొందొంటిని బోయనట్లు.

## ఆంధ్రుల పుట్టుక-తెలుఁగు వారు ఆంధ్రులగుట

వ॥ ఇట్లు జరుగుచుండ, బహు కాలమునకు

తే॥ 'గాధి' యను పేరి తెలుఁగు భూకాంతుఁడొప్పె; అతనికి మహాతపశ్శాలియైన కొడుకు
పుట్టి, యెన్నెన్నొ ఘనకార్యములఁ నొనర్చె; । బ్రహ్మ సృష్టికి ప్రతిసృష్టి పరఁగ జేసె.

వ॥ అతని పేరు కౌశికుఁడు.

చ॥ కుల, మత, జాతి భేదములు కూల్పఁగఁడంగెను; దేవ తృప్తికై
బలుల నొనరింపరాదనియె ప్రాణుల-ముఖ్యముగా నరావళిన్;
మలలను, కానఁన్ మనల మానవులన్ దివ తెల్గు వారిలో
గలుపుట యుక్తమైన ఘనకార్య మటంచును జాటె నిష్ఠతోన్.

తే॥ పండితులు, వారి భక్తులు, ప్రజలు పెక్కు । రిది సహింపక, వదియించి రితఁడమిత్రుఁ
డెల్ల విశ్వంబునకునని; ఇందుచేత । నతఁడు గాంచె 'విశ్వామిత్రుఁ'డనెడు పేరు.

ఉ॥ గంగకు కొంత దక్షిణముగా కల విస్తృత భూమి భాగమున్
మ్రింగెను దండకావనము, మింట శశాంకుని రాహు పోల్కి;న
బ్బంగినొనర్చె నాభువిని భార్గవు శాపము; భాసురాసురో
త్తుంగ సుభాగ్యరంగమది తొల్లిటి నాఁడు, మహాబలాఢ్యమై.

క॥ తెలుఁగుల వలసలు పెక్కులు । వెలసెను తత్కాననమున; వేదాచారం
బులుఁ వారి కంటమిని, ప్రా । తెలుఁగుల పద్ధతులు, సంస్కృతియు నెసఁగెనటన్.

తే॥ ఆయడవి జనావాసము లచ్చటచట । గల; వసురులును, నరభక్షకులగు రాక్ష
సులును నివసించిరందు; వారలను సంస్క । రింపనెంచి, విశ్వామిత్రుఁడంపె సుతుల.

తే॥ ఆసుతుల జ్యేష్ఠు, డాంధ్రాఖ్యుడాశ్రమంబు । గట్టుకొని మిశ్ర సంస్కృతిన్ గలుపసాగె
దండకాటవి వారి కఖండదీక్ష; నతని సంతతి వారెల్ల రాంధ్రులైరి.

తే॥ వివిధ దిశలకు వేవేగ విస్తరించి, । ఆంధ్ర, సింహ, కళింగము లాది యైన
పేర్లిడిరి వారు నివసించు పృథ్వీతతికి. । ఆంధ్రులందపటి తెలుఁగు వారైక్యమైరి.

తే॥ వేష భాషాదు లొక్కటై వెలయు కతన, । అపటి తెలుఁగుల నెల్లరు నాంధ్రులనిరి;
'ఆంధ్ర' 'తెలుఁగు' పదము లేకార్థమిచ్చు । శబ్దములుగ వాడబడుట సంభవించె.

## ప్రా తెలుఁగు, వేద, మిశ్ర సంస్కృతుల ఘర్షణ

వ॥ సింధు నదీ తీరపు టుత్తర ప్రాంతపు వేదాచార సంస్కృతు లింకను తెలుఁగుల ఆచార సంస్కృతులతో పూర్తిగా మిశ్రితముకాక పూర్వము, ప్రాతెలుఁగులయు, పూర్వవాసులయు ఆచార సంస్కృతులు గంగానది ప్రవహించు తూర్పు, దక్షిణ ప్రాంతములందు ప్రబలముగా నుండెను. ఆసమయమున

చ॥ కృతయుగమందు మాన్యులుగ కీర్తి గడించిన రాజ వర్యులన్
'సుతపుండు' మానవాళి శుభ శోభన కాంక్షుఁడు గంగ తూరుపుం
గుతలమునేలి, 'దీక్ష' యను కోమలి ధర్మ సువర్ణ మేదినీ
పతితనయన్ వివాహమయి. ప్రాప్తసుతుండయి రాజ్య మేలఁబోన్

చ॥ 'బలి' యను నాసుతుం డుదయ భానుని కైవడి నేపుగాంచి, కో
సల తనయన్ 'సుదేష్ణ' యను సాధ్విని పెండిలియై, మనోంగదో
ర్బలసుతు లాఱ్వురన్ బడసె భాస్కర సన్నిభ వీర విక్రమో
జ్జ్వలదనల స్వభావుల, విశాల తెలుంగను భూమి పొంగగన్.

తే॥ చదువుకొను నీడు వచ్చిన పిదప, నిలను । సాటిలేని ప్రవీణుఁడా నాఁటి ముఖ్య
దేవ గురు వర్య ననుజుఁడు 'దీర్ఘతము'ని । వలన నేర్చిరి సకల విద్యలను వారు.

తే॥ పిదప, గురుదక్షిణగ శిష్య వితతి నడిగె । దీర్ఘతముఁ "వేను భాగీరథీ ప్రవంతి
నడుమ నిలిచి వేదజప మొనర్ప దలఁతు; । వఱద నను తాఁక కుండ కాపాడ వలయు"

తే॥ అనిన, నీయకొని, వఱద నాపు వేయి । కట్టలను కట్ట శిష్యులు: గంగ వేయి
పాయలై పాఱె; గురుని జపం బవిఘ్న । మగుచు నిత్యము కొనసాగె, నతఁడు మెచ్చ.

తే॥ చతురులను బుద్ధిమంతులు, సజ్జనులు, సకల గుణఖనుల్ తత్సుతుల్ జనుల కెల్ల
విధములను దోడ్పడిరి రాజ్య విషయములను । సర్వజనులు సుఖింప తదుర్వియందు.

వ॥ అంగ, వంగ, సింహ, కళింగ, ఆంధ్రములనెడు భూభాగములా నాఁడు బలి ఏలుబడిలో నుండెను.

తే॥ బలి ముదుసలియై, రాజ్యము పంచిపెట్టి, । సుతుల భూభాగముల పేరు సుతుల కప్పె;
ఆ తెలుఁగు భూమ లైకమత్యతకు నిలయ । మై పరస్పర సౌభాగ్యమరయు చుండె.

వ॥ ఆఱ్గురు తనయులలో నొకఁడు దత్తుఁడుగా ధర్మ దేశమునకు రాజయ్యెను.

తే॥ దీర్ఘతము రాక వెనువెంట తెలుఁగు సాంప్ర । దాయముల చోట వేదపద్ధతు లుపెలసె;
బలి పిదప కూడ అంగుని పాలనమున । బలము గొని వేదపద్ధతుల్ వ్యాప్తి జెందె.

తే॥ జనులు దీనికి తమ అనిష్టమును దెలుప, । పెదచెవిని బెట్టె నంగుఁడు; పెక్కునాళ్ల
కంగునకు 'సునీథ'కు 'వేనుఁ' డను సుతుండు । కలిగి పెద్దవాఁడయ్యె; సంగతుల నెఱిఁగె,

చ॥ తెలిపెను తండ్రికిన్ ప్రజల తీవ్ర విరోధము వేద పక్కికిన్;
పలికెను తండ్రి; "కూపమున వాసమొనర్చెడు కప్పలట్లువ,
జలగల దేశముల్ ప్రగతిసాధన చేసెదు తీరు మాని, ప్రా
తెలుఁగుల సాంప్రదాయములు తేవలె నున్నతికంచు ఝేలలై.

క॥ "మన తెలుఁగు సాంప్రదాయం । బున కేనడ్డంబు రాను; భువినను దెసలన్
జనములు వైదిక మార్గము । ననుసరుణ మొనర్ప, మనకు నాగుట తగునే?

క॥ "నీ తాత బలినృపాలుం । డీతత్త్వము దెలిసి, జనుల హితము. భవిష్యత్
ప్రీతియు గోరి, విమర్శా । తీతుండయి, వేద పద్ధతిని తలపెట్టెన్.

క॥ "కోసల, విదేహా, అశ్మక, । కాసియు, తత్ప్రశ్చిమంపు కాశ్యపి వేదో
ద్భాసితమై మన సంస్కృతి । తో సమ్మిశ్రంబవదె చతుర్థిశ లలరన్?

తే॥ "వేద రచనము పూర్తి కాలేదు వత్స! । పూర్తియగు నాటి కందులో బోలెడంత
తెలుగు నాగరికత సంస్కృతియు జెలంగు; । జనులకిని శాంతముగ బోధపరచవలయు.

క॥ "వారల కిని వివరించు ప్ర । చారకులను నిర్ణయించి, చర్చలు, గోష్ఠుల్,
భూరిజనోపన్యాసము । లూరూరన్ బరగజేసి తోర్పన తనయా!

తే॥ "ఈ పథమ్మును చేపట్టు మీవు పుత్ర!" । యనెడు తండ్రికి సుతుడెదు రాడ లేక,
తక్షణము పిన తండ్రుల దరసి, తెలిపె। తాను ప్రజలను తండ్రియు దలచు విధము.

వ॥ వారిట్లనిరి

ఉ॥ "నిక్కము దూరదర్శియగు నీజనకుండు ప్రజాహితైషియై
మక్కువ మీఱ నీయెడల, మానసమున్ వివరించినట్టి స
ద్వాక్కులు, సందియంబుడిగి, తద్వచనామృత మాత్మనింపి, పే
రెక్కుము సత్సుతుండవుగ, నెల్లరు మెచ్చ నృపాల మౌళిగా"

వ॥ అనిన పిన తండ్రులకు అంగ వేముడిట్లనియె;

శా॥ "మీమీ రాజ్యములందు తద్విధముగా మీరేల వర్తింపరి
ట్లామోదంబు నిరాకృతం బయిన వేదాచార మార్గంబు నా
కామోదంబు, క్రియాత్మకంబనుచు నెయ్యం బొప్ప బోధించు మీ
యామాటల్ దయతో సుబోధకము చేయన్ మిమ్ము నర్థించెదన్."

వ॥ అనిన, వారిట్లనిరి: "మేమును వేదమతప్రి మార్గము ధ్యేయముగా ప్రచారము చేయుచున్నాము

తే॥ "వినుము; మాయేలుబడి లోని వివిధ జనులు । ప్రా తెలుగు పద్ధతుల తత్పరుల భక్తి;
లెట్టి మార్పును వారికి గిట్ట నేర ; దెక్కువగ వేద పద్ధతి నెఱుగరివట.

వ॥ "చిట్టిబొట్టు, బొమ్మల నోము, అట్ల తద్దె 33 పున్నముల నోము మొదలగు నూఱు నోములలో కొన్నిటినైన నోచుటయు; వివిధములగు పేర్లతో స్త్రీ దేవతలను, గ్రామదేవతలను, చనిపోయిన పితరులను గొలుచుటయు; చెట్లను, పాములను, అనేకములగు జంతువులలో నేయొకదానినో ఒక్కొక్క తెగవారు పవిత్రముగా నెంచి పూజించుటయు; మంత్రములు లేకుండ, కొన్ని యాచార ములను పాటించుచు, పెండ్లిండ్లు చేసికొనుటయు; వధూవరులొకరిపై నొకరు పసుపునీరు జల్లుకొన గనే ఆలుమగ లగుటయు: కుండపగులగొట్టి విడాకు లిచ్చుటయు; స్త్రీ పురుషులు మాఱు మనువులు చేసికొనుటయు; పుట్టిన బిడ్డను జల్లెడలో నుంచుట మొదలగు పుత్రోత్సవములను చేయుటయు; మరణించిన గొప్ప వారితో పాటు మతొకరినిగాని, కొందఱనుగాని పాతిపెట్టుటయో దహన మొనర్చుట యో జంపుటయు; మరణ సంబంధమైన కర్మలు నేటి వేద విధానమునకు భిన్నముగ నుండుటయు; మొదలగు ఆచార సాంప్రదాయములు మారాజ్యము లందు ప్రబలములు. ఇవి ఇక్కడి తెలుగుల యొక్కయు, పూర్వనివాసుల యొక్కయు మిశ్ర మాచార సాంప్రదాయములు.

తే॥ "వేద కర్మల వీక్షించి, వినిన కొన్ని । తరములకు గాని, అవి హానికరము కావు
సుమ్మ సకొస; రీ ప్రాంత సూక్ష్మమిద్ది; । తిరుగ బడుదురు; కూర్తురు మతములిచట

వ॥ "ఇందు చేత, మేము త్వరపడక, శాంతముగా, నెమ్మదిగా వేద మిశ్ర మార్గ ప్రచారము సాగించు చున్నాము.

తే॥ "అంగ రాజ్యము భిన్న మీయన్ని గుణము । లం; దచట మిశ్ర సంస్కృతి యలరె నిపుడు;
అచ్చ తెలుగచ్చ వైదిక మలరు కలిసి; దేని నద్ది వన్నైన మర్దింతు రోయి.

ఆ॥ "కలవు మన్న యెడల కప్పకు కోపము; । పాము కోపగించు వలదటన్న;
కత్తియంచు సాము గతి నీవు వర్తింప । వలయు జనకు నడుగు జాడలందు"

తే॥ పూర్తిగా నన్ని విషయముల్ బోధపడియె; । అంగ మాంధ్రాదులకు భిన్నమనియు నెఱిగె:
కాని, వేనుఁడు వైదిక కర్మలనిన । ద్వేషభావంబు మానక, పెంచుకొనియె,

తే॥ ఆంధ్రునకు బుట్టెనొకసుతుఁ డతఁడు కూడ । 'వేనుఁ'డను పేర వర్ధిల్లె; వీని 'నాంధ్ర
వేనుఁ'డన, తొలి యతఁ 'డంగవేనుఁ'డయ్యె; । పితలు మరణింప, రాజ్యముల్ వీరి వయ్యె

వ॥ అంగవేనుఁడంతట

ఉ॥ పాలన చేసె భూప్రజ నపారదయన్, తన తండ్రి వాక్యముల్
పాలన చేసి వైదికము ప్రాతెలుఁగుందన మాచరించుచున్;
కాలము సాగనిట్టు, లొక పుణ్యసమయనందు 'మరీచి' నామకుం
డేలిక జూడవచ్చి, ధనమిమ్మనె చేయ నఖండ యజ్ఞమున్,

ఉ॥ "మీ పరిపాలనన్ ప్రజలు మేటిసుఖంబులు పొంది; రెల్లపై
ర్లెపుగపండె; వర్షము మహేంద్రుదయన్ గురిసెన్ సకాలమం;
దీ పగిదిన్ సురల్ జరుపకిప్పు దవర్షపు క్షామ వంజ్ఞలన్
జూపిరి; వారు తుష్టిగనుచో క్రతుచర్యకు, రావు క్షామముల్"

వ॥ అవిన, అంగ వేనుఁడిట్లనియె:

క॥ "నదులను, వార్ధుల, చెఱువుల । నుదకము నావిరిగ భిల్చియొనఁగు జలము వా
రిదములు; క్రతుసాధ్యము కా దిది; చూతము సవ్య మార్గ మేదైన విఁకన్"

చ॥ అవిన, మరీచి యాగ్రహము నంది, బొమల్ముడి వైచి, "వేదముల్
కనుగొనె యజ్ఞమార్గమును; కాదను రాజసవ్వుఁ, డిట్టియో
చనలకు శిక్షగా నిపుడు సాగవలెన్ దశవర్షయాగ! మో
జనగణపాల! వేదము లసత్యములంచు వచింప జెల్లునే?"

శా॥ వేనుండిట్లనె: "కోపశాపములచే వేదోక్తి కౌన్నత్యసం
ధానంబున్ ఘటియింపబోకుము; భితధ్వాంఛల్ వడిన్దీర్తు, నెం
దైనన్ విప్రులబోయు నేతిపొగ వ్యోమాభ్రింబుగా మాటి, వా
నై, పీరంబులు క్రుమ్మరించునను వాక్యంబుల్ దయన్జూపు చోన్,

ఉ॥ "నాటునవేరెంతు వేదముల నాణ్యతకున్ గల దగ్ర పీఠ; మీ
క్షమపయిరాకమాన; దది జన్మములన్ గని పారిపోదు; నీ
కేమిటి కీవృధాశ్రమ, మహేతుక కోపము? నా ప్రజావళీ
క్షేమము నేను చూచుకొని, చేయుదు చేయ గలట్టి దంతయున్,"

మ॥ అనినన్, గోపము రెట్టి చేసికొని, రాజాస్థానమున్ వీడి, దు
ర్జన తత్వంబున వర్తక స్థలమునన్ జాటెన్: "నృపాలుండహం
బున వేదంబుల ధిక్కరించి మిడిశెన్; పూజ్యుల్, బుధుల్ పెద్దశి
క్షను వెయన్ జనుదెం"డటంచు, నిగమజ్ఞాముల్ సమర్థింపగన్

తే॥ విని మరీచిని, క్రతుభక్తజనులు కినిసి, । రాజునొద్దకుజని, "వేద రక్షకుఁడవు
కానినీవనర్హుడ; విఁక గద్దె దిగుము । వేగమిపు"డని శపియింప, వేనుఁడనియె:

తే॥ "క్రతువు వలదంటి, వంతియే కాని, వేద । రక్షణమును వలాన లేదు; కాన,
అర్ధరహితము మీశాప; మంగనృపుని । ధిక్కరణ సేరమని మీరు తెలియు"డనిన.

తే॥ బలిమిమైపట్టి, రోటిలో తలను గ్రుక్కి । దంచి చంపిరి రోకళ్ల, దారుణముగ
వేనరాజును క్రూరులా వేదవిదులు; । గర్భవతి పట్టమహిషి దుఃఖమున గుర్రింగ.

## ఆంధ్ర వేనుఁడు - ఆంధ్రులవెలి.

మ॥ వినియా ఘోరకఠోరవార్త, గహనా భీలోగ్రదావాగ్నియై,
చనుదెంచెన్ వెస నాంధ్రవేనుఁడు మహీచక్రంబు కంపింప; దు
ర్జనులన్ యజ్ఞవినోదులన్ గదిసి, నిర్దాక్షిణ్యంబుగా జీల్చి, వే
షునకున్ దర్పణ మిచ్చె నెత్తురుల, బంధుప్రీతి సంధిల్లగన్.

ఉ॥ వేనుని హంత కౌఘమగు వేదవిదుల్ పరుగెత్త, వారినె
మ్మనులు చీల్చి ముక్కలుగ, మేపెను సాళువ గృధ్రపంక్తి; క
జ్ఞాను, తమోగుణిన్, గుమతి, ఛాందసు, మూర్ఖు మరీచి దైలవుం
గానుగ బిప్పిచేసి, కునకంబులకున్ బడవైచె కాయమున్.

వ॥ అంతట

తే॥ ఆంధ్ర, వంగ, కళింగ, సింహ భువిజనుల । వేద బాహ్యులుగా వెలివేయ మిశ్ర
దేశవాసులు; వీరు నా దేశజనుల । నటులె వెలివైచి రన్యోన్యమణచి పుచ్చి.

తే॥ పృథుని బ్రసవించె నపు డంగవేను రాణి; । అతఁడు పెద్ద వాఁడగుటకాని రాజ్య
మేలె; పిమ్మట పృథుఁడేలె పెక్కు నాళ్లు; । చేరెనపుడు వేద సంస్కృతుల మఱల.

వ॥ పృథునకు 'అర్చియు, అర్చికి 'హవిర్ధానుఁడు' ను జనించి వరుసగా నంగ రాజ్యమేలిరి.

తే॥ ఆంధ్ర వేనుఁడు బహుకాల మవనినేలి, । ఆంధ్ర జనకుబైశ్వర్యాభివృద్ధి
పాదుకొరిపెను తెలుఁగుల ప్రభలు వెలుఁగ; పిదప సుతుఁడు 'నిషాదుడు' పృథ్వినేలె,

వ॥ ఆంధ్రవేనుని రెండవ కుమారుఁడగు 'చక్రవర్తి' యు నిషాదుఁడును రాజ్యము పంచుకొనగా.

చక్రవర్తికి రాజధాని గల భూభాగమును, నిషాదునకు అరణ్యమయమైన భూభాగమును దక్కెను నిషాదుఁడు వేఱొక రాజధానిని నిర్మించుకొని 'నిషధ'యని పేరు పెట్టెను. షట్చక్రవర్తులలో నొకఁడగు 'నలుఁడు' ఇతని వంశము వాఁడే.

పరశు రాముఁడు

తే॥ దండకాటవి పాగ్రిమధ్య ధరణులందు । గాధి సుతుఁడెట్లు మిత్ర మార్గమును వ్యాపి
చేయఁబూనెనో తెలుఁగుల సీమలందు, ఇతరజన సీమ లందున, నెలమి నటులె

తే॥ తపతి, నర్మద సహ్యాద్రి దాపులందు । నిలిచె 'జమదగ్ని' యచ్చటి తెలుఁగువారి
కితరులకు వేద మార్గము నెఱుక చేయ; । 'రేణుక' ను బెండ్లియాడె క్షత్రియ సతంబు.

క॥ నలుగురు తనయులు వారికి । కలిగిరి; మూఁడవ సుతుఁడు జగద్వంద్యుఁడు గొ
ర్డలి యాయుధమైన ఘనుఁడు । చెలఁగె 'పరశురాముఁ'డన బ్రసిద్ధుండగుచున్.

చ॥ అలపసుతివ్రతా తిలక మాసతి రేణుక నర్మదానదీ
జల మనునిత్యమున్ సికత జాల వినిర్మితమైన కుండతో
నెలవుకు దెచ్చుచుండె; ధరణీపతి నీడను నీట జూచి యా
వెలది మదిన్ జలించె నొక వేకువ వేళను, కుండ చిట్లగన్.

క॥ తన పాపమెఱిఁగి, యింటికి । జని, భర్త నడిగెను శిక్ష సాధ్వీమణి; యా
ముని మరణ శిక్ష తగునని । తనయులతో జెప్పె నామెతల విడగొట్టన్.

తే॥ సుతులు ముగ్గురు తల్లిని హతమొనర్ప । నొల్లరైరి; పరశురాముఁడొక్క వ్రేటు
తో జనని తలద్రుంప, దృప్తుఁడయిన ముని, "వరమడుగు మిత్తు" నని పుత్రవరుని తోడ.

వ॥ అంత నాపరశురాముఁడు

క॥ బ్రదికింప గోరె తల్లిని; । సదయుత నంగీకరించి జమదగ్ని "శిరం
బదికించు మొండెమున" కనె; । నదికించుటతో సజీవ యయ్యె వనితయున్.

తే॥ తల్లి తల కొట్టునప్పుడు తల్లి వెనుక । నిలిచి యుండిన సుదొక నెలత తలయు
నవనిదుర్లె; పరశురాముఁడదుకునపుడు । తల్లి తల నాపురంధ్రి గాత్రమున కలిపె.

తే॥ అవయవము లందు శిరము ముఖ్యంబుగాన, । పడతిని గ్రహించె జమదగ్ని భార్యగాను;
చావు మూడిన వేఱొక దాన శిరము । నదుక నచటి మొండెమున, కడియు బ్రదికి

వ॥ మాలల దేవతయై.

తే॥ ఏగె నింటికి; పిదప, కొన్నేండ్ల కచటి । వేఱు 'కార్తవీర్యుఁడు' ధిక్కరించి మునిని,
సుదమును, మిత్ర సంస్కృతిన్, పీకివేసి । యాశ్రమము, తోలుకొని పోయె నావులన్ని.

వ॥ ఆపుడింట లేని పరశురాముఁడింటికివచ్చి, చెట్టు క్రింద గూర్చొనియున్న తల్లిదండ్రుల వలన సంగతులు తెలిసికొని, 'హయహయ' వంశపు తెలుఁగు రాజైన కార్తవీర్యుని చర్యకు

ఉ॥ ఆ జమదగ్ని సూనుఁడధికా గ్రహమంది, కుఠారహస్తుఁడై
రాజును గాంచి, "ఈగతి కిరాతకచర్యకు బూనుటొప్పునే?

నీ జవ సత్వముల్, ఘనత, నీ రణ కౌశలమున్ దలంచి ని
ర్వ్యాజముగా మునీశ్వరుల బాధలు పెట్టెదు విన్ను ద్రుంచెదన్
"రమ్మిక పు డాహవంబునకు రాక్షసబుద్ధి! భవన్మదంబు, గ
ర్వమ్ము నేనడంతు సమరంబున "నంచు సవాలు చేసినన్,
నెమ్మన మందు నేత్రముల నిల్చిన రోషము సాంధ్య సూర్యబిం
బమ్ముగ జేయ మోమును, క్షమాతల నాథుడు లేచె నుగ్రుడై.
ఇరువురు యుద్ధము చేయగ, । ధరణీతల మదర జొచ్చె; ధాత్రిరుహంబుల్
గురుతర ఝుంఝా నిలముల । కెరయైన మాడ్కి వణకి, మహీస్థలి గూలెన్.
ఒకరినొకరు పరిమార్పగ । రకరకముల యెత్తుగడమ, పరాక్రమ శక్తుల్
ప్రకటించిరి; యమభటు లే । యొకరి యసువులో కొని చన నోపిక వట్టన్.
తుదకపరాహ్ణ వేళ, రవితొల్లి క్రొ పశ్చిమ కేగు బాట, సం
పదలను, రాజ్యమున్, పతిని, బంధుల, పుత్రుల వీడి, యాస్యరా
ట్పదసముజేరు పెద్ద జనె క్ష్మాతలనాథుడు కార్తవీర్యుడు
బుదముల ద్రోసికొం; చట నపుణ్యులు స్వాగతమీయ నిల్వగన్
తెలుగు గాథావళిలో నీకథ ఇట్లుండగా, పురాణములు జమదగ్ని కేవుకు కుమారుడనియు పరశు రాముడు కషపటి వాడనియు, వాకొను చున్నవి. అందలి కథ కూడ కొంత భిన్నముగా నున్నది
తెలుగు సంస్కృతి ద్విజుల సంస్కృతియు గూడి - మిశ్ర సంస్కృతియై, సమీరమట్లు
వ్యాపించె నుత్తరభరత ఖండంబున; - దక్షిణాపథమున దాని వ్యాప్తి
కై జమదగ్నియు, గాధేయుడును పూను - కొనిరి తెలుగులందు, కోయలందు
నిట నివసించిన యితరులం; దీయుద్య - మారి యాకార్తవీర్యసరపాలు
నుడిపి, వెదకి వెదకి యిట్టి పుడమి ధవుల । కొలకు, వారిని రణమున గూల్చెభువిని
పరశురాముడు గొడ్డలి పట్టి తిరిగి; । దాని సులువయ్యె కార్యసాధనకు నపుడు.

## ఆంధ్రుల వెలితీరుట - కౌసల్యా పరిణయము

ఆంధ్రులు వెలివేయబడిన పిమ్మట చాలా కాలమునకు రఘు వంశ సంభవుండైన దశరథుని బాల్యదశాకాలమున, ఆంధ్ర, సింహ, కళింగ దేశములే కాక, నిషధ, ఉత్కళ, శబర, దక్షిణ, కోసల, కరూశ మొదలైన దేశములు కూడ ఆంధ్రదేశముతో యుండెను. విదేహ, ఉత్తర కోసల, కాసి మొదలైన గంగానది కుత్తరదేశముల ప్రజలు మిశ్ర సంస్కృతిని ఆదరించుచుండిరి. వానిలో బ్రాహ్మణులు, క్షత్రియులు వేద సంస్కృతి పట్ల, వేద (గీర్వాణ) భాషలు కలసిన మిశ్రభాష పట్ల ఎక్కువ ఆదర భావమును చూపుచుండిరి ఆంధ్ర రాజ్యములు కాలక్రమమున తమ ప్రాతెలుగు ఆచార సాంప్రదాయములను వదలించుకొని వానితో పాటు వేద సంస్కృతితో గలసిన మిశ్ర సంస్కృతిని ఆదరించి అవలంబించుటకు విశ్వామిత్రుని సంతతివారి కృషి ఫలితముగా సిద్ధపడు చుండెను. ఆ రాజ్యముల ప్రజలలో ఉన్నత శ్రేణికి చెందినవారు ఇందుకు ఎక్కువ మొగ్గు చూపు

...డిరి. ఆసమయమున విశ్వామిత్రుఁడు దశరథుని తండ్రియగు 'అజు'ని కడకేగి ఇట్లనెను:

సు॥ "ఇన వంశాధిప: ఆంధ్రరాజ్యములతో విన్నేండ్లుగా మైత్రితో
మన మేనాఁడు మెలంగమైతి; మిది సంభావ్యంబుకా; దన్వియున్
ఘన శక్త్యుక్తియుతంబు లౌట స్ఫుటమై కావ్పించె; నీ దూర బు
ద్ధిని సారించి, పరస్ప రైక్యమభివృద్ధిన్ జేయుటల్ మేలగున్.

క॥ "వెలి పెట్టితి మిన్నేండ్లును। ఇల సంస్కృతు లందు మనము ప్రాజ్ఞుల మనుచున్;
అలవడె మన సంస్కృతి వా। రలకిపు: డింక వెలి సాగరాదు నృపాలా!

తే॥ "శీతగిరులును, తద్యామ్య సీమలెల్ల। భిన్నతల న్ననిటిని గలుపు తిన్ననైన
ఏక సంస్కృతిమయముతై యెసఁగ వలయు। సొబగు పూసల మంగళ సూత్రమట్లు

తే॥ "అంబరమున తారలకు శశాంకు మాడ్కి। రాజులకు పైన నొక్క రారాజు వలయు;
అర్కవంశజుఁడే యిందు కర్హుఁడగును। ఆంధ్రవనిత నీకోడలై యలరునేని.

తే॥ "ఈపగిది తెలుంగను దేవునింటి వాఁడ। పైన నీవును, నా యింటి యాంధ్రదవుఁడు
వియ్యమందినచో, మూర్ఖ్యవిఘ్నమడిగి। ఇరు బలము లుందు నీ పౌత్రికరము నందు.

తే॥ "ఆంధ్రరాజ్యచయమునకు యామ్యమందు। వఱలు గహనము రాక్షస వ్యాపితంబు;
పలయు నొకొకెడ ఋష్యాశ్రమములు, పక్షి। కోయ వానరాది జనుల గూడెములును.

తే॥ "ఈ మహీభాగమేకమయ్యేదు పునాది। వేయవలె నాంధ్రవనితను పెండ్లి చేసి
నీ కుమారున; కిటు నీవు నిర్ణయంబు। కైకొనిన, నేను సాధింతు కార్యసిద్ధి.

క॥ "కలదు కదా దక్షిణ కోసల యను నాంధ్రధరణి సుఖ సంపన్నంబై,
బల, విద్యా. గుణయుతమై। తల మానిక మాంధ్ర రాజ్యతతి నీ నాఁటన్.

క॥ "ఆ రాజేంద్రుని పుత్రిక। వీరాంగన, సద్గుణాఢ్యని, విలసత్ రంభా
నీరాజిత లావణ్య, స। మారాధిత భార్గవీ కృపార్ణవ యొప్పున్

మ॥ "తగు నాకన్నియ నీ కుమార రవి; కౌతందున్ దగున్ కన్యకున్;
తగవౌ సన్ని విధంబులన్, జరగుటే దాంపత్య" మంచు వచిం
పగ మౌనీందుఁ, డజుండు సంతసమునన్ వాక్రుచ్చి యంగీకృతిన్,
తగు రీతిన్ దన ధన్యవాదముల నందన్ జేసె సాష్టాంగియై.

తే॥ అంత, దక్షిణ కోస లాధ్యక్షు దరిసి,। అజున కెట్టుల చెప్పెనో యటులె చెప్పి,
కబురు పంపంగ జేసెను గాధి సుతుఁడు। అజునకు దశరథు పరిణయమును గూర్చి.

వ॥ అజుఁడీయ కొనిన వెంటనే పెండ్లి పనులు ప్రారంభమై,

క॥ ఆకస మంతటి పందిరి। ఈ కాశ్యపియంత తిన్నె. యిందు జ్యోత్స్నా
నీకము జల్లెడు దీపా। నేకము లేర్పరచె నాంధ్రి నృప వరుఁడంతన్.

మ॥ అమరాచార్య సమ ప్రభావుఁడు వసిష్ఠాచార్యనిర్ణీత ల
గ్నముహూర్తంబున బెండ్లియయ్యె నజజున్ కౌలస్య ఆంధ్రుల్ తెలుం

గములున్, కోయలు, దేవతల్ కలసి పల్కన్ మేటి యాశీర్వచ
స్సముదాయంబులు, వాద్య, వేదముల ఘోషల్ మ్రోయ కర్ణంబులన్.

వ॥ అజుని పిమ్మట దశరథుడు ఉత్తర కోసలాధిపుడై కౌసల్య పట్టమహిషిగా, తన పూర్వులవలె 'సరయూ' నదీ తటపు 'అయోధ్య' రాజధానిగా రాజ్య మేలుచు, 'సుమిత్ర,' 'కైక' యను నారీ మణులను కూడ వివాహమై కౌసల్య యందు 'రాము'ని, కైక యందు 'భరతు'ని సుమిత్ర యందు 'లక్ష్మణ, 'శత్రుఘ్ను'లను కవలను బడసి, ఆ కుమారులకు వసిష్ఠునిచే నన్ని విద్యలను నేర్పించెను. రామలక్ష్మణు లొకరొకరి నెడ బాయక మనలు చుండిరి, అప్పుడు విశ్వామిత్రుడు.

## శ్రీరాముడు

మ॥ తరుణం బయ్యెను కోసలాధిపునుతున్ దైత్యాంతకున్ జేయ, ను
గ్రరణం బందున దిగ్జయం బొనగు శస్త్ర, వ్యూహ, ఖడ్గాస్త్రపున్
వెరపుల్ నేర్పగనంచు, గాధిసుతుడుర్వీనాధు దర్శించి, దా
శరధిన్ బంపగ గోరె నాశ్రమముకున్ సంగ్రామ విద్యార్థ మై.

సీ॥ "భరత ఖండపు రాజ వంశంబు లందరక-వంశమే యగ్రాగ్రవంశ మధిప!
అవని తెలుంగము, లాంధ్రులున్, సురలును-మిళిత సంస్కృతి గల్గి మెలగు చుండ,
రాక్షసుల్ దండకారణ్యంబువన్ నిల్చి-గిలలైరి మన సుసంస్కృతికి, మనకు;
ఏక సంస్కృతియును, నేకరాజ్యాధిప-త్యంబును నెలకొల్ప నవసరంబు;

గీ॥ ఆంధ్ర, తెలుగు నెత్తురు లేక మయ్యెనెవని । తనువున, నతడె యుండుట తగినవాడు;
వాడె రాముడు, నీ పట్టి, భాను వంశ్యు; । డితడు నేర్వ వలెను విద్య లింక కొన్ని.

తే॥ "ఇనుప విల్లులు, విశిఖంబు, లినుపగదలు, । ఇనుప గోళ్లును, మారణ హింసకైన
ఇతర సామగ్రి వాడుదురీదనుజులు; । కాన, రామునకు తగు శిక్షణము వలయు.

తే॥ నేను రణ విద్యలన్నిటి నేర్పదలచి । యతని గొని పోవ వచ్చితి నాశ్రమమున;
కతని తోడుగ నింకొక సుతుని గూడ । నంపుచో, జోడుగా నేర్తురంపవిద్య"

తే॥ అనిన, నృపతియు, కౌసల్య హర్షమంది, । సతి సుమిత్ర, సమాత్యుని సంప్రదించి,
రామ, లక్ష్మణులను బంపి రామునెందు । వెంట మునుసటి శమ్యుషస్వేశ యందు.

వ॥ అట్లు, రామ లక్ష్మణులను తోడ్కొని చని,

ఉ॥ వారికి యుద్ధవిద్యల నపారముగా మునినేర్పి, "యంగజా
రారిని గూడ సంగరము నందున గెల్చెదు నేర్పుమీకు చే
కూరెను; దీని రాక్షసుల గూల్చుటకున్ వినియోగపర్చి యీ
భారత ధాత్రినేకముగ భాసిల జేయుడు మీరలిర్వురున్"

తే॥ అని, 'సుబాహుడు,' 'మారీచు'డనెడు రాక్ష । సులు గల యెడకు గొనిచని, "గెలువ వలయు
ముందుగా వీరి" నని తెల్పి, ముని వరుడు । "తొలి పరీక్ష మీకిది" యని పలికి నిలిచి.

ఉ॥ నాతప, మగ్నిహూత్రములు, నా దినచర్యలు పాడు చేయుచే

ఈ తుఱవల్ మహాక్రియగ నెంచుదు; రిట్టిదె 'తాటకా' ఖ్యయౌ
మాతయు వీరికిన్ గలదు; మాంసము, నెత్తురు హోమవహ్నిలో
వైతు, తపస్యయౌ బహుళ పాప చయంబులు వీరి కృత్యముల్,

తే॥ "కాన, మనుపుడు; పుణ్యము కట్టుకొనుము; । నాకు మీరిచ్చు గురు దక్షిణ యిది; మఱియు
నీ భవమున మీ రొనరించు విట్టిపనుల । క్షత్రియోచితమౌ తొలి కార్యమగును.

వ॥ అని విశ్వామిత్రుఁడు పలికిన.

తే॥ దాశరథు లిర్వురను పోరి, తాటకాత్మ । జుల వధింపగ, వేయి యేన్గుల బలంబు
గలుగు తాటక దీకొనె గద ధరించి; । రాము నమ్మల మడసె నారక్కసియును.

ఆ॥ గురుఁడు సంతసించి, గుర్తిచ్చి కౌగిట, వారి; । "ఇంక నొక్క కార్య మీవు చేసి
ప్రజ్ఞచూపవలయు రామభద్రా!" యని । పలికెను ముని సార్వ భౌముఁ డిట్లు:

వ॥ "విదేహ దేశమునకు జనకుఁడు పరిపాలకుఁడు.

చ॥ "కలదు విదేహలో శివుని కార్ముక మొక్కటి రాజు నొద్ద: కా
వలయును దాని నెత్తుట కపార మహాయత భూరి శక్తి; కో
సల తనయా తనూజ! రఘుసత్తమ! నా ప్రియ శిష్య! దానిదో
ర్బలమున నెక్కు పెట్టి, సుఖవంత మొనర్పుము నా హృదబ్జమున్."

చ॥ అనుచు, విదేహ ముఖ్య పురమౌ మిధిలాపురికా కుమారులన్
గొనిచనె, నాంధ్ర రాజ్యమగు గొప్ప 'కరూశ'ను దాఁటి త్రోవలోన్;
జనక నరేంద్రుచే మువ్వురు స్వాగతమందిరి; రాకకారణం
బును ముని తెల్ప, కార్ముకము పొంతకు చేరిరి వారు నల్వురున్.

క॥ విశ్వామిత్రుని శిష్యుఁడు । విశ్వాసము నిండ హృదయ వీధిని, రాముం
డీశ్వరు వింటిని చేకొని, । విశ్వంభర వణక, నెక్కుపెట్టెను దానిన్.

ఉ॥ లాగగ వింటి నారిని బలంబుగ, తున్గెను విల్లు ముక్కలై,
సాగర సప్తకంబు మొగసాలను ఘూర్ణిలి నట్లు; కాలమే
ఘాగత భూరిఘోషలోకసై గగనంబును జీల్చినట్లు మూ
ర్మోగె దిశాంత రాశములు, మోదము నందగ రాజు మౌనియున్.

వ॥ అప్పుడు విశ్వామిత్రునితో జనకుఁడిట్లు పలికెను:

క॥ "ఈ వింటి నెక్కు పెట్టెడు । భూవరుసుతు కిత్తు నాదు పుత్రిక ననుచున్
ధీవర! చాటింపించితి; । నే వారును నెత్తజాల కే గిరి చింతన్.

వ॥ "నా కుమార్తె యగు 'సీత' యొక నాఁడీ చాపము నెత్తుటను నేను చూచిన కారణమున

మ॥ "బల తేజంబులు, నందచందములు, విద్వద్బుద్ధిసై శిత్యముల్,
కళ కాంతుల్, గుణశీలముల్ కలుగు సత్కన్యామణిన్ పుత్రికన్
తులయౌ వీరున కిచ్చి పెండ్లి యొనరింతున్ గాక నేనంచు ని

శ్చల బుద్ధిన్ దలపోయ, పండినవి నా సంకల్పముల్ నీ దయన్."

వ॥ అని. విశ్వామిత్రునకు సాష్టాంగ ప్రణామము లొనరిచి రాము నుద్దేశించి

మ॥ "ముదమయ్యెన్మది; సీత వచ్చె నిదిగో పూమాల చేబూని; య
య్యది హారంబుగ దాల్చి వందనము గొమ్మా పాద పద్మంబులన్;
వదనాబ్జద్వయ మంద హాసముల శోభల్ దెల్పెనో రామ। మీ
హృదయైక్యం; బిదె లేఖ నంపెద నయోధ్యేశున్ వడిన్ బిల్చుచున్"

వ॥ అని, యట్లొనరింప ఆ శుభలేఖ నందుకొని. దశరథుండతి ప్రమోదంబున బెండ్లికీయ కొని. స కుటుంబముగా. బంధుమిత్ర పరివార సమేతుఁడై మిథిల కేతెంచెను.

సీ॥ పురము. రాజనగరు పుష్ప పర్ణములతో–పసుపు గుమ్మములతో పరిఢవిల్ల,
పెండ్లి పందిరిలోన పెద్దలు, యువజనుల్.–బాల. బాలికలు సంబరము చేయ,
బహు వర్ణ వస్త్రముల్. పైడి భూషలు దాల్చి–సీమం తినీ జనుల్ చెలువు నింప,
వర వధూ ద్వయముపై భాసింప దృక్కాంతి,–పెండ్లికి సాక్షిగా వెలుగనగ్ని.

గీ॥ సీత పెండ్లియయ్యె శ్రీరామ చంద్రుని । చైత్ర శుద్ధనవమి జరుగు నాఁడు,
వేద మంత్రచయము వీనుల విందుగా । మేళ తాళములతొ మేళ వింప.

వ॥ ఆ సుముహూర్తము నందే జనకుని సోదర కుమార్తె లైన 'ఊర్మిళ'ను లక్ష్మణుఁడును. 'మాండవి'ని భరతుఁడును. 'శ్రుతకీర్తి'ని శత్రుఘ్నుఁడును పెండ్లియైరి. అయోధ్య కందఱును తిరిగి వచ్చిరి

తే॥ కొంత కాల మయోధ్యలో సంతసమున । గడపి, వనవాస మేగెను కైక కోర్కి–
కలన రాముఁడు, తనకు లక్ష్మణుఁడు సీత । యను సరింప; విశ్వామిత్రుఁడపుడు వచ్చి,

సీ॥ "దండ కాటవిలోన దనరు ఋష్యాశ్రమ–రాజియు, కొన్ని నద్రాజ్యములును;
కదమని రాక్షసగణమయం; బట, ఖర,–దూషణ, త్రిశిరాది దుష్టరాక్ష
సస్థానమున్నది; జాగ్రతతో నుండు;–దేను నేర్పిన విద్య లిపుడు మీకు
నీఖండమునకు మేలిచ్చుత" యనుచు దీ–వనలిచ్చి, యిటులనె మునివరుండు:

గీ॥ వారి పెదతల్లి కొడుకు 'రావణుఁడు' 'లంక' కధిపతి; । కలదు వారల కతని యండ;
అతని తమ్ముడు, పుత్రుడు, నతని సైన్య ధవులు మహా వీరు లాహవము లందు.

ఉ॥ "నీలధునీ సమీపమున నిల్చి తపస్వి 'కుబేరు' నామపుం
శైలము బద్ధలై యిటకు సాగెను, దొర్లుచు వార్ధినీట; నా
శైలపు చెక్క 'లంక' యయి. శాశ్వతమయ్యెను యామ్యమందు; త
త్పాలకుఁడైన రావణుఁడు వైరి జనంబున్ మడియించి, మీ కటన్.

వ॥ "అతఁడు నీల నదీ ప్రాంతపు 'కా' వంశస్థుఁడు, ఆ వంశాధీశులలో మహా బల సంపన్నుఁడు

మ॥ "మన పూర్వీకమును 'లింగవా' వనెడు సీమన్ వీడి, యీ భారతా

---

క్రీ॥ పూ॥ 4వ సహస్రాబ్దములో "కా" వంశస్థులు "ఈజిప్టు" ను పరిపాలించిరి. వారిలో 6వ రాజు "రా–ఎస్–ఉసిర్ (రా–వణ–అసుర) క్రీ॥ పూ॥ 3,633 నుండి 3589, వఱకురాజ్య మేలెను.

వనికిన్ జేరిన యట్లు, 'వానరు' లదే ప్రాంతంబు నుండి దళున్;
జను దేరన్, నెలవిచ్చె కాననము 'ఋశ్య' క్ష్మాధరోర్వీస్థలిన్
అమకూలింతుపు వారు మీ కతనితో నాలంబు ప్రాప్తింపగన్.

వ॥ "వారిలో

మ॥ "హనుమంతుండని లాంజనా తనయుండై యా విశ్వవించెన్ తుషా
ర నగోదీచ్యమువన్, మహాబలుఁడు; చేరన్ వచ్చి 'ఋశ్యాద్రి' కిన్,
ఘను, 'సుగ్రీవు'ని గొల్చు మంత్రిగను; నక్కల్యాణముల్ మీకు గూ
ర్చ నతందెక్కువగా శ్రమించు రఘువర్యా! నీ మహా భక్తుఁడై.

వ॥ "ఆ వానరులలో సుగ్రీవుని అన్నయు, శత్రువును అయిన 'వాలి' యను మహా బలశాలి కలడు.

శా॥ "రామా! ఈ భుజనాభ ఖండమును సర్వం బైక్యమున్ జేసి, నం
క్షేమంబున్ సమకూర్చ భూ ప్రజకు, నిన్ సృష్టించె వద్మోద్భవుం;
డా మార్గంబున 'వాలి', 'రావణుఁడు' నీ కడ్డంబు;, వారిద్వరన్
సామర్ధ్యంబున నీవు ద్రుంపవలె నైక్ష్వాకేంద్రా! శక్త్యుక్తులన్."

వ॥ అని పలికి పున రాశీర్వదించి, విశ్వామిత్రుఁడు నిజాశ్రమమునకరిగెను అంతట జానకీ రామలక్ష్మణు లరణ్య వాసమును సాగించిరి.

సీ॥ ఎలమిని గొన్నాళ్లు ఋషులతో నివసించి,-బహుకాలము వసించి వంచవటిని,
దుష్ట రాక్షసులను దనిమి దోర్బలమున,-నెన్నెల్లొ పదునాలు గేండ్లు కడపి,
సీత నెత్తుక పోయి సింహళంబునదాఁచ-రాక్షస రాజైన రావణుండు,
హనుమంతు దూతగా నంపి, సేతువు కట్టి-వానరసేనతో వనధి దాఁటి,

గీ॥ అలమున రావణుని ససైన్యముగ దునిమి, । అనుజుతో, సీతతో నయోధ్యకును వచ్చి,
రాజ్యమేలెను దశరథ రామచంద్రుఁ । డఖిల జనతతి సుఖియించి హర్షమొంద.

తే। రావణు వధకు ముందు శ్రీరాముఁడుదిపె । 'వాలి' నృపతిని సుగ్రీవు భాగ్రిత; పిదప
నెల్ల భారత నంస్కృతు లేక మనుచు । దెలుప, రామలింగేశు బ్రతిష్ఠ జేసె

కోయలు రావణ వంశ్యులగుట

వ॥ దండ కారణ్యమున నివసించు చుండిన కోయలు

ఉ॥ రావణుఁడేలు నాఁడతని రాజ్యమునన్ నివసించి యుంటచే
రావణపక్షమై నిలిచి, రామునితో సమరంబునల్పినా
రావన గోత్రి వారు; లిపుడింకను గొల్చుచు పంక్తికంఠునిన్
"రావణ వంశ జాతులము; ప్రాప్తయశస్వుల" మందురుద్ధతిన్.

తే॥ 'ఇంద్రజిత్తు'ను దలఁచి యేటేట వారు । 'మేఘనాధోత్సవం' బను మేటి నంబ
రమును సలుపుదురైదు దినములు ప్రాల్గు, । బంపు హోళికా పౌర్ణమి నాఁటి నుండి.

వ॥ వీరిప్పుడు 'కోయలు,' 'గొండులు' అను పేర్లతో నొప్పు చున్నారు.

## దండకారణ్యమున తెలుఁగుల క్రొత్త వలసలు

వ॥ శ్రీరాముఁడంతట దండకారణ్యమున జనవివాసము లేర్పరపనెంచి, ఉత్తర భారత రాజ్యముల తెలుఁగు వారి ననేకులను దక్షిణమున వలస గొనుఁడని సంతతప్రవాహముగా పంపుచు వచ్చెను.

ఉ॥ ఉత్తర కోసలంబున నయోధ్యపురాదుల నుండి వేలమం
దత్తఱి నాంధ్ర భూమికి బ్రయాణము చేసి వసింపవచ్చి, కృ
ష్ణోత్తర దక్షిణంబులను జుండగ సాగిరి; పెక్కుచోటులం
దుత్తమ మైన పల్లెలను, నూరులు లేచెను దండకాటవిన్.

తే॥ వారి నాయకుఁడిక్ష్వాకు వంశ్యుఁడైన । 'ధర్మభేతాళు;'డతని సంతతియె రాజ్య
మును వహించెను శాతవాహనుల పిదప; । బౌద్ధ, హిందూ మతంబుల నుద్ధరించె.

వ॥ శ్రీరాముని పిమ్మట కొంత కాలమునకు వలస వచ్చిన తెలుఁగుల సంతతుల వారు ఇంకను దక్షిణమునకు వ్యాపించుచునెడ.

తే॥ అచటి 'ధనికొండ' దగ్గఱ నడ్డమయ్యె । ధుని 'శిలానది'; దాని యందు దిగువారు
శిలలగుదురన్న పెను భీతి చేత నొక్క । విగ్రహము తల దానిలో వేయ, తటిని

తే॥ పాయ తీసెను వారలావలకు జేర; । నచట నూళ్లను నిర్మించి రదవి నఱకి;
పాడి పంటలతో పాటు వంశవృద్ధి । బడసిరట నాంధ్రరాజుల పాలనమున.

వ॥ ఇట్లే గోదావరి కిరువైపులను వారి వలసలు వ్యాప్తములయ్యెను.

తే॥ తొలుతనే కాక, మఱలను తెలుఁగు లాంధ్రి । లొక్కచో యొంట, పలుకును నొక్కటౌట,
ఉన్న ఆంధ్రులతో జేరి యెక్కువైరి । వలస వచ్చిన యెల్లరు తెలుఁగువారు.

## 'కా' యను తెగవారి వలసలు

తే॥ దండకను 'సాత్పురాద్రి' 'వింధ్య' లకు నడిమి । స్థలము జనమయ మయ్యె 'కా' కులము వారు
వలస వచ్చుట చేత రావణుని నాఁడు; । కలదు దీనిని గూర్చిన కథ యొకండు.

తే॥ రావణుఁడు కోరె శంభు నా ప్రాంత మెల్ల । జనమయము జేయ; 'కాకేశ్వరు' నటకంపి
శివుఁ డెఱుపు మట్టితో నున్న చీమ పుట్ట । కలుగు తావెన్ని, తనకది తెలుపు మనియె.

శా॥ ఆ కాకేశ్వరుడక్లొవర్పు, గిరికుండా చోట మృత్తిన్ గ్రహిం
నేకంబున్ సృజియించె; వాసవుఁడు వానిన్ జూర్ణమున్ జేయ రా,
నా కోర్కిన్ గురుతించి కాపుకునకం బా ఇంద్రు, నశ్వంబులన్
జీకా కొంవగ జేయుచో, శివుఁడు పోసెన్ ప్రాణమా బొమ్మలన్.

వ॥ ఆ బొమ్మ మనుజులకును ఇంద్రుని సేనలకును యుద్ధము జరిగెను.

తే॥ ఓడిపోతిరి త్రిదశు లా యుద్ధమందు; । మనసిజారాతి యాజ్ఞ పై 'మాంగు' లనెడు
మాదిగలు ధాన్యము, పసుల మందలీయ, । బొమ్మ మనుజులు క్రిమ వృద్ధి పొందిరచట.

వ॥ ఈ 'కా' కులము వారు నీలనదీ ప్రాంతము నుండి బయలు దేరి, పశ్చిమాసియా, ఇరాన్, బెలూచిస్థాన్, సింధ్, దక్షిణపంజాబ్, కచ్, పశ్చిమ మధ్యప్రదేశ్, గుజరాత్‌లలో నివసించి, ఆగ్నేయముగా

పయనించి, కృష్ణాతీరమును చేరి 'శ్రీకాకుళము'ను వారి కులము పేరున నిర్మించిరి. ఆ పుణ్య పిదప ఆంధ్ర విష్ణుని ఆంధ్రి సామ్రాజ్యమునకు రాజధానియై విలసిల్లినది 'కా' కులము వా ఆంధ్రులలో లీనమైరి.

## శ్రీరామాశ్వమేధము

తే॥ భరత, లక్ష్మణుల్, శత్రుఘ్నుఁడ రత గొలువ, । రాముఁడాగాధిసుతు కోర్కి ప్రత్యయమున
అశ్వమేధ యాగ మొనర్చి, యఖిలభారత । పావనీకుల కగ్ర రాజయ్యె బలిమి.

తే॥ తన సుపాలనకును న్యాయ ధర్మములకు । ఒరుల స్వేచ్ఛకు భంగము జరుగకుండ
నడచుకొను రీతి నిచ్చెను పుడమి జనుల । కతుల మగు స్వేచ్ఛ నా గాధి సుతుని కోర్కి.

చ॥ తెలుఁగుల నెత్తుటన్, తెలుఁగు దేవుని సంతతి వారలైన యాం
ధ్రుల రుధిరంబునన్ బొడమి, దోర్బల యుక్తుల నేక భూమిగా
మలచెను భారత క్షమ సమస్తము రాముఁడు; పూరుషాళిలో
నిలిచెను మేరు శైలముగ నేఁటికి, రేపటి, కెల్ల కాలమున్.

తే॥ తాను, భార్యయు, తమ్ములాదర్శమూర్తు । లైరి కలకాలము చతుర్దశావనులకు,
కాల కాలాల, దేశ దేశాల నట్టి । వారు మఱి లేరు లేరను ప్రతిభగాంచి.

## విశ్వామిత్రుని సంకల్పములు ఫలించుట

వ॥ దక్షిణ భారత దేశ వాసు లందఱను సంస్కరించి వేద మిశ్ర సంస్కృతి గఱపి, ఆంధ్రులలో గలపు కొనుటకు విశ్వామిత్రుని సంతతి వారెడతెగని ప్రయత్నములు చేయుచుండిరి కదా? అట్టి అనేక శతాబ్దముల కృషి ఫలితముగా

మ॥ పరమాంశా నసులైన రాక్షసుల నానా శాఖలన్ వారు నా
గరికం బొనరించి, తెల్గుజన సంస్కారంబు హృద్వాటులన్
బరగన్ జేయగ, చాల కాలమున నా వర్గంబు లాంధ్రింబులై
మురియన్ జొచ్చెను, గాధి రాట్పుతుని నోముల్, స్వప్నముల్ పండగన్.

మ॥ తరులన్, సర్పములన్ భజించు జనబృందంబుల్ తమన్ శ్రద్ధతో
పరిపాలించెడు నాంధ్రి రాజుల ప్రభావం మాత్మలన్ మెల్లగా
పరివర్తింపగ జేయ, నాంధ్రుల సదభ్యాసంబులన్ బూని; తా
నరులన్, పూర్వపు భోగి భక్తజనులే 'నాగుల్' మహా శిల్పులన్.

తే॥ భల్లుకము పేరి తెగవారు, వానరులును, । దైవమును లోకమాతగా దలఁచు వారు,
భరత ఖండపు దక్షిణ వాసు లెల్ల । రాంధ్ర విజ్ఞాన సంస్కృతు లందుకొనిరి.

ఆ॥ తెలుఁగు వారు కాని పలు జనంబుల నగ్రి । పంక్తి వారు వేద పద్ధతులను
తెలుఁగు సంస్కృతియు నధికగముగ పాటింప । క్రింది పంక్తి నడచె మందగతిని.

తే॥ తరుణ బహు వర్ణ పుష్ప కదంబ మట్లు । తన సుతల తోడి కృత్తిక తారయట్లు
ఉపనదుల తోడి ధుని యట్లు ఉజ్వలించె । నటుల గాధేయ సంతాన మాంధ్రజాతి.

## శ్రీకృష్ణుడు

తే॥ కొంత కాలమునకు ద్వాపరాంత వేళ । దగ్గఱించెను; భారత ధరణి యందు
తెలుగు, లాంధ్రులు, వితరులు గలసిపోయి । ఏకజాతిగ రూపొంది రెల్ల యెడల.

తే॥ ఏక సంస్కృతి వర్థిల్లె; నెదిగె మఱ్ఱి । చెట్టు పోలిక, యుగములు చెల్లుచుండ;
అట్టి యుత్కృష్ట సంస్కృతి నాదరింప । కుండ, పెడత్రోవ పట్టిరి కొంతమంది.

తే॥ యమున యొడ్డున మథురలో నట్టి తఱిని । తెలుగు దంపతులకు కృష్ణుడెలమి పుట్టి,
దేవుడొక్కడె; చిల్లర దేవతలకు । పూజ తగదని చెప్పాడె బోధచేసె.

తే॥ మేనమామకు మామగారైన మగధ । విభు 'జరాసంధు' రాకను వినీ, మధురను
వీడి, యేగి, 'ద్వారక' గట్టె; 'భీష్మకు' సుత, । నాంధ్రి 'రుక్మిణి' బెండ్లాడె నతిముదమున.

తే॥ ఆంధ్రుని, 'చాణూరు'డను కరూశాధిరాజు । మల్ల యుద్ధమున నడిపి మహిమజూపె;
ఆంధ్రవిభు, 'దంతవక్త్రు' ని హాత మొనర్చె; । చైద్యుడను నాంధ్ర 'శిశుపాలు' సంహరించె;

ఉ॥ ఎన్నిక జేసె ధర్మసుతు నీ భరతోర్వికి నాయకుండుగా;
నన్నియ వాంతరంబులు, ప్రయాసలు దాటి, జయంబుగాంచె, తా
నెన్నిన భారతైక్యత ఫలించుటకై; వినుమంబు, శీఘ్రమున్
క్రొన్నెల వంద పాటుపడె, కోవిదుడైన యుపాయ శాలియై

క॥ ద్వారక నేలుచు జనపతు । లేరీతిని మెలగవలెనొ యేర్పడ, తనస్వీ
యోరుతర వర్తనంబున । దారిని జూపించె బహుళ దైనిక చర్యన్.

క॥ భగవద్గీతను పలుకుచు, । జగతీతల మూద్ధరింప, జన హిత మొసగన్
నిగ మార్ధసార మిదియని । భగవానుడు 'ఫల్గును' నకు స్పష్టమొనర్చెన్.

తే॥ రాముడైక్యత భారత రాజ్యములకు । గూర్చెనొకనాడు; కృష్ణుడు కూర్చెతుదల;
అతుల విజ్ఞానలతకు దార్ఢ్యత నొసంగె । అఖిల భువన ప్రజాక్షేమ మవతరింప.

## తెలుగు ఆంధ్రభాష యగుట

వ॥ కొంత కాలమునకు విశ్వామిత్రుని కుమారుడైన ఆంధ్రుని వంశమున 'అగ్నిమిత్రుడు' అను రాజు ప్రభవించెను. అతని కుమారుడు 'సత్యభాగుడు'.

తే॥ అర్క కిరణాగ్ని చే సుతుడంధుడైన, । అగ్ని మిత్రుడు సురవాక్కులందు వేడె
తపన దేవుని సుతుగ్రుడ్డి తనము మాన్ప, । వినుడు ప్రత్యక్షమై నృపు కనియె విట్లు:

ఆ॥ "తేనెలొలుకు తేట తెలుగు పలుకు లుండ, । వేరు దేలనన్ను వేద భాష?"
అనుచు, సుతుని, జనకు నాలుమాసములలో । తెలుగు నందు పండితులుగ జేసె.

తే॥ ఆ తెలుంగున స్తుతియింప, పరు్కడలరి । కనుల చూపిచ్చె సత్యభాగునకు; విట్టు
లంధతను మానుపన్, తెలుగాంధ్ర మయ్యె; । ననుచు దెలుపును సాంప్రదాయిక చరిత్ర.

వ॥ పాణిని న్నాడు సంస్కరింపబడి, ప్రసిద్ధమైన 'సంస్కృతము' తెలుగు, గీర్వాణ (వేద) భాషా మిశ్రమము. తక్కిన మిశ్రభాషలను ప్రాకృత భాషలందురు ప్రాకృత భాషలు మొదట నాలుగు

పైశాచి, చూళికా పైశాచి, దాక్షిణాత్యము, అపభ్రంశము. పిదప, మాగధి, శూరసేని కలసి అ
అయినవి.

సీ॥ ఆంధ్రులు తెలుగువారమ్మ యొడిని నేర్చి—రది తెలుంగమద్దేవునార్యభాష;
ఆదితేయులకది యతి దూరమున దక్షి-ణా పథంబున నిల్చి నాటెమైన
తెలుగు భాషగ, తేనెలొలుకు పల్కు-గ కీర్తి—నంది, ప్రజా భాష యగుచు నిచట
అగ్నిమిత్రు కతన నాంధ్ర భాషగ నామ—మంది, వట మహీజమట్లు పెరిగె;
గీ॥ భరత భువిని తెన్ దిక్కున ప్రజల పలుకు। భాష, 'తెన్నుదుగ్గై' యది క్రాంచె 'తెనుగు'
భాషయను పేరు; తెలుగుల భాష యగుట। కలిగె 'తెలుగ'ను నామము తొలుతనుండి.
సీ॥ చాల కాల మిట్లు సాగుచు నుండగ- పెక్కుగతుల భాషవృద్ధి చెందె;
తుంగ భద్రాదుల తోయముల్ కృష్ణా ప్ర—వాహమందు గలసి పాఱినట్లు
నీలాపగా తట నివసిత జనరాజి- సింధు దేశము గుండ చేరి యిటకు
తెచ్చిన మానవాదిమ భాష కొమ్మయౌ—'కా' జన భాషయు గలసె నందు;
గీ॥ వరుణ, మూసి, భీమాది స్రవంతులట్లు। అమర భాషా పదంబులు, నన్య దేశ
పదములును జేరె తెలుగులో వ్యవహార సంఖ్య। నిఖిల దేశాల తోడి వాణిజ్య కలన.
వ॥ ఈ తెలుగు భాషయే అగ్నిమిత్రుడు సూర్యుని వరమున పొందినట్లు సాంప్రదాయ సిద్ధముగ నెన్నబడు మన ఆంధ్ర భాష. ఇది పలు శతాబ్దములు దక్షిణ భారత దేశమందంతటను వ్యాపించి భాష. అధర్వణుడు, అఘోశజుడు, కణ్వుడు, బృహస్పతి, పుష్పదంతుడు, రావణుడు ఇంద్రుడు, ఆంధ్రవిష్ణు మొదలైన వారు వేలు వేలు కాలములలో ఈ భాషకు వ్యాకరణకర్తలైరి. అనేకానేక శతాబ్దములకు
ఆ॥ దాని నుండి పుట్టి తమిళ, కన్నడములు। వ్యాప్తిగాంచె తల్లి భాష వోలె;
మఱియు నాంధ్ర భాష 'మలయాళ', 'తుళు' లను। కొమ్మలను తొడిగెను కొమరు సుతల.
వ॥ తమిళము ఆంధ్ర, ఆఫ్రికా పశ్చిమ తీర భాషల మిశ్రమము. ఉత్తరాపథమున
తే॥ తెలుంగులకు పూర్వమట మన్న తెగల భాష। తెలుగు, గీర్వాణములతోడ గలసి పోయి,
'ప్రాకృతం'బయి "పాలి"యై, పరగు నేడు। భాల్చి "హిందీ" య నెడు పేరు తమ్మినయన;
సీ॥ వంగాది రాష్ట్రములంగూడ నిట్లు లే—"బెంగాలి" మొదలగు పేర్ల తోడ
చెలగు భాషలు పుట్టె; సింధు, బెలూచి రా—ష్ట్రముల "బ్రాహీ" తోడ నంది గలసి,
త్రిదశుల భాష "సింధీ", "బెలూచీ" లను-పుట్టించె; వాయువ్యమునను నేడు
పరగు భాష లమర భాషకు బిడ్డలు,—"పార్సీ", "అరబ్బీ"ల పలుకు లందు
గీ॥ కొంత కొంతగ జేరి పలుకులు పలుకును, । భరత ఖండపు టుత్తర భాగ మందు
పరగు నీ పరిస్థితి భువి వార్య మగుచు; । కాల గమన మీ మార్పులు కలుగ జేసె.
వ॥ ఉత్తర దక్షిణములు మధ్య దేశమునను, పశ్చిమ సముద్ర తీరము నందును కొంకణులు, మహా రాష్ట్రులు, సౌరాష్ట్రులును, ఘూర్జరులును, తూర్పు సముద్ర తీరపు ఉత్కళులును తమ ఆంధ్రజాతీయ

తను, భాషను కాల క్రమమున మఱచి పోయి నేఁటు ప్రాకృత భవమురైన మిశ్ర భాషలను వాడు చున్నారు.

అశ్వాసాంతము

పృథ్వి॥ తెలుంగు జనముల్ హిమాద్రివితతిన్ గమించద్ధరన్
జెలంగి, భరతోర్వినేలి, తమ జీవితంబుల్ ఘనం
బులై వెలుఁగ, నాంధ్రులై, భువన భూషలై వట్టి యు
జ్వలాది కథలన్ విధాతృపతి శారదాః తెల్పితిన్.

# తెలుఁగు వారి ఆదిచరిత్రము
## శ్రీకాకుళ ఖండమను అను చతుర్థాశ్వాసము

ఉ॥ శ్రీయుతుఁడాంధ్ర విష్ణుని విశుద్ధ చరిత్రను దెల్ప బూనితిన్
నీయనమాన శక్తి తతి నీరదమై కురియన్ మదీయ హృ
త్తోయగ పూర్ణమై; వినుము తోయరుహాననః ఈ కథా మృతం
బీయిల నింత మేర కెవరెన్నడు దెల్పగ లేదు శారదా!

మ॥ మహా నీయుండగు నార్షయోగి వరుఁడామ్నా యేతిహాసంబులన్
బహు నిమ్నస్థ విశేషముల్ వెదకి, కుప్పల్ పోసె తద్రత్నముల్;
మిహిరత్విడ్మణి అంధ్రవిష్ణు కథ చిమ్మెన్ వానిలో సుప్రభా
లహరుల్ పద్మజ కల్ప కోటి యుతకాల వ్యాప్త సందీప్తమై.

వ॥ ఆంధ్రవిష్ణు జన్మించుట ఏల యెట్లు తటస్థించెనో తెలుపు కథ కలదు.

విష్ణుమూర్తి—విశ్వామిత్రుఁడు

ద్విపద॥ ద్వాపరయుగపు చివరి కాల మందు । భూపతుల్ తమ బంధు పుత్రమిత్రముగ
భారత రణమందు పరమ పదింప । వీరులు మఱి కొన్ని వేల సంఖ్యలుగ
ననువు లొగ్గిరి పాండ వాశ్వ మేధమున; । ముసలంబు యదుకులంబును రూపుమాపె;
వేయి హాయినములు వెడలగ, మఱల । హాయిగా భారత వసుధ వర్ధిల్లె,
జరుగ నింకే నూఱు సంవత్సరములు । భరత వర్షంబున ప్రబలెను శాంతి;
ఇట్టి తఱి నొక సురేశ్వరు నింట । పుట్టి 'నికుంభుడన్' పుత్రి దొక్కరుడు;
ఇరువది యొకటవ యేట రాజయ్యె; । త్వరలో నిరీశ్వరత్వమును చేపట్టె;
మన్ను మిన్నును వాడు మదినెంచ కీఁడు । దున్నటు లెవరైన నొకమాట యనిన,
పట్టి బంధించి. దెబ్బలు కొట్టి చంపు । నట్లు శాసించె రాజ్యమున నెల్లెడల;
దేవ మందిరములు. దేవాలయములు. దేవని ప్రతిమలు, దేవ పీఠములు
పడగొట్టి, శకలముల్ పాతించె భువిని; । గుడులలో కోనేళ్ల కూడ పూడ్పించె;
పాప పుణ్యాలకు ఫలమున్న దనుట । చేఁటు కను తెప్ప. చెట్టుకు కాళ్ల
కలవను వట్టి వెంగలి పల్కులనుచు । నిల ప్రచారము చేసె నేయడ్డు లేక;

తే॥ ఆ నిరీశ్వరత్వము నాతఁడాంధ్ర రాజ్య । తతికి వ్యాపింప జేయుట తథ్యమనుచు
నాత్మనెంచి, విశ్వామిత్రుఁడరిగె విష్ణు । దర్శనార్థ, మీ యాంధ్రధరణి గావ.

వ॥ విష్ణుమూర్తిని దర్శించి, తాన నెఱుక పరచు కొనుచు: "నేను గాధిరాజ సూనుఁడను నన్న"-

మ॥ అన, వెన్నుండనె: "గాధి రాట్సుతుని గాయత్రీ మహామంత్ర క
ర్తను, సృష్టిన్ బ్రతి సృష్టి చేసిన నవ బ్రహ్మన్, వినున్ నే నెఱుం
గనె? భూమిన్ గల జాతి భేదములు మృగ్యంబై, జనైక్య సా
ధన పెంపొంద నఖండ భారత ధరా స్థైర్యంబు గాంక్షింపవే.

శా॥ "సాకేతేశు త్రిశంకు మాలడనుచున్ స్వర్గ ప్రవేశంబు కా
నీకన్ ద్రోయ నమర్త్య, లీవతనికిన్ నిక్షేపమౌ నూత్నస్వ
ర్లోకంబిచ్చితి; వా నృపాలసుతు కారుణ్యంబునన్ బెండ్లికిన్
చేకొమ్మంటి మతం-గ కన్యల జగ చ్ఛ్రేయోదయా కాంక్షివై.

తే॥ "కరుణ తోడ శునశ్శేపుగాచి, మాన్పి । తి నరబలులను మున్నీవు; జనుల కెల్ల
నమలమగు స్వేచ్ఛ రామ రాజ్యమున గలుగ । చేసితివి సర్వజన హిత శ్రేష్ఠ! నీవు.

వ॥ "ఇట్టి చర్యలకు అజ్ఞానులైన ఛాందసులు నీకు విశ్వమునకు అమిత్రుఁడవని పేరిడి నను లెక్కచేయని ధీరుఁడవు నీవు.

తే॥ "తెలుఁగు విజ్ఞాన సంస్కృతు లిలను పాలు; । శర్కరలు వేద విజ్ఞాన సంస్కృతు; లివి
జత కలిపి వండ నేక సంస్కృతిగ నీవు, । పాయ సంబయ్యె, నా మోద భరితమయ్యె.

వ॥ "ఆంధ్రులు నీ పుత్రుని సంతతి వారే కదా?

శా॥ "నీ విట్లాంధ్ర పితామహుండవయి, మన్నింపంగ నీ పౌత్రులన్,
శ్రీ వాగ్గౌరులు, నేను, ధాత, శివుఁడా శ్రీ సౌఖ్య సంపద్విరా జిం
బేవేళన్ సమకూర్తు మాంధ్రులకు మౌనీంద్రేశ! కాన్పించె నేఁ
డా వై పేనుగనన్, నిరీశ్వరములై యాంధ్రేతర స్థానముల్

తే॥ "ఆంధ్ర రాట్సుత కౌసల్య, యామ్యకోస । లేంద్రు దుహిత నిష్వాకు కులేశుఁడగు ద
శరథునకు పెండ్లి చేయించి, భరత భూమి । నైక్యతకు పునాదులు వైచినట్టి ఘనుఁడ!

చ॥ "తెలుఁగుల కాంధ్రసంతతికి దిట్టపు చుట్టఱికంబు లీగతిన్
గలపి, సమగ్రమౌ భరత కాశ్య పి బట్టితి వేకఛత్రమున్;
కులిశధరుండు నాకమున, గోత్రచయంబున మేరు శైలమున్
గొలువగు రీతి నిల్పితివి కోసలసూతితనూజు గద్దియన్.

వ॥ "అట్టి మహనీయుఁడవు మహాతపస్వివి అయిన నీరాక నాకానందము కలిగించినది.

క॥ "ఊరక రారు మహాత్ములు । కారణమేదియును లేక; కాన, మునీంద్రా!
నీరాక కిపుడు కలిగిన । కారణ మెఱిఁగింపు" మనిన కమలాక్షునకున్

తే॥ "ఉత్త రాజ నాథమును విపత్తు గ్రమ్మెంగె; । అచట రాజాధి రాజయి యఖిల జనుల,
నెల్ల నృపతుల జేసె నిరీశ్వరులుగ । ధూర్తుఁడు 'నికుంభుఁ'డను నొక దుష్టుఁడనుచు

క॥ మునిపతి వివరించె నిటుల । భువి యాగదములను, శక్తి, భూజన భీతిన్;
జనవైరి ద్రుంప, వే మే । దివి జన్మింపు మనె విష్ణుదేవుని దయతోన్.

తే॥ "దుష్టులను సంహారింపగ, కష్టములను । బాపి రక్షణ గూర్పగ ప్రజలకెల్ల;
పుట్టుదును భూమి సంటివి పుణ్యపురుష! । సఫల మొనరింపు మిప్పుడా శపథములను."

వ॥ అనిన విశ్వామిత్రునకు విష్ణుమూర్తి యిట్లనియె:

తే॥ "ఆ కుమతికిచ్చె దీర్ఘాయువబ్జభవుఁడు; । పాపులు చిరాయువులు కదా వసుధ యందు;
కావ, వానిని దుర్నింపుట కాదు; కాని, కొండి కోసిన తేలట్టు లుండ చేతు,

ఆ॥ "ఒక్క గడియ చాలు నన్న మంచిని చెరుప; । వత్సరములు పట్టు బాగు చేయ;
ఉత్త రాజనాథ ముద్ధరించుట కౌను । చాల యేండ్లు మౌనిసార్వభౌమ!

తే॥ "ఆంధ్రసీమల స్వీవాధి యంటకుండ । రక్షణము గూర్తు; నుత్తర రాజ్యచయము
వేగ పునరీశ్వరస్థమై వెలయు కొఱకు । నాంధ్రభువి నిల్తు నాంధ్ర నాయకుఁడ నగుచు.

క॥ "ఇక్కంభువి నేనెవరికి । ఎక్కడ పుట్టంగ వలెనొ ఋషివర! నీవే
చక్కగ యోచించిన, నా । పక్కివి జన్మించి, యణతు పాపి నికుంభున్"

వ॥ అనిన, విశ్వామిత్రుఁడిట్లనియె:

మ॥ "ఆజనాటంబున 'కృష్ణవేణి'యను పుణ్యప్రోదినీ తీరమం
దు జెలంగున్ నగరంబు 'కాకుళ'మనన్; తుల్యంబు యక్షేశ్వరా
ది జనేంద్ర వ్రజ పట్టణా వళులన్ తేజంబునన్ మిన్నయై;
రజనీ కాంతుని బోలి యందమున; విభ్రాంతారి సందోహమై.

తే॥ "నెలకొనిరట 'కా' యను పేరి కులము వారు; । కట్టి తత్పురి బహుళ విఖ్యాతులైరి;
నీలనది చెంత, శంఖాబ్ధి నికట సీమ । లేలి చనిన 'కా' కులము వారీరు నొకట.

తే॥ "అందుచే పురి 'శ్రీకాకుళా'ఖ్య దాల్చె; । ఆంధ్ర రాజ్యములందు నేఁడదియె మిన్న.
అచటి రాజు 'సుచంద్రా'ఖ్యుఁ, 'డాంధ్రమాత' । యను 'కళావతి' రాణి; సజ్జనులు వారు.

తే॥ "ఆ వనిత 'నాసిక' యను పురాధిపు సుత; । జనని పై దర్పి; యౌట, సుచంద్రు రాణి
వందకును వంద పాళ్లాంధ్ర సుందరాంగి; । ఆంధ్రి, గీర్వాణ పాండిత్య మాయె సొమ్ము.

వ॥ "ఆమె తండ్రి 'భద్రుఁడు', తల్లి 'భూరిష',

తే॥ "ఆ 'సుచంద్రుఁడు' నాసుతుఁడైన 'ఆంధ్రు' । సంతతిని బుట్టి ప్రజలు మెచ్చ నిలనేలు;
అతని ముత్తాత శ్రీకాకుళాధిప్రభువని । తనయ బెండ్లాడి, విభుఁడయ్యె తద్వసుధకు.

వ॥ "అట్లు 'విశ్వతేజుఁడు' 'శంఖభేరుని' కుమార్తె యైన 'ఏకావళి'ని వివాహమై 'విశ్వభేరు'ని కనెను.
అతనికి "సుధన్వుఁడు, సుధన్వునకు "సుచంద్రుఁడు" ప్రభవించిరి. అతని భార్య "కళావతి";

తే॥ "వారలకు నీవు పుట్టుము వనజనయన! । "ఉజ్జయిని" రాజధాని ఇంకొక్క తెలుఁగు
రాజ్యమున; కట బుట్టు శ్రీరమణి" యనిన, । యటు లొనర్తు మనిరి విష్ణు వబ్జతనయ.

తే॥ "ఉజ్జయిని వెల్గు వారి పురోత్తమంబు; । దశరథుని నాంధ్ర కన్యను దంపతులుగ

ము లిపుకు తెలుఁగు చెలువ నాంధ్ర । యువకునకు నీయ దలకొంటి వోమునీంద్ర!
సంకల్పమమోఘము । భానురమగు భావి యిలకు ప్రాప్తించుటకై
నీ సద్వివేక యుత మగు । ధీసంపద దారి చూపు దీప గృహంబై"

వ॥ అనీ, విష్ణువు విశ్వామిత్రునకు సెలవిచ్చి యనిపెను.

## ఆంధ్ర విష్ణు జననము, బాల్యము

ఉ॥ అంతట విష్ణుమూర్తి ఉదయాద్రి జనించు దినేశుఁడో, గరు
త్మంతుఁడు గెల్చి తెచ్చిన సుధాపరిపూర్ణ సువర్ణ భాండమో,
సంతతమున్ రమారమణి చక్షుల బింబితమైన రూపమీ
చెంతకు చేరెనోయనెడు చెల్వన బుట్టె కళావతమ్మకున్.

ద్విపద॥ సుదతి విష్ణ్వాఖ్యునా సుతు బ్రసవింప, । ముదముతో లోకాలు మురిసి పోయినవి;
శారద పూర్ణిమా చంద్రోదయాన । వారాశి యెగసి యంబరమంటునట్లు
సుజను లాహ్లాద సంశోభితు లగుచు । విజయ శంఖములూది, విజయ భేరులను
మ్రోయించి, కుంకుళ్ల, మూవ్పిండి, నూనె,-। పాయసంబును, తేనె పంచి రెల్లెడల;
పెట్టి జల్లెడలోన పిల్లవిష్ణువును । చెట్టపట్టాలాడె చెలువల వితతి;
పదునొ కొండవ నాఁడు బారసాలయును । పిదపను పిల్లని పెట్టి డోలికను
ఊపుట, బాలెంత యుదకము చేవ ! నోవ్పుట ఇరువది యొకటిన జరిపి,
మూఁడవ నెల బంచి ముద్ద కుడుములను, । తోడుగ చలిమిడి తోరణాలిచ్చి,
అడుగుల కరినెలఁ, అణిముత్యములు, । గడప దాఁటిన నాఁడు గారెలు పంచి,
పలుకులకు చిలుక ల్పంచి పెట్టించి, । తొలి వెండ్రుకల తీత, తొలి చెవికుట్లు
నక్షరా భ్యాసంబు, నా మీఁద బాల । శిక్ష చే పట్టించి, చిన్నారి చదువు
చదువుట గాంచి యాజనకుఁడు జనని । విదిత మహోత్సాహ వీచికన్ దేల,

ఆ॥ రఘుకులేశుఁడైన రామచంద్రుని బోలె, । వృద్ధి పక్షసోమబింబ మట్లు
కణ్వునాశ్రమమున గ్రాలు భరతు మాడ్కి- । నాంధ్రవిష్ణు వెదిగె నవని మురియ.

సీ॥ మేలిబంగరు నీరు బోలెడు శైశిర–ప్రాభాత బాలాతపంబు వోలె,
బహులతా నోకహ పల్లవసుమయుక్త–సుందరోపారామ శోభవోలె,
అరవిచ్చు తెల్ల తామరపూల యెంరేకు–లొలికించు నవ పరిమళమువోలె,
కపిల గోక్షీరంబు కనక భాండంబున–కాచిన పాలమీఁగడను బోలె,

గీ॥ అవిరు లేబ్రాయమున తల్లి యంకతలము । చేరి, భూతల సామ్రాజ్య సింహ పీఠి
నధివసించిన యట్టు లానంద మంది, । ఆంధ్రవిష్ణువు తన తల్లి నడిగె నిట్లు:

ఉ॥ "ఎట్టుల వచ్చి నాఁడ విటు? ఎచ్చట నుంటివి మున్ను నేను? న
న్నెట్టుల దెచ్చుకొంటి విటు? ఎందుకు ముద్దిడు కొందు వెప్పు? దే
నెట్టుల నీకు నచ్చితి మహిస్థలి నందఱ కంటె? చెప్పు మి

పుట్టువ మాతృదేవి" యను పళ్ళల కిట్లనే నాత్మ పొంగగన్;

సీ॥ "శిశువునై నిద్రించు జీవన ప్రాభాత-మున దల్లి ప్రేమలో బొలిచి తీవు;
బాలనై క్రీడల దేలిన వేళ, నా-ముద్దు బొమ్మల లోన మొనసి తీవు;
యౌవన వాసంత భావనా మకరంద-నిలయ మంజరులలో విలిచి తీవు:
మధురామృత స్వప్న మంజుల శ్రేణిలో- నతిసత్య సుస్వప్నమైతి వీవు;

గీ॥ సత్యవాక్కున, దాన హస్తంబు నందు, । జాలి గుండెను, నాశ్రిత శరణ మందు,
నీ వ్రతము నందు, నాత్మలో, హృదయ మందు, । నుంటి చెప్పుడు కోర్కుల పంట వగుచు,"

తే॥ యనుచు ముద్దాడి యాడి, నెమ్మనము నందు । మొలచి విరిసిన కోర్కి-పూ మొగ్గలెల్ల
దండగా గుచ్చి లేమ, పుత్రకుని భావి । తలపునందూ హారమై సాగ, పలికెనిట్లు;

మ॥ "బలమున్ బుద్ధియు విద్యయున్ బడసి । లబ్ధ ప్రాజ్ఞతన్ ధారుణీ
తల మేలన్ వలెన్ సర్వ సౌఖ్యములచే దన్పన్ వలెన్ బ్రాప్రజన్;
కలికాలోదయ దుష్టధూర్త నృప వర్గంబున్ జయింపన్ వలెన్
చలిమంచున్ బలజాప్తు(డట్లు; గుణభాసా! నీవు ఈడందగన్.

సీ॥ "పూలచెండు నడుమ బొలచుగులాబి పూ-వటు లొప్పు నిన్ను నేనపుడు గాంచి.
వాసంత కోకిలా స్వన సముచ్చయ మట్టు-లలరు నీ వార్త లేనాలకించి,
పాలపాథోరాశి బోలెడు నీయాశో-విమల గాథలమ కర్ణముల గ్రోలి.
కర్పూర మగరును గలపి నీకొసగెడు-క్రమహారతుల సౌగంథ మూని.

గీ॥ ప్రజలొనర్చెడు జయజయ ధ్వనుల నడుమ । విజయ భేరుల మ్రోత సంప్రీతి గూర్చ.
మురియుదును నేటి కంటెను ముందుముందు; । ఆ మహానంద మిమ్మునా కనుగు తనయు:"

తే॥ అని, కుమారు లేనగపు లాతని బవాబు । గా గ్రహించి, సంతస మంది; ఘనుల గణ్యు
లైన గురువుల దెచ్చి, విద్యావితాన । బోధనకు తల్లిదండ్రులు పూను కొనిరి.

తే॥ బలము, సమయస్ఫురణయు, సద్వర్తనంబు, । నీతి, సత్యము, దీక్షయు, నిర్భయంబు,
ఆత్మ విశ్వాసమును, విద్యలన్ని యతని । కలవడగ తల్లి కృషి చేసె ననవరతము.

తే॥ జనకులకు నూపిరాడని పనులు పెక్కు । లుండు గావున, పిల్లల నుద్ధరించి,
వారి సద్భవిష్యత్తుకై బాట దిద్దు । పనిని తల్లులు కూడ చేపట్ట వలయు.

తే॥ అంజనేయుడు నేర్చినట్లర్కునొద్ద. । వన్ని విద్యలు క్రమముగా నభ్యసించి.
సతి కళావతి కొడుకు, సోచంద్రి విష్ణు । బాల్యదశ మీటి యౌవన వంతు(డయ్యె.

ఆంధ్ర విష్ణువి యౌవ రాజ్యాభిషేకము

సీ॥ నేరేడు దీవిలో నింగి నంటెడు మేరు-శైలాభ పృథు ధైర్య సాహసములు,
ఏడు దీవులకును తోడునీడగు వార్ధి-వితతిని బోలు గాంభీర్యపటిమ
పరశురామ, కుమార ఫల్గుణాద్యుత్తము-వీరుల కీడగు విక్రమంబు
మధ్యాహ్న మార్తాండ మండల ద్వాదశ-సమమైన మహిత తేజస్సు కలిగి

గీ॥ తల్లిదండ్రులు, గురువులు, నెల్లజనులు । శత్రుభయము లేదింక రాజ్యమున; కితని
యండ దండలు రక్షించు నఖిల జనుల । ననగ బొగడొందె శ్రీకాకుళాంధ్ర విష్ణు.

ఆ॥ యుక్త వయసు వచ్చె యువరాజుగా జేయ । నితని నని సుచంద్రుడిచ్చగించి,
మేలి మూరుతమున మేళ తాళములతో । యౌవరాజ పీఠ మందు నిలిపె.

తే॥ పారిజాతము నందనవనము నడుమ, । బాల భానుడు ప్రాగ్దిశాంబరము నందు
మఱియు నటు లాంధ్ర విష్ణువు వెలిగెనప్పు । డా సభాలిష్ఠ శీత గోత్రాగ్రి మట్లు

వ॥ ఆ సభ నలంకరించిన కళింగ, సింహ, పుండ్ర, శబర, విదర్భ, నిషధ, భోజ, ప్రతిష్ఠాన, నాసిక, చేది, కరూశ, దక్షిణ కోసల, వత్స, సాల్వ, తూటకవన, మలద, దవిడ (ప్రాండ్య) సింహళ, కేరళ, ఓఢ్ర, ఉష్ట్రకర్ణిక, కిష్కింధ, కొంకణ, కుంతల, వనవాస,ఉజ్జయిని, బ్రాహ్వి, సింధు, మాళవ, ఆవంతి, హయహయాది మిత్ర, సామంత రాజులును, కోయ (గోండు), చెంచు, కొఱవ, ఎఱుకల, యానాది, గదబ, బోయ మొదలగు తెగల ముఖ్యులును మిక్కిలి సంతసమందిరి

తే॥ ఆ సభ నలంకరించిన యతిథులందు । వృద్ధుడుజ్జయినీశుడు; వీరవరుడు
తెలుగు రాజ్యాధిపతి 'బృహత్సేను'డెంచె । అల్లునిగ స్వీకరింపగ నాంధ్ర విష్ణు

తే॥ ధర్మగుణ రూపవతి పుత్రి 'రాజ్యలక్ష్మి'; । బుద్ధి, విద్యా బలంబులు, యుద్ధగరిమ,
అలఘు రూపము గల గుణి ఆంధ్ర విష్ణు । తగుదు రొండొరులని యతడెంచె నెంచె.

చ॥ పిదప సుచంద్రుకున్ దన యభీష్టము దెల్పగ, నామహీశుడున్
ముదమున బుత్రుచిత్రపటమున్ నరపాలున కిచ్చి, కోరె "మీ
సుదుహిత చిత్రమంపు; దది చూచి పరస్పరమున్ వధూవరుల్
హృదయత దెల్పినన్, మన యభీప్సితముల్ ఫలియించు వియ్యమై"

వ॥ అనినంతట నా పటముతో బృహత్సేనుడు తన పురికేగి, కుమార్తెయగు 'రాజ్యలక్ష్మి'తో వివాహ విషయమును ప్రస్తావించి, ఇట్లనియె.

తే॥ "కల దఖండ కృష్ణాతరంగములు జోల । పాడు శ్రీకాకుళంబను పట్నరాజ
మాంధ్ర పాథోధి దాపు; ఆంధ్రజనుల । అతిపురాతన నగరము అందు మిన్న.

తే॥ "ఆ పురాధీశుడను సుచంద్రాఖ్యుడఖిల । దక్షిణావని ప్రభు డాంధ్ర ధరణిరాజు;
అతని సామంతు లాసింహళాది దేశ । పతు, లతని సుతుడాంధ్ర విష్ణుతుల బలుడు

వ॥ "అతని యౌవరాజ పట్టాభిషేకమున కేగి వచ్చితిని.

ఉ॥ "ఆయువకుండు నీకు తగు; నాతనికిన్ తగు దీవటంచు, నే
నాయువరాజు గాంచి, మన మందున పొంగి పటంబు దెచ్చి నా
నోయువతీలలామ! కను; మొప్పగు నేని, భవత్పటంబు నే
నా యువరాజు కొంచు కొఱకంపెద తక్షణ" మంచు బల్కినన్.

క॥ ఆ రాజ్యలక్ష్మి విని, యనె: "ఆ రాజ వరేణ్యు గొప్ప లర్థంబయ్యెన్;
ఔరసు చందము ను దెలిసె; వారల పూర్వంబు దెలుప బ్రార్థింతు మిమున్"

పూర్వోదంతము

౫౪ అవిన, బృహత్స్వన । డిల్లః యె: "వారును మనవలెనే తెలుఁగు వారే. ఉభయుల పూర్వ మొక్కటే ఇలావృత వర్షము నుండి హరి, కింపురుష వర్షములకు వచ్చి, అచ్చటి 'లింగవాన్' దేశమున, ఉభయుల పూర్వులును చాల కాలము నివసించి, పిదప 'తెలుంగము'ని నాయకత్వము న నేపాళ దేశమును చేరి క్రమముగా భారత భూమి యందు వ్యాపించితిమి. సూర్యచంద్రాది వంశముల రాజులు తెలుఁగు వారే వారిలో 'ఋషభుఁడు' అను రాజునకు 'జయంతి' అను రాణి యందు 'భరతుఁడు' జన్మించి, 'పంచజని' ని వివాహమై పశ్చిమమున 'కుమేరు' గిరి, 'నీల' నదీ ప్రాంతము, 'శంఖాబ్ధి' తీరముల నుండి (శాంత మహా సముద్రము అను) ప్రాగ్మహా సముద్రము నందలి పరివర ద్వీపముల ఆవలి వఱకును, ఉత్తరమున 'కైలాసాద్రి'ని అధిగమించి శ్యామ, కశ్యప సముద్రముల ప్రాంతము వఱకును, దక్షిణమున కశ్యప మహా సముద్రము అను నామాంతరముగల దక్షిణ మహా సముద్రము నందలి అన్ని ద్వీపములను గలపియు, ఏక రాజ్యముగా నేలెను. హిమాలయముల ఆవలినుండి, కన్యాకుమారి, సింహళముల ఆవలి వఱకును గల భూమికి 'అజనాభము' అని పేరు. సామంతుల ద్వారా కాక, తానే స్వయముగా పాలించిన భూమికి ఆభరతుని కారణమున 'భరత ఖండము' అను పేరు కలిగెను. భరత ఖండము లోని భాగములైన 'ఇలావర్తము', 'ఆర్యావర్తము', 'బ్రహ్మవర్తము', 'మలయము', 'భద్రము', 'విదర్భము' అను దేశములను భరతుని సోదరులు అతని ప్రతినిధులుగా పరిపాలించిరి. మన తెలుఁగు వారికి పూర్వమే నీల నదీ తీరము నుండి వచ్చిన మన తెలుఁగు వారి పూర్వుల సోదరుల సంతతి వారు "బ్రాహ్వి", "సింధు" మొదలగు మన దేశముల మీదుగా దక్షిణ భారత దేశమును చేరుకొనిరి. దక్షిణ భారత భూమి పూర్వము దండ కారణ్యమయమై యుండెను అందు కొన్ని తెగల జనులు నివసించు చుండిరి. తెలుఁగు వారును వలస లేర్పరచు కొనిరి, ఇట్టి స్థితిలో తెలుఁగు వాఁడైన విశ్వామిత్రుఁడు తన కుమారులను పంపి, ఆ తెగల వారికిని, వలసలు గొన్న తెలుఁగు వారికిని వేద సంస్కృతితో మిశ్రమైన తెలుఁగు సంస్కృతిని బోధింప జేసెను విశ్వామిత్రుని సంతతి వారే ఆంధ్రులు. ఆ తెలుఁగు సంస్కృతిని స్వీకరించిన వారందఱును ఆంధ్రులలో గలసిపోయిరి. ఆ సుచందుృఁడు విశ్వామిత్రుని జ్యేష్ఠ కుమారుఁడైన 'అంధ్రు'ని సంతతి వాఁడు

ఉత్తర అజనాభపు తెలుఁగు వారు ఆంధ్రులను, ఆంధ్రులు ఉత్తర అజనాభపు తెలుఁగు వారిని కొంత కాలము వెలివైచిరి విశ్వామిత్రుని పట్టుదల వలన, ఆవెలి తొలఁగి పోయి, ఉభయులు ఏకమైరి.

"తూర్పు మధ్య దండ కారణ్య ప్రాంతములలో విశ్వామిత్రుని కుమారుల వలె మన ఈ పశ్చిమ ప్రాంతమున, జమదగ్ని, పరశురాముఁడు వేద మిశ్రమైన తెలుఁగు సంస్కృతిని వ్యాపింప జేసిరి. పూర్వపు తెలుఁగు సంస్కృతి వేద సంస్కృతితో గలసి 'మిశ్ర సంస్కృతి ఏర్పడినది.

* ఆర్యా వర్తము—North India, బ్రహ్మ వర్తము—Burma, మలయము—Malaya, Singapore, Indonesia, Brunei,

ఇదియే నేటి తెలుగు సంస్కృతి మనమును, సుచంద్రాదులైన దక్షిణ భారత దేశ వాసులును దీనినే అనుసరించు చున్నాము. పూర్వనివాసుల ఆచార సాంప్రదాయములలో కొన్నిటిని కూడ మన మందఱమును గ్రహించి అను సరించు చున్నాము. ఆ సుచంద్రుని రాజధానిని గుఱించి చెప్పెదను వినుము.

## శ్రీకాకుళము

సీ॥ ఒకదాని ప్రక్క నింకొకటిగా నరదంబు-లైదు సాగు విశాలమైన వీధు;
లంతకు మూఁడింతలై, మహాపగలట్లు-రంజిల్లు చక్కని రాజపథము;
లా పజ్జల బహుజనానీక యుతము లౌ-వర్తక వ్యాపార భవన చయము;
ధాన్యాది వస్తు వితానముల్ పురికి పు-ష్కలముగా గూర్చు నగారవితతి;
గీ॥ అళిగణము కూర్చు మధుకోశ మట్టులలరు । న్యాయసభ, కచేరులు, సచివాలయంబు
ముచ్చటగ నొప్పు భవన సముచ్చయంబు । కలిగి, పురి పొల్చు కెరటాల కదలి పోలె,
తే॥ స్నానఘట్టములును, పురోద్యానవనము, । లశ్వ, గజ, రథ, శాలలు, నన్నశాల,
మనుజపతి సౌధ, మేకాంత మందిరంబు । పరగు కృష్ణ యొడ్డున నేత్రపర్వమగుచు,
తే॥ ఇటుకలను దెచ్చి, యతికించి ఇసుక సున్న । ముల ఁ కలిపి నూఱిన ముద్ద తోడ,
కట్టిరిండ్లను, మేడల కట్టడములు, । వెన్నెలల శోభ మించెడు వెల్ల పూసి,
తే॥ అమరిచిరి కళుకసులు, నూతు లన్నియిండ్ల; । నూరి యందెల్లెడ మురికి నీరు తొలగి
యింపుగా నుండగై కాల్వ లేర్పరచిరి । తనదు నలకాపురం బనన్ దనరు మాడ్కి.
తే॥ ఐదు యోజనముల దూర మన్ని దిశల । కర్ణముల మ్రోయు రవముతో గంటసాల;
వైరి దుర్భేద్యమగు కోట, పదియు నూఱు । బురుజులను, చుట్టు కందకంబును నెసంగు.
తే॥ నేలలోపలి కుండ గొట్టాల గుండ । మంచినీర మొప్పుగు ప్రవహించు చుందు
బావులన్నిటి లోనికి: ప్రజలు తమకు । కొల్లగా నిట్టి భాగ్యముల్ కూర్చు కొనిరి.
తే॥ అఖిల సాగర గాముతౌ నాంధ్ర నౌక । లాగు రేవును, విశ్రాంతి నందు క్రయ్య;
కదలి యోడలు నిర్మించు నెడము; సరకు । లుంచు గిడ్డంగులు చెలంగు నౌకచోట.
వ॥ ఆంధ్రుల వర్తకపు టోడలు జగత్ప్రఖ్యాతి చెందినవి. అవి
సీ॥ నీలాఖ్య వాహినీ నికట సీమల నుండి,-'శుభ్రతేజో' తట 'సుమెరు' నుండి,
పారశీకము నుండి, "బ్రాహ్వి" దేశము నుండి,-సింధునదీతీర సీమ నుండి,
సింహళం బందుండి, శ్రీ "షాంగు" ధుని నుండి,-ఆగ్నేయ లంకా సహస్రి నుండి,
ప్రాగ్మహాపాథోధి ప్రాగ్తీర జృంభిత-"మయ" రాజ్య భూభాగచయము నుండి,
గీ॥ "ఆంధ్ర మణు" లను లంకల యందు నుండి, । మలయ, కాంభోజ, రవిజ మండలల నుండి,
వర్తకపు టోడలచటకు వచ్చి నిలుచు । దేవతా పూజ చేసిన పూవులట్టు.
తే॥ కదలి యోడలు కృష్ణలో కదలు కొఱకు । అన్ని ఋతువుల యందును మన్ను త్రవ్వి
గట్లపై పోయు తత్ప్రవాహగముల తీరు । అందఱకు గొల్పు కొండంత యక్కజంబు.

పశువులను, మేకలను పాకు వల్లవ పురి, । పెక్కు నగిషీలు చిత్రించి విధ విధంపు
కుంభముల్ చేయు కుమ్మరి గూడె యొకటి । కాంస్య, లోహాది విగ్రహా కారు లిండ్లు,
వల్లె పల్లియ, కమ్మరి వారి పేట, । సైనికుల శిబిరులును ముచ్చటలు గొలుపు.
గణసభా మందిరము, వేదికలును పొరు । తెల్ల గుమికూడు నుస్థల తల్లజములు.
రాట్నములు త్రిప్పి, సన్నదారములు వడకి । కనుల కింపు గూర్చు హృదయా కర్షణీయ
వస్త్రములు మగ్గములనేసి, వానిపైన । చేతు కద్దక మాపురి నేత గాండ్రు.
నేటి రాజు సుచంద్రుడు మేటి మగడు । దక్షిణా దీశుడతుల దుర్దాంత సైన్య
సంపదయు, జయ సాధన శక్తి యుక్తు ! లతరు మను; దట్టి వాడె తదాత్మ జుండు.
పటము చూడుము; యోచించి పలుకు మమ్మ । నీ యభీష్టము; తొందర చేయ నమ్మ;
పది దినంబులు పట్టు నీ పటము గీయ; ముజ్జగమ్ముల నింతలో మునుగ వమ్మ.

## ఆంధ్రవిష్ణు వివాహము

అనిన, నా కన్నె దీర్ఘయోచన లొనర్చి, । మనము పెండిలి కొప్పు కొమ్మని వచింప,
విశదముగ జూచి పటమును వేయి సార్లు । అంకితము చేసె హృదయ మా ఆంధ్ర సుతుకు,
తెలిపెన్ దల్లికి తండ్రికిన్ తన మనోభీష్టంబు నా కన్య, సి
గ్గుల దొంతుల్ మొగమందు, బుగ్గలను విగ్గుల్ తేల, నొయ్యారముల్
చిలుకన్ మైలత, నెచ్చెలుల్ జననియున్ చిన్నారి నవ్వుల్ నగన్,
పలుకన్ పంజర కీరముల్ మరల నావామూ వచః పుంజముల్.
అంపె నరేంద్రుడంతట విజాత్మజ చిత్ర పటంబు దూతచే;
సొంపులు నింపు నాయువతి సోయగమున్ గని చిత్రమందు, వ
ర్ణింపగ లేని యందములు నీరజలోచన నాశ్రయించె నం
చెంపిక చేసె నాంధ్రసుతుడింతిని భార్యగ; మెచ్చ నెల్లరున్.
ఆ కబురు సుచంద్రుడు బృహత్సేనున కంపి సుముహూర్తము నిర్ణయింప నర్థించెను. అంతట
నాంధ్ర విష్ణువును రాజ్యలక్ష్మియు
పటములు చూచి యిర్వురును బంధుర మోహనికాస వృత్తులై,
తృటి యుగ మౌచు నుత్సుకత తీవ్రతరంబయి హెచ్చు చుండగన్,
గుటకలు మ్రింగ సాగి, తమ కూటమి రేలిపె వచ్చు నంచు, పెన్
దిటవున వేచి చూపికను దేవనియుక్త ముహూర్త వేళకున్.
ధ్రువనమీపాంభోధి తొణికిన లాడెడు-మంచు కొండల బోలు మదపు టేన్గు,
బద యార్కు తేరి యశ్వోత్తమూళములైన-యవన కాంభోజాది హయగణంబు,
అఖిల వార్ధుల రాజహంసలై పయనించు-ఆంధ్ర నౌకలబోలు నరదములును,
కదలింప జెలరేగు కందుకీగల మాదిృ-వైరుల దండించు భటచయంబు,
బంధు మిత్రాసప్తయుత పరివార జనము । లంటిరా, ససామంత భార్యా సుతుడయి

తంటె స్వజ్జయినికి సుచంద్ర ధరణీశుఁ । డాత్మజుని పెండ్లికిన్ దారకాళి వోలె.

వ॥ త్రోవలో మఱికొందఱు సామంత రాజులు వారితో గలసిరి.

సీ॥ పెండ్లి వారల పైన వృక్షాళి పర్ణముల్-చిలికె సంతత శుభా శీస్సులట్లు;
పరిపక్వ తింత్రిణీ ఫలములు వ్రేలాడె-స్వాగతా లంకార పంక్తులట్లు;
ఉసిరిక పెనుగుత్తు లుర్వీ రుహమ్ముల-గ్రాలె విద్యుద్దీప కళిక లట్లు;
వన్య భూరుహ రాజి నయనమ్ములకు దోఁచె-దారులు తీర్చిన భటుల యట్లు;

గీ॥ అడుగడుగునకు తమకు నాహ్లాద మొసఁగ । నలరి వియ్యంకుఁడిల నిట్లు మలచినట్లు
చిత్త సీమల దోఁచె నా శిశిర వేళ । ఆంధ్రవిష్ణుని కల్యాణ యాత్రికులకు,

వ॥ ఇట్లు ఉజ్జయిని పొలిమేరలకు వారు చేరు సరికి

చ॥ ఎదురరుదెంచి ఉజ్జయిని నేలు మహీశుఁడు స్వాగతాంజలుల్
గదురగ, వారలన్ నిడిది కల్పన చేసిన చోట్ల డించి, సం
పదమెయి గూర్చె నెల్ల సదుపాయము లందఱు తృప్తినంద, న
భ్యుదయ సమీపవేళ నెద పొంగగ శ్రావణ కృష్ణ కైవడిన్.

తే॥ స్త్రీలు తేలిరి సంతోష సింధుతతుల । వంతు లేని కార్యక్రమ మర్థిబూని,
ఆత్మలందు వధూవరు లందు చున్న । సురుచి రానంద శోభన జ్యోత్స్న మించి.

సీ॥ మేలు కొల్పులు పాడి మేల్కొన బెట్టిరి-తగ పెండ్లి వారివి మఱు దినంబు;
మొగములు కడిగించి, ముంగురుల్ దువ్వించి,-స్నానంబు లాడించి సతుల నెల్ల,
పసుపు చీరలు కట్టి, ఫలహారములు పెట్టి,-పిలిచిరి పెండ్లికి పెట్టి బొట్లు;
ఆరేయి తెల్లని చీరలు ధరియించి-తెలిపూలు తలలపై తీర్చి దిద్ది,

గీ॥ స్వచ్ఛతను దెల్పు తెల్లని వంటకముల । విందు లారగించిరి రెండు పెండ్లి జట్లు
కలసి మెలసి. యానందము గగనమంట, । వెన్నెలలు చిక్కనై భువి వెల్లి విరియ

తే॥ అతివ లిట్టి విభిన్న కార్యముల దనియ. । బాల బాలికలు స్వాహావార్థిదేల,
ముచ్చటల మధ్య ముమ్మళ్ల వేసె వరుఁడు; । సాంప్రదాయాను సారము జరిగె పెండ్లి.

తే॥ దోసిళుల నింపి ముత్తె గోధుమలు, పోసి । కొనిరి తలఁబ్రాలు; దీవనల్ గొధుమాక్ష
తాయుతంబుగ పొందిరి, తనిరు బోండ్లు । పట్ట మంగళ హారతుల్, వరుఁడు వధువు.

తే॥ భద్రదంతా వళము మీఁది పల్లకిని వ । ధూవరులు పురమేగిరి తూర్య మంగ
ళ స్వనములు, తేరులు, నొంటెలగము, లశ్వ । దంతి, పరివారములు వెంట తరలి నడువ.

చ॥ పురజను లిచ్చుదీవన లపూర్వ జయధ్వను లందు కొంచు, న
వ్వుత గృహవాటులన్ గలుగు పూరుషు, లింతులు, బాల బాలికల్
సురుచిర సుందరాంగులయి శోభలు గూర్పగ నూరి; కా వధూ
వరయుగళంబు సాగె జనవాహిని కంజలు లంద జేయు చున్.

సీ॥ నక్షత్రమాలికా నాట్య వేదిక లందు-కాపురంబులు చేయు గోపురములు,

చిక్కు-పీనుల జక్కి- నొక్క-మూలకుఁద్రోసి-దర్పించు గోదల ధవళ కాంతి,
మును హరిశ్చంద్రుచే ముని కౌశికుఁడు గొన్న-ధనము మున్నతి మించు ద్వారములును,
పాల వార్ధిని బోలి చాల విస్తీర్ణమై-రంజిల్లు నాయూరి రాజ సభయు,
ఆవట చట నిర్మలోదక రుచిర పుష్క--రిణులు, పణ్య వీధులు, గుడుల్, గణిక లిండ్లు,
నందనోద్యాన వన సీమ నంద మందు । బోయి పరిమళ సువిశాల పురవనంబు,
ఆపురి సౌధ పంక్తులును, నాపురి యున్నత తోరణంబులున్,
ఆపురి పౌర వేదికలు, ఆపురి రత్న మరీచి వీచి కో
ద్దీపిత మందిరంబు, లట తేలెడు కేతన పాళి, కోటయున్,
చూపుల కిందు శోభవలె సొంపులు గూరిచె నాదినంబునన్.
ఆ మఱునటి దినమున
వనితలు, బాల బాలికలు వారితులై, శిశిరాంత హోళికా
దినమున వేడుకల్ తవిచి తీర ఘటించిరి పెండ్లి యింట; రే
యిని,బవలున్ వసంతముల నెల్లరు నాడిరి; శోణ చూర్ణముల్
తనువుల జల్లుకొంచు సరదాలను దేలిరి సంతసంబునన్.
వధువు కుచ బంధనపుముడి వరుఁడు బోటన । చిటుకన వ్రేళ్లతో విప్పు నటుల కోరి,
పిండిరాచి యాముడి కది బిగియునట్టు. । లు ల్లసించి రాయునకుని యుక్తి మెచ్చి.
ఉత్తరోదధి దాపున సుదయ మంది. । వింపుకొని తెల్గు సంస్కృతిన్ పెంపుగాంచి
నట్టి వేద విధానము ననుసరించి । చక్కగా వేడుకల తోడ జరిగె పెండ్లి
మూఁడు శోభన రాత్రులు ముచ్చటగను । వరుఁడు వధువును నంతః పుత వనము నందు
నవటి సౌధాంత రోజ్వల రుచిర తల్ప । మందు పొందిరి సముచితానంద మెలమి
కొట్టి తాంబూలములు వేడ్క-లట్టి పడగ, । వీడుకోలియగా నాఁడు పెండ్లి వారు
బయలు దేరిరి మగ పెండ్లి వార లెల్ల ! వధువు తోడ శ్రీకాకుళ పట్నమునకు.

శిశిరాంతము

తరుణ రసాలముల్ విరియగాతు మంటచు-కనరులు, పిందెలు కప్పు కొనియె;
వేపమూర్తులు విండె వేల పూవుల తోడ-నక్షత్రతారలు చెట్ల నంటి నట్లు;
బహు వల్లవములతో పచ్చ కోకలు కట్టి-శివు గొల్వ మారేళ్లు సిద్ధమయ్యె;
ఉడిగిన షూత క్రొంబొడవు తప్పకదంచు-మగిడి నిరీక్షించె మల్లె పొదలు;
ఆకులను రాల్చి నగ్నము లైన చెట్లు, క్రొంజివురు తొడిగెను కోరి క్రొత్త సిరులు;
నవ వసంతోదయమునకై యవని తవ్వి । అర్థిమై వేచె నా శిశిరాంత వేళ.
రాలిన పండు టాకులు ధరాస్థలి గప్పె తివాసి పోలికన్;
పూఁను గాన లేక కడుపుల్ కడు స్రుక్కిన భృంగ మండలుల్
వ్రాలెను సుందరీ వదన పద్మ సుమంబుల; వాత తల్పినన్,

గ్రోలు దుమంచు వేగె మద కుంజర దానజల స్రవంతులన్.

తే॥ అట్టి ఫాల్గుణంబున సుచంద్రాదు లెల్ల । పయన మొనరించి చేరిరి త్వరితగతిని
క్రమముగా తమ పురము శ్రీకాకుళమ్ము । కడపి వధువును 'నిషధ' నగాది నాథు.

తే॥ అట, వణని వంశ్యరాంధ్రరా 'జగ్ని జిత్తు' । డిడిన నాటి ఉగాది పచ్చడుల తోడి
రుచికర సగౌర వాతిథ్య ముచితభంగి । నంది, సంప్రీత చిత్తు లై రతిధు లెల్ల.

## వసంత ఋతువు

చ॥ అవనిపురంధ్రి పొల్పరె శుకాంగన పోలిక, గుల్మ వల్లికా
ద్యవని రుహంబులన్ గిసలయంబులు, నాకులు, కాయ గుత్తులున్
నవనవలాడుచున్ జెలఁగ. నాఁడు బృహాదరిదంగ రాగమై;
వివిధ వనాంతరంబులను వ్రేలు ఫలోద్ధతి చిల్క ముక్కఁగన్.

సీ॥ తీఁగలవ్, తరుజను, తీయవై, దోరవై-కెరలు పండ్లను మెక్కు కీరచయము,
తావులు వెదజల్లు పూవులపై వ్రాలి-మకరందములు దోఁచు మధుకరములు,
లలిత చూతాది పల్లవ సక్త కంఠమై-యింపుగా పాడు కోయిలల పిండ్లు,
ప్రకృతి చిత్రరచనా ప్రావీణ్య ముకురమై-చెలఁగు సీతాకోకచిలుక గణము,

గీ॥ గోరువంకలు, తూనిఁగల్, గొల్లభామ । లెల్ల హృత్కోశముల నిండు చెలిమి నింప.
నెసఁగె వసుధాతలము పెండ్లి యిల్లు వోలె । చాల సందడితో నా వసంత వేళ.

సీ॥ అంబుజాకర చలత్ శంబర వీచికా-హయ వాహనములైన హంసతతులు,
ఆ వీచికల తోడ సావధానంబుగా-దోబూచులాడెడు తోయజములు,
కొలమల గట్లపై ఎలనీటి బొండముల్-చెలఁగెడు కొబ్బరి చెట్ల చాళ్లు,
పచ్చని చెట్లతో పరిమళ బహువర్ణ-పుష్పసహస్రమై పొలుచు తోఁట,

గీ॥ అమల కృష్ణాధునీ ప్రవాహంబు వెంత । చిక్కగా నేపెదిగిన పచ్చికబయళ్లు,
వసుల కోలాటమాడెడు బాలికలును । గలిగి రంజిల్లె నపుడు శ్రీకాకుళంబు.

## సూర్యాస్తమయము

తే॥ అట్టి వాసంత ష దిన సాయాహ్న వేళ । పగలు పగలెల్ల పయనించి, మిగుల డస్సి
గుఱ్ఱములు, చోదకుఁడు, తాను,కొనకు చేరె । నర్క బింబము పశ్చిమా కాంబరమున.

వ॥ తిమిర మహాసురావళుల దేహము లందలి రక్త వాహినీ
భ్రమణము హేతువై యెఱుపు వారిన సూర్యుని తేరి చక్రపుం
గమన కతంబునన్ బడిన గాడులు నిల్చెను సాంధ్య రేఖలై
యమర పథంబునన్ సుర నరావళు లర్ఘ్యము లిచ్చు వేళకున్.

ఉ॥ దవ్వులకేగి అస్తగిరి దాఁట నినుండు శిరీష గుచ్ఛమై,
యవ్వెరి చాయ లంబర దిశాంతములన్ బ్రవహించె నేరులై ;
గువ్వలు, పావురంబులును గూండ్లకు జేరెను; పద్మ సంఘముల్

నెవ్వగ మాతులన్ ముడిచె, సీరసమై పెటుగంత లించుచోన్.

చంద్రోదయము - వసంత - యామిని

చ॥ అగణిత తారకా స్థగిత హారములన్ గళసీమ దాల్చి, మౌ
విగణము లంగుళీయక మణివ్రజమై శిరమందు దూర్చ, సో
యగమగు చంద్రికావసన మంగ విసీలిమ కింపు నింపగా,
గగనపురంధ్రి ఫాలతిలకంబుగ దిద్దె కళాంక రేఖికన్.

ఉ॥ కమ్మరిసారె పోలె పరుగుల్ తిరుగీ యిలగుంబునన్, తొగల్
క్రిమ్మగ నంజవేయ, ముదికప్పురపుం పొడి జల్లి పట్లుగా
కమ్మని వెన్నెలల్ విలిచి కాచెను, తెమ్మెరలాని తెచ్చు రే
దమ్ముల తాపి నించుకొని, తాఁకుచు జాబిలి మింటి వెల్లువల్.

మ॥ నవవాసంత మనోజ్ఞ శర్వరులు సంధ్యారాగమున్ గప్పు చో
శ్రవణానందము గొల్పె కీర పిక హంస ధ్వాన మాధుర్యముల్;
ధవళంబయ్యె సుధాపయోధి పగిదిన్ ధాత్రీతలం బెల్ల, నైం
దవ దివ్యాతప రోచి పూరము దిగంతవ్యాప్తమై నిండగన్.

తే॥ పాలమున్నీరు వెల్లువై పాఱినట్లు । చందురుని పండు వెన్నెల చందమొప్పె;
జాలమీలట్లు, రాయంచ బాసలట్లు । మూఁడుకాలకు దోఁచె వింగిపై చుక్కగములు.

చ॥ కొలనుల నీటి యంచులను క్రొవ్విరి తేమ లనేకవర్ణపున్
వలువల ముగ్గులట్లు తమ వంకకు లాగెను పీతకేతకుల్;
జలముల గాంచి స్వీయ తనుసంపద లభ్రము మాటి మాటికిన్
బులకి తమయ్యె ప్రప్రథమ భోగముహూర్తపు కన్నె బాద్రువన్.

ఉ॥ పంచమి చందమామ ప్రియకామిని రోహిణి గూడి వచ్చిమా
కాంచన శైల భూమి మఱుగై చన, పూచిన పారిజాత వృ
క్షాంచిత శోభ దాల్చెను విహాయస; ముజ్వల తార కాద్యుతుల్
మించెను తొంటి కుఱ్ఱలను మిన్నులు చీకటి చీర కట్టగన్.

ఉ॥ రాగవిభాసితుల్ కుసుమ రంజిత శాఖి, లతా, నికుంజ పై
భోగ సమున్నతిన్ జెలఁగె, పుష్ప పరీమళ సక్త భృంగ కం
ఠాగత నిస్వన ప్రణవమై: సిత, శోణ, వినీల వారిజ
త్యాగ సుగంధ భాగ్య మయతన్ విహరించెను గంధవాహముల్.

ఉ॥ సోగలు చిక్కు రేలు, మనసుల్ జత గూడిన వేళ. దంపతుల్
దాఁగు ప్రసూన హర్మ్యముల, తత్పురచంపకకుడ్మ లాళ రా
మాగణ నాసి కోల్లలిత మారుతముల్ ప్రియసంగ కూలతమై
వ్రేఁగయి, మందమందముగ వీచె నిగూఢ వనాంతరంబులన్.

ఉ॥ అంచలు, క్రౌంచముల్ బదలి, యబ్జవనాంబుగ విద్ర దూఁగె; వి
శృంచల మయ్యె చీఁకటుల చాటున చాతక చంచ రీకముల్;
సంచలనంబు దక్కి జన జాలము మైమఱచెన్; క్రమంబువన్
మంచు వరాగమై కురిసి, మబ్బువలెన్ తెరకట్టె వించుకన్.

ఉ॥ కొల్లగ మేలి వాసనలు గుప్పు గులాబులు, జాజి, సంపెగల్,
మొల్లలు, మల్లెలన్, కలువ పూలు, ధరించెను మంచు ముత్యముల్;
నల్లలి, తాషిరంజక, వసంత వనాంత లతాంత వీధులన్
జల్లగ వీచె మెల్లగ ప్రశాంత నిశాంత కిశోర వాయువుల్.

ప్రభాతము—సూర్యోదయము

శా॥ ప్రాభాతారుణరాగ రేఖల నభో భాగంబునన్ విల్వ, సం
ధ్యాహామా మణి యంగుళీలతలు విన్యాసంబు గావించె; న
ర్వీభాగంబున మత్తుజల్లు కురియన్ వీచెన్ పరాగంబులన్
ప్రాభాతోన్ము ఖయామ వాతము సుమారామాసనాసీనమై.

సీ॥ వేకువజామున విద్యుక్తముగ గూసె-'కొక్కొ-రోకో' యని కోడి పుంజు;
గంటసాలను బుట్టి ఘంటా రవంబులు-నిత్య చర్యకు పురిన్ నిదుర లేపె;
కాల్యముల్ వేదీర్చి, కార్మికుల్ కుడిచిరి-పాతావకాయ, తర్వాణి బువ్వ;
అంతట తమ పనులందు నిమగ్నులై-రా దర్శమూర్తులై యవని కెల్ల;

గీ॥ బ్రాహ్మణుల యిండ్లనుండి సుశ్రావ్యమగుచు । వెలువడగజొచ్చె నంతట వేదఘోష;
ప్రజలు తమతమ పనుల నుపక్రమింప । నూరు శబ్దింప మొదలిడె నుదధి వోలె.

చ॥ ఉదయ మహాద్రి గర్భమున నుద్భవ మంది గరుత్మణి క్రియన్,
చదలున జాతి వజ్రమయి సాగె నినుండు; జలాశయంబులం
దెదిగిన పద్మముల్ సహజహేల ధరించె ప్రఫుల్ల వక్త్రులై
హృదయమునన్ జరింప నవ హృద్యపరాగ సుగంధ మాధురుల్.

మ॥ కమలా కోమల లోచనాలక లసత్కాదంబినీ శ్యామలాం
గము, లంభోజపరాగ శోభిత గరుత్కంఠాస్య వక్షోంఘ్రి శీ
ర్షము, లుద్యన్మధు పూర్ణ వక్త్రికలశ ప్రాదుర్భవ త్స్వేన సి
క్త మనోజ్ఞావర భృంగముల్ పలుచె వేగన్ కోశముల్ వింపగన్.

మ॥ గళనీలంబులు బర్హులాడెను వియ త్కాంతుండు కొల్వున్ననాఁ
డలినీలాలకలైన యచ్చరలు నాట్యం బాడునట్లు ద్ధతిన్;
కలహంసావళులాట లాడుకొని యెన్ కాసార నీరంబులన్;
పలుకాకుంతరుతంబు లొప్పెనగె నా ప్రాభాత కాలంబునన్.

వ॥ ఆ పగలంతయు విందులతో, నూత్న దంపతులకు పలువురిచ్చు నాశీస్సులతో గడచెను.

**ఆరామకేళి**

చ॥ కలదట నూత్న దంపతులు కాపురముంటకు దిద్దినట్టి సౌం
ధౌలకు భవంతి, పుష్పవన యుక్తము, పూపొదరిండ్ల తోడ, చెం
గలువ కొలంకు తోడ, శశికాంత శిలాయుతమై; దినంబునన్
విలసిలు వేయి కండ్లుగల వేలుపు తోఁటను గేలిచేయుచున్.

తే॥ అందమై పొల్చె నా రాత్రి నవ్వనంబు । మింట భాసింప వలతేని మేనమామ,
కలువల సఖుండు, వేల చుక్కలకు రాజు. । చలువదొర, రేయి మన్నీడు, చందమామ.

చ॥ ధవళ శశాంక చంద్రికల ద్రావి చెలంగెడు పుల్గుగుంపులున్,
కువలయ పుష్ప మాధురులు గ్రోలి చరించెడు చంచరీకముల్
నవసుమగంధ మాని పయనం బొనరించు సమీర వీచికా
నివహములున్ హృదబ్జములు నింపె ప్రమోద సుధా ప్రవాహముల్.

క॥ నూతన దంపతు లిద్దఱు । నే తెంచిరి హర్షమున శచీంద్రుల భంగిన్
పూతోఁట లోవి; కంతట నాతండనె వధువు తోడ నతిమధురముగన్:

ఉ॥ నీ ముఖ నీరజమ్మున కనీనికలై న విలోల చంచరీ
కామృత దృగ్మరీచి నిధులందు నపూర్ణత గోచరించె; హృ
ద్ధామ సమగ్రతన్ గొఱత తట్టిన తీరులు గానపయ్యె; నో
భామిని! నీ మదిన్ మెలఁగు వాంఛితముల్ వెలిబుచ్చ నేర్తువే?

తే॥ పయన మొనరించి కాకుళ పట్టణమును । వచ్చునెడ, కొంత మన కెడబాటు కలిగె
నన్ను లోటిక తీరెనో సన్ను తాంగి: । శశికి గ్రహణము తొలఁగిన చాపు తోఁప

తే॥ మున్ను పరిణయకాల మందున్న యట్టు । లదలు: వీ ముఖానల కమలాకరమున
జెలఁగె నేమిటి కీచిన్ని సిగ్గుటలలు? । కాంత: మనకిది నవ సమాగమము కాదు.

తే॥ అనుచు నాంలిగన మొనర్చి యాతఁడనియె: । మూఁడు రేఱజయినిపురి ముచ్చటగను
ఇపపురము కడపితిమి కద యిచ్చ మీఱ? । రమణి! మఱచితె నాఁటి యారామ కేళి?

ఉ॥ శ్రీరామామణి పాదకంజయుగ సంసేవార్థమై నీవు నే
యారామాంతర పుష్ప సంఘము లమం దానందమున్ గూర్చె, నా
యారామంబున జూచితిన్ శశి సమీక్షా సక్తవై యుండి, నే
జేరన్ వచ్చుట గాంచి. హాసముఖివై చెన్నొందుటన్, దవ్వులన్.

ఆ॥ వెన్నకుండ జూచి, వెనుక ముందులు చూచి, । వెన్న నారగించు విష్ణు భంగి
నన్ను దరియ నెంచి, నటన చేయఁగ నెంచి, । మెఱపు తీఁగ వోలె మెలఁగి తపుదు

ఉ॥ చల్లని తెల్ల వెన్నెలల నందున మావి చివుళ్ల నీడలో
నల్లన దాఁగి, క్రేగనుల నాతసియున్ దలపంచి, వాసనల్
జల్లెడు మల్లె తీవియల చాటున కేగుచు, సిగ్గునవ్వులన్

జల్లిన దొంగ వీవు; విమనంబును విన్విడువంగ వచ్చునే.

ఉ॥ దాఁగిలి మూఁతలాట లిటు ధాత్రిరుహావళి నీడ నాడి, ప్రే
మాగత సంభ్రమోచ్చలితమైన తనూలత మేన వ్రాల్చి, యా
వేగము తోడ నాహృదయ వీధి మెలంగిన రాగవీచికన్
దోఁగిన మొద్దుకన్గవల తొయ్యలి! యీ నునుసిగ్గు లేటికే?

చ॥ కొలనికి పొంత సంపెగలకోన జరించిన వేళ తత్సరీ
మళముల నానితూని, వను మాటికి మాటికి చేరబిల్చి, "మీ
వలపుల తావు లీకుసుమ వాసనలన్ మఱపించు" నన్న నీ
జిలిబిలి ముద్దుపల్కులకు చిత్తము జిల్లని వల్ల వీఁచినన్

ఉ॥ ఆ రుచిరోరు ఫాల్గుణ నిశాంతరవేళ, సుధాంశు చంద్రికా
పూరము వెల్లవార, మన పుష్ప వనాంతర కేళిలో 'శర
న్నీరద, మంచు తెల్లనగు నీమెయి గట్టిన చీరకొంగు నా
కోరఁగ నడ్డు పెట్టవె సితోత్పలలోచన! మున్ను కాంక్షతోన్.

మ॥ అన, నాగామ విహారముల్ సలుప రమ్మా, నెచ్చెలీ! యన్న, న
త్యను రాగోద్భవనై జ గద్గదికతో, నాహ్లాదము పొంగ, చుం
బవ సంశ్లేషము లేను మానుటతనై వాగ్దానమున్ గోరి, మో
వని నా కప్పుడె యందజేసితివి తన్వీ! పక్వబింబాధరా!

మ॥ లలితారామ విహార వేళ నిను సల్లాపంబు లాడించి, నీ
వలయన్ గాంచితి వన్న వెట్టిభ్రమ నేవందించు బాహుద్వయీ
వలయాలింగితవై, భవద్వదన లావణ్యంబు వీక్షించు నా
తలపున్ స్వగ్నము మాయ లాడివయి, యుద్య ప్రేమ నందిల్లగన్.

సీ॥ కేళీ వనమ్ములో లాలితమగు సొక్కు—పలిలాకరము పట్ట నై కతమున,
కంఠమాలికలుగా కరములు తగిలించి,—యొకవేళ హస్తము లొత్తిగించి,
లోచన ప్రభలతో లోచన ప్రభలను—దీటించి,యొకవేళ తెప్పలిల్లి,
మోవి నాసించి సమ్మదితవై యొకవేళ—మగిడి సిగ్గున మోము మఱుగు పఱచి,

గీ॥ అల్ల కాసారసీమ నుత్ఫుల్ల కుముద । వారిజము జేరు రాయంచ భామ వోలె
తమ్మి నీ మోము నాయుర స్థలము జేర్చి । కోరవే మూగకోర్కులు కోమలాంగి!

చ॥ కలిత విశాల ఫాలఫలకంబున ముంగురు లొక్క చేతితో
దొలఁగ నదించి, వేఱొకట తోరపు బాలరసాల శాఖికన్
బలముగ నల్లుకొన్న లతభంగి ననున్ బెనవైచి, యేటికే
జలజదళాక్షి! నన్ను గనజాలక తెప్పలు మూసి తంతిలోన్?

తే॥ కొఱకు లర విచ్చి, తొలిసిగ్గు కొంత తేటి, । అదరు లేమ్మోవి నించుక కుదురు పరచి,

వాలు చూపుల నీక్షించి, వదనమధువు । గ్రోలు నన్నుగాంచి నవ్వునే క్రొంచె తన్వి.

క॥ నీ కాటుకవడి కన్నులు । రాకేందు హసించు నీదు రమణీయముఖం
బాకొంటి జూడ; సిగ్గున । నీ కరకంజంబు లడ్డు నిలుపకు చెలియా!

ఉ॥ సోముని కౌముదీలహరి శోభిలె దిక్కుల నిండి; యామినీ
కామిని ముగ్ధ మూర్తియయి కాంచె ప్రశాంత వినూత్న రమ్యతన్;
కామకళా విరూఢి కిది కాలము సుమ్ము; ఇఁక సిగ్గు లేటి కో
కోమలి! చూడవో నను చకోర విలోకన జాలకంబులన్.

చ॥ అని, తరలింప నా తనువల్లి యాశ్రిత పూపొదరింటి లోనికిన్,
మనసిజ రాగ పూరితయి మానస ముత్సుకతన్ వెలార్ప, నం
గనయును రాజహంసిగతి నాతని కౌగిట నొప్పె; తోఁపగన్
పసహారిణద్వయంబు పరిపైరము మేయగ నేగు చాడ్పునన్

ఆ॥ చంద్రుఁడస్తమింప చంద్రికాతతి తోడ । నలరె నుడులు పేరటాండ్రు వోలె;
పుష్ప వనములోని పూపొదరింటిలో । పాతె మరుఁడు మకర కేతనమును.

వ॥ చాల సేపైన సిమ్మకట రాజ్యలక్ష్మీ దేవితో ఆంధ్ర విష్ణు విట్లనియె:

చ॥ "మలయగిరి ప్రభూత మృదు మారుతముల్ చరియించె; క్రొమ్మహో
త్పల నవగంధ మాధురులు కాంచన మూడెడు వేళ దగ్గెన్;
జలనిధి హోరు తగ్గె; దిన చర్యకు ముందట విశ్రమింపగా
దలఁతువటంచు నెంతు మన తల్ప గృహంబున;" నంచు బల్కినన్.

క॥ సుందరి నవ్వుచు నిట్లనె. । "పొందిన విశ్రాంతి చాలు, పూ విల్తు సఖా!
మందిర మందున మన మిఁక । మందము విశి యటను తెలియ కుండెదు మాడ్కిన్."

వ॥ అనిన, నింటికి నడచుచు రాజ్యలక్ష్మికి ఆంధ్ర విష్ణు విట్లనియె:

తే॥ పాలు త్రాఁగెడు వేళ బిడాల మతి । ములను మూసికొని, తన నొరులెవరు కన
రనుకొను పగిది మనముంద మందు వింతి! । కరతలామలకము మన కథ జనులకు.

తే॥ 'తిమ్మనా!' యని పిలువ కోఁకని నొకఁడు. । "ఎటుల తెలిసె పేర"నెను మల్కటము; చెప్పె
ముత "మనె వతఁ; డటులె మన మోము తెలుఁగ । జేయు మన యూసు ప్రేక్షక శ్రేణులకును.

తే॥ అనిన, పతికనె నవ్వుచు నా సఖి. । "ఎటుల తెలిసిన తెలియునే; అంతె కాని,
మాంసమును తిని, ప్రేగులమాల వైచి । కొండురే? నాకు సిగ్గటి చంద మార్య!"

తే॥ అనిన, నొడబడి, "నీవన్న యటులె మెలఁగు । ద" మని యతఁడతయ మొసఁగె; దరిసి తింటి
వింతలో వారు, సేవకు లెల్ల నిద్ర । నుండ, కాపరియగు నొక్క యువిదతప్పు.

చ॥ దినము క్షణంబుగా పరుగు దెంచగ నిత్యము, నూత్న దంపతుల్
వనమున సౌధదేశమున బంధుర చిత్తులుగాగ బద్ధులై
చవవుల ముగ్గితేలుచును, సంతత మోదము నందుచుండగన్

జనియెను కొన్ని మాసము లచంచల వాంఛిత తుష్టి గూర్చుచున్.

## గ్రీష్మ, వర్ష, శరత్, హేమంతములు

వ॥ కాలక్రమమున గ్రీష్మర్తు వేతెంచి ఎండలు హెచ్చ సాగెను.

సీ॥ బడబాగ్ని, దావాగ్ని, పాల్కడలి బొదము-హాలాహలము నొక్కటైన యట్టు
లిను నెండ నానాటి కెక్కుడై మాడ్చెను-వేడిలో ముంచి పృథ్వీతలంబు;
తట్టు మిట్టాడిరి తాపాగ్ని భరియింప-జాలక భూప్రజా జాలమెల్ల;
వడగాడ్పులకు జనుల్ వరుగులై వాడిరి;-ప్రాలి రుర్విని కొంద అసువు లుడిగి;

గీ॥ ఉడుక పోతకు తాళక ఉడికియుడికి, । చెమ్మటల్ కారి బట్టలు చెమ్మగిల్ల,
విసపకాన లేక చేతులు వ్రేళ్ల నొవ్వ, । పరి పరి విధంపు బాధలు పడిరి ప్రజలు

తే॥ చలువ పందిళ్ల దాహోపశమనమంది, । బాట సారులు విశ్రాంతి బడసి యేగ,
మట్టికుండల చల్లని మంచి నీర । మిండ్లలో త్రాగి శాంతించి రితర జనులు,

వ॥ గ్రీష్మము చెల్లి, వర్షఋతు వేతేర,

సీ॥ ఆ జనమేజయు నగ్నికుండము నందు-నురగముల్ లక్షలై యురికి నట్లు,
సత్యభామా దేవి సమర లాఘవ వేళ-బాణముల్ లక్షలై వ్రాలి నట్లు,
రాజసూయాగ్ని హోత్రము నందు ఘృతఘటం-బుల నేతి ధారలు పోసినట్లు,
ధరణి గ్రీష్మాతపతప్తమై దాహంబు-పెల్లుగా దీర్పగ వేడినట్లు.

గీ॥ కారు మబ్బులు నైరృతి వారి గురిసె, । నదులు నశ్వము తడిసెడు ప్రకట భంగి;
ప్రావృడంబుద శ్రేణి విశ్రాంతి గనని । వర్షకాలము చెలరేఁగె వసుధ నపుడు

తే॥ సింహ, శార్దూల వితతి గర్జించు మాడ్కి । ఉరుములు టిమెను; పిడుగులు నుర్వి రాలె;
మెఱపులు ద్ధతి మెఱసెను మింట, భువిని । క్షణికముగ నింపి దీప్తితో చాల సార్లు.

తే॥ పవన సందోహ మీ శాన్య వారిదముల । బంపె; నైవికులల్లని కార్లు తీర్చి
నిలిచి కురిసెను వర్షము. నిండిపొంగి । పఱదలై పాఱ నదులును వారి నిధులు.

వ॥ వావకాల మేగి, క్రమముగా శరదృతువు ప్రవేశించగా

సీ॥ తూగు టూయల లూగు దూది పింజలు వోలె-తెలితమ్మి రేకులు తేలినట్లు
శ్వేత పయోదముల్ విపుల సంచారంబు-గావించె నాకాశ గర్భ సీమ;
కుముద, పద్మంబులు కోనేళ్ల వికసించె;-క్షోణి సస్యములతో చూలుదాల్చె;
కౌముదుల్ విహరించె కాశ్య పీతలమున,-గగన రాజ్యము నేలె కలువ ఱేఁడు;

గీ॥ అంబుజా కరములను రాయంచగములు । నయన పర్వముగ పలు విన్యాసములను
చేసి, మోదము నింప హృత్సీమలందు । ఆ శరద్వేళ జనుల కాహ్లాదమయ్యె

వ॥ శరదృతువు పిదప హేమంతమున

సీ॥ దారి కానని రీతి దళసరి తెర కట్టె-మన్ను మిన్నును గలిపి మంచు రేకు;
దోస, దాడిమ, రేఁగు తొలిగాగ ఫలరకం-బుల పండ్లు పండెను భూరుహములు;

బంతి, చేమంతులు, బహువర్ణ పరిమళ-పుష్పముల్ కనుపండుపుగ పూచె;
ఆరోగ్య వంతులై యఖిల ప్రజావళుల్–బలము, నోపిక హెచ్చి, పటిమ గవిరి;
వైద్యులను ఆయురారోగ్య వర్ధనమున । కైన మందులు మొదలిడు నట్టి ఋతువు
చల్లనై గ్రాహ సంక్రాంతి సహితమైన । అతులితానంద హేమంత మలరె భువిని

<u>కళింగమునకు రాజ ప్రతినిధిగా ఆంధ్రవిష్ణు</u>

ఆ హేమంతమున కళింగ రాజైన 'భల్లుకుడు' వారసులు లేకుండ మరణించెను.
అపుడు కళింగ దేశ జనమందలి ముఖ్యులు వచ్చి, కాకుళా
ధిపుని సుచంద్రు గాంచి, "జనదేవ! గతించె నపుత్రకుండు మా
నృపవరుఁ డిప్పుడొక్క గణనీయుని నంపుడు మమ్ము నేలగా;
నపథమగున్ కళింగము మహాశయ! తక్షణ మంపకున్న చోన్.
"మా మహీశుఁడు మీకు సామంతుఁడగుట. । మీ యధీనము మావారి మేలుకీడ్లు;
ఆదరింపుడు మీతోడి యాంధ్రజనుల । మైన మ"మ్మని యాముఖ్యు లర్థివేడ
మన సుచంద్రుఁడు తన బాధ్యతను గ్రహించి, । "ముందు తాత్కాలికముగ నా పుత్రు నంపి
నా ప్రతినిధిగ; సావధానముగ పిదప । నొకరి నియమింతు జనులార! సకల మరసి"
అనిన, నంగీకరించి ప్రహర్షమునమ, । కొందఱేగి రీవృత్తాంత మందజేసి,
జనులను స్థిమితపఱుప; తక్కిన కళింగు । లాంధ్ర విష్ణునితో నేగ నాగిరపుడు
సతితో, తగు సైన్యముతో । హితులు, సినవులు, పరివార, మెల్ల కళింగుల్
జతకూడ, సుచంద్ర కళా । వతుం తనయుఁడాంధ్ర విష్ణు పయనం బయ్యెన్.
దారిలో గాంచి యతఁడు గోదావరి నది । నట విడిసి రేయి, నరుణోదయంపు వేళ
పసుపు, కుంకుమ, తాంబూల, ఫల, సుమంబు । లర్పణము చేసి, సుస్నాన మాచరించి.
గోదావరి నిట్లు స్తుతించెను:

తొలినాఁడీవు జటాంబు జన్యవయి, నీతోయంబు సంజీవియై
తొలఁగన్ జేయఁగ యామ్య భారత భువిన్ దుర్భిక్షముల్; జాహ్నవీ
సలిలం బట్టు లఘుంబులన్ దుడిచి పుచ్చున్ స్నాన మాత్రంబునన్,
గలుగన్ జేయుదు వాంధ్ర రాజ్యములకున్ కల్యాణ మెల్లప్పుడున్.
ఓ, గోదావరి తల్లి! నే నొక మహోద్యోగంబు చేపట్టి । యి
ట్లేగన్ బూని కళింగ సీమ, కిట నిన్నీక్షింప గంటిన్; మదు
ద్యోగంబందు జయంబు, దేశహిత కార్యోల్లాసమున్, భూప్రజా
రాగంబున్ బడయంగ దీవనల గూర్పన్ గోరుదున్ గౌతమీ!
అని, కైమోడ్చి నమస్కరించి, పయనంబయ్యెన్ నదిన్ దాఁటి, వం
దనముల్ చేయగ త్రోవలోని సకల స్థాన ప్రజారాజి, పు
ష్ప నవామోదము నావవచ్చు మధులిట్పుం జాసమున్ బోలుచున్;

జనులన్ ముఖ్యులు ముఖ్య పట్టణమునన్ సారింప రాట్ ద్వారముల్.

తే॥ ఆకళింగప్రదేశ మా యాంధ్రవిష్ణు । వేల కొన్నాళ్లు, ప్రజలు సంప్రీతులైరి;
అంధ్రవిష్ణుని తమ శాశ్వతాధి పతిగ । గోరి వేడిరి తన్నాయకులు సుచంద్రు.

తే॥ ఆ సుచంద్రుఁడు పుత్రుసాయంబు తనకు । వలయు రాజకార్యముల నిర్వహణ వేళ
నైన. నాల్గేళ్ల పాటుంతు నచట ననివ, । తిరిగి రింట్లకు కొంత సంప్రీతి తోడ.

తే॥ ఇందుకేదైన వ్యతిరేక మెవరికైన । నున్నచో దెల్పుడని యున్ని యూళ్లలోన
చాట బంచె కళింగ దేశమున విభుఁడు; । ప్రజలు వాక్రుచ్చి రతఁడె కావలయుననుచు.

మ॥ ప్రకటించెన్ తనయున్ కళింగ పతిగా రారాజు; తత్సీమ యం
దకలంకోత్సవలక్ష్మి తాండవము చేయన్ బెద్దకాలంబు; స
ర్వ కళింగంబున గేదె, లావులును క్షీరం బీయ కోకొల్లగా;
సకలైశ్వర్యదమై సుతృప్తి నెద గూర్చన్ సస్య కేదారముల్.

ఉ॥ ఈ గతినొప్పె దేశ మతఁడేలిన నాలుగు హాయనంబులన్;
రోగము, ఈతి బాధలను, రొప్పులు, చోరులు, కీటకంబులన్
నాగువులన్ బ్రజావళికి నష్టము, కష్టము గూర్చకుండగన్
సాగెను పాలనంబు రఘు చంద్రుని పాలన జ్ఞప్తి చేయుచున్.

ఉ॥ న్యాయము, ధర్మమున్ రథహాయంబులు, రాజతికంబు తేరు, వి
ద్యాయత బుద్ధి సారథి, సహాయులమాత్యులు, సేవకాదులన్;
ధ్యేయము పాలితాఖిల మహీజన సౌఖ్య, హితద్వయంబుగా
శ్రీయుతుఁడాంధ్ర విష్ణు వట చేసెను పాలన ముత్తమంబుగన్.

చ॥ తనయుని కీర్తి దిగ్గళకదంబము తొట్టి ప్రతిధ్వనింప, త
జ్జనని కళావతమ్మ మది శౌరిపదంబును మించి పొంగె; త
జ్జనకు సుచంద్రుని నెమ్మది ప్రశాంత విశాల పయః పయోధియై,
తనువు తంటబులం దిమిడి దాగుటకై నలిపెన్ బ్రయత్నముల్.

ఉ॥ నాలుగు వత్సరంబులు చనన్, తన రెండవ పుత్రున్ నాధరా
పాలన కంపనెంచి, జనపాలుఁడు చాటె కళింగ సీమలో;
కాలరు లెల్లరన్ విని, జగజ్జన తృప్తిగ, శాశ్వతంబుగా
పాలకు జేసె నా పృథివి పౌరులు మెచ్చగ, నా కుమారుపన్.

క॥ ఆ యాంధ్రాదిత్యుండును, । నా యాంధ్రాదిత్య వంశ మందలి రాజుల్
ఆ యాంధ్ర సీమ నేలిరి । శ్రేయః ప్రేయములు గురియ చిరకాల మిలన్.

తే॥ ఆంధ్ర విష్ణు శ్రీకాకుళ మందు మఱల । యౌవరాజ విధుల నిర్వహణ నిమగ్ను,
డై, సుచంద్రునకు గడు సహాయుఁడయ్యె; । నిట్లు నడచుచు నుండగ నేండ్లు కొన్ని

## సుచంద్రుని మరణము

మ॥ అజనాథావని దక్షిణార్థమును దుఃఖాబ్ధిలో ముంచుచున్
ప్రజలున్, రాజులు, రాజచక్రములగు పిభ్రాంతిన్ జలింపన్, సుచం
ద్రజనాధీశుఁడు ప్రాణముల్ విడిచె, వృద్ధాప్యంబుమై నిండగా,
రజనీ నాయకుఁ డస్తవారినిధి నిర్యాణంబు గొన్నట్లు గన్.

సీ॥ గ్రీష్మ మధ్యాహ్నాగ్నికీలా సహస్రంబు-మాడ్చి కూల్చిన చెట్టు మ్రాను వోలె,
కదలి తుపానులో పడి. ముక్కలై, యొడ్డు-చేరిన పెనుదోనె చెక్క వోలె:
దుఁటీ ఫలము చిట్టి, తుక్కు తుక్కయి, యింక-పనికి రానట్టి విపంచి వోలె,
విపిన వీథుల ప్రాకి వేటాడి, కడుసొమ్మసిలి దోఁగు నొక కొండ చిలువ వోలె.

గీ॥ చిలుకెగిరి పోవ, శూన్యమై, చిన్నపోయి । జాలి గొలుపుచు వ్రేలు పంజరము వోలె
దీర్ఘని ద్రావకుండయి. తెలివి తప్పి. । శయ్య నుండె సుచంద్రుఁడు కొయ్యబారి.

క॥ అమవస చీఁకటి వోలెను । తిమిరాసుర క్రూరవక్త్రకీక్షత వోలెన్,
యమ సదనము వోలెను, దుః । ఖము పలురూపముల నాంధ్ర కాశ్యపి విడిసెన్

తే॥ మహిష వాహను చెయిదము మాన్ప లేక । శయ్య చుట్టును రారాజు స్వజను లెల్ల
చేరి, కనులద్దు కొనుచును, చింతమునిగి, । చూచు చుండిరి పరవుచు శూన్య దృష్టి.

తే॥ అంతు లేనట్టి దుఃఖము నాపుకొనుచు, । వృద్ధ రాణి, కళావతి, విష్ణుమాత
నిరత జలదంబులై కనుల్ నీరు కార్చ, । నలసి, కూర్చుండె భర్త కాయంబు చెంత.

తే॥ చంద్రుబాసిన కలువ పుష్పంబు వోలె । కళలు మఱుగైన దీనముఖంబు తోడ,
గోతులను బోలు కన్నుల గూండ్ల తోడ, । పరగె నాంధ్ర విష్ణువు తండ్రిపజ్జ నిలిచి.

సీ॥ రారాజు మరణించె రాజ్య మాత్మ జుకిచ్చి;-వినుడోయి జనులార! యని ప్రధాని
కోట బురుజు నెక్కి చాటించె ముమ్మారు;-తప్పెటల్ మ్రోగె చింత దెలుపుచును;
గంటసాల చలిత ఘంటారవము చేసి-ప్రకటించె దుర్వార్త పలు దిశలను;
జాముజాముకు గాత్ర, జంత్రి చింతాగీత-మాలపించెను సైన్య. మద్ది బలము.

గీ॥ పౌర రక్షక బలమును వరుస వెంట; । అగ్గివలె వార్త తక్షణ వ్యాప్తి పొందె;
జనులు గుంపులు గుంపులై చనిరి కాయ, । దర్శనార్థముభక్తి తత్పరత నడవ.

తే॥ రాజు పుత్రుఁడాంధ్రాదిత్యుఁడా జనమును । దీనవదనుఁడు, లోచన దీప్తి రహితుఁ
డగుచు, రోదిచ్చి, రాజు కాయంబు జూచి । అంజలి ఘటించి యేగుట కనుమతించె.

వ॥ పిమ్మట యథావిధిగ ఆంధ్రాధిపతికి అంత్యక్రియలు నిర్వర్తించి ఆంధ్రవిష్ణువును కళింగాంధ్రాధి
పతి యగు ఆంధ్రాదిత్యుఁడును శుభస్వీకరణ మొనర్చిరి.

## ఆశ్వాసాంతము

జలదము॥ ఏనిపుడాంధ్ర విష్ణుకథ వించు కనీ । వీనుల విందుగా దెలుప, వింటివి; వా
ణీ: నరనాథు భావి కథనే తెలుపన్, । నీ నిరతా స్యశోభ ద్విగుణీ కృతమౌ,

# తెలుఁగు వారి ఆదిచరిత్రము
## ఆంధ్ర విష్ణు ఖండము అను పంచమాశ్వాసము

క॥ శ్రీసతి కోడల వోవి । ద్యాసతి! విను, తెలుఁగు వారి ఆది చరిత్రన్
వ్రాసిన మత్కృత చరమా । శ్వాసము బహు విషయ సార సంపన్నంబున్.

ప్రజావాణి-పట్టాభిషేకము

తే॥ స్వయముగ సుచంద్రుఁడేలిన సర్వ భూమి । యందు చాటించి రాంధ్ర విష్ణువని నేల
నేరికైన వళ్ళంతర మేదియున్న । నెలకు లోన ప్రధానికి దెలుపు డనుచు.

తే॥ ఆ నెల పిదప గణసభాస్థాన మందు । పౌరసభ చేసి, యర్థించె ప్రజల వాణి
నా ప్రధాని; ఏకగ్రీవ మయ్యె వాక్కు । రాజుగా నాంధ్రవిష్ణు పేర్వడ వలెనని.

వ॥ ఆ సభకు అన్నిరకముల పనులు చేయువారు వారివారి భార్యల తోను, ఈడందిన పుత్త్రి పుత్త్రకుల తోను, అల్లుండ్రతోను, కోడండ్రతోను, వచ్చేసి యుండిరి. పురుషులతో సమానముగా అన్ని పనులు చేయుచు స్త్రీలు సమానమైన హోదా కలిగి యుండెడి వారు. స్త్రీ పురుషులు మొలలకు ధరించిన వస్త్రముల కుడిపైపు పోఁకముడి తోను, ఆ ముడి నుండి వ్రేలాడు (వస్త్రపు) కొనల తోను ఒప్పు చుండెను. తలలపై అందఱును ఆచ్ఛాదనములను దాల్చి యుండిరి. స్త్రీలు నడిమి పాపడి తీసి, జుట్టును వెనుకకు లాగిచి, ముడిపైచికొని యుండిరి. ఆముడి చుట్టును పూల మాలల తోను, వారివారి భాగ్యముల ననుసరించి పూసలతోగాని ముత్యములతోగాని పగడములతో గాని అల్లిన సరములను దాల్చియుండిరి. కొందఱు బంగరు పూవులతోను అర్ధ చంద్రాకారపు స్వర్ణ భూషణములతోను ఆముడిని అలంకరించు కొనిరి. స్త్రీ పురుష లెల్లరు ను తిలకములను ధరించి యుండిరి. అందఱును చెవులను కుట్టించుకొని, ఆ రంధ్రములలో ఒక్కొక్కదాని యందు ఒకటి గాని రెండు గాని కర్ణ చక్రములను ధరించి యుండిరి. వానితో పాటు గాని, వాని బదులుగ గాని, పూసలు పగడములు రత్నముల తొ చేయబడిన సరములను ధరించిరి. రకరకముల కంఠ హారములు, పూసల పేర్లు రత్న మాలలు, ముత్యాలహారములు, పగడాల పేర్లు ధరించిరి. కొన్ని హారములకు బంగరు పతకములు వ్రేలాడు చుండెను. చేతులకు ముఱుగులు, బాహువులకు దండ కడియములు, వ్రేళ్లకు ఉంగరములు ఉండెను. స్త్రీల ముంజేతులు గాజులతోను వివిధా భరణములతోను ఎక్కువ గా నిండి యుండెను. స్త్రీల కాళ్లకు కడియములు, అందెలు, గొలుసులు మొదలైన భూషణములు ఉండెను. ఏకగ్రీవముగా ఆంధ్రవిష్ణువు ఎన్నుకొనఁబడిన పిమ్మట

తే॥ అన్ని యూళ్లలో ప్రకటించె నా ప్రధాని । ఆంధ్ర విష్ణువు పాలించు నాంధ్ర సీమ
నాంధ్ర భృత్యుఁడుగానంచు, యామ్య భరత । జగతి రారాజుగా నంచు, జనులు మెచ్చ.

వ॥ అంతట నొక సన్ముహూర్తమున తల్లియైన కళావతి దీవనలను అత్త మామల ఆశీస్సులను పొంది, పట్టాభిషిక్తుఁడై ఆంధ్ర విష్ణు రాజ్యలక్ష్మి సమేతుఁడై కొలువున్న వేళ

చ॥ జనసంఘంబు జయధ్వనుల్ సలుప, కాసారాంబు మధ్యంబునన్
వనజా తోద్భవు వారు వంబుల క్రియన్ భాసిలి రయ్యాంధ్రవి

ష్ణుని భార్యా మణి యాతఁడున్; సభికులిచ్చో మేటి సంతృప్తి, చం
ద్రుని పేరోలగ మందు తారల వలెన్ దోఁచెన్ జన శ్రేణికిన్,

శా॥ వాలుంగమ్ముల చెల్వ లిర్వురట వీవన్ చామరంబుల్, భటుల్
కేలన్ ఖడ్గములన్ ధరించి విభు రక్షింపంగ పార్శ్వంబులన్
గ్రాలన్, మంత్రులు, దండ సాధులు, కళాకారుల్ కవుల్ వందితుల్
మేళంబై రి పరస్పరంబు కథ పెన్మోనంబు లబ్ధిన్ బిలెన్.

శా॥ సాలా భోన్నతకాయు, లర్కసమ తేజశౌర్య ధుర్యుల్, జగత్
జాలా తీత పరాక్రమ ప్రతిభులౌ సామంతు లా కొల్వులో
ఫాలంబుల్ భువిసోక మ్రొక్కి తమకున్ పైనాథుఁడాంధ్రేశు, కా
మ్రోలన్ గూర్చొని రాననంబుల స్మితాంభోజాళి చందంబునన్.

వ॥ పిదప, సామంతులై న కళింగ, పుండ్ర, శబర, సిరాహ, విదర్భ, నాసిక, నిషధ, భోజ, చేది, ప్రతిష్ఠాన, ద్రవిడ (పాండ్య), సింహళ, కేరళ, ఓఢ్ర, ఉష్ట్రి కర్ణిక, కిష్కింధ, కుంతల, కొంకణ, వనవాసాది నరపాలురును; కోయ (గాండు), చెంచు, బోయ, ఎఱుకల, ఏనాది, గదబ, కొలవ మొదలైన అంధ్రజాతి తెగల ముఖ్యులును ఆంధ్రవిష్ణును ద్దేశించి

క॥ మీ తండ్రి సుచంద్రుని యెడ । నే తీరున మెలఁగినాము, యిఁక మీఁదట మే
మా తీరును తప్పమనుచు । చేతః పూర్వక ప్రతిజ్ఞ చేసి రొకొక్కరున్,

వ॥ పిదప నాంధ్ర విష్ణు

తే॥ పము చితంబుగ నెల్లర సత్కరించి । యనిపి, భద్రత సుఖము భాగ్యమును ప్రజల
కనవరతమును చేకూర్ప నాత్మనెంచి, । దీక్షతో రాజ్యమేలెను ధీ సమృద్ధి.

తే॥ వసుధ సస్య సమృద్ధమై పంట పండె; । కొల్ల కొల్లగ దుగ్ధముల్ కురిసె పసులు;
వైరి, చోరాగ్ని, రోగాది భయము లేక । ప్రజలు సుఖియించి రా విష్ణు పాలనమున.

## నిశుంభుఁడు

జననంబందె నిశుంభ నాముఁడగు రాజన్యుండు సింధూత్తరం
బున; వేదాదుల నభ్యసించి, యప్పుడీ భూమిన్ బ్రవర్తిల్లు స
జ్జనమాన్యంబగు మిశ్ర సంస్కృతిని విజ్ఞానంబు సాధించి, దే
వుని యందున్ గడు భక్తితో మెలఁగె నంభో జస్థ భృంగి క్రియన్,
కొన్నాళ్లేగిన నిమ్మటన్ దలఁచె, నుద్ఘోషింప దెంచంబు, కా
నిన్నాళ్లన్ మదినమ్మినట్టి తతి విద్వేత్త్యుక్తమః చంత, కా
సి న్నుత్తుంగ మహర్షి పండిత సభన్ జేయించె, తార్కిక్యాక బు
ద్ధి న్నమ్మన్ దగు మార్గమున్ దెలప నా ధీమంతులన్ గోరుచున్.
దేవుఁడనన్ బరంగు నొక ధీయుతుఁడున్నటులైన, తర్కపుం
భావన కందు నట్లు తెలపన్ సమకట్టు దటంచు గోరె, నా

దేవుని నమ్మి సద్విదుల; తెల్పిక గ్రుడ్లను శిల పైచి రా
కోవిదు; లానికుంభుఁడిక గొంకక, పూనె నిరీశ్వరప్రమున్.

కా॥ కైలాసంబున నుండి ప్రాగుదధి దాకన్ గల్గు దేశాధినా
థాళిన్ ఖండన మందు గూలిచి, నిరీశ్యంబున్ బ్రతిష్ఠించి, భ
క్తాళిన్ బెగ్గిల జేసి, విగ్రహములన్ జూర్ణంబు గావించి, ని
ర్మూలించెన్ బలి దేవమందిరములన్ మూర్ఖత్వ ముప్పొంగగన్.

తే॥ దేవుఁడున్నటు లెవరైన భావమందు । గాని, వాక్కర్మములగాని, కానుపింప
తనకు జూపుడు భగవంతు ననుచు బలికి । చూపకున్నను నుడిపెను కోపమూని.

తే॥ సింధునది యుత్తర ప్రాంత సీమవారు, । గంగ కుత్తరపుం తెలుంగములు కూడ
నాత్రిదశ నికుంభుని ధాటి కలిగి, మణగి । కడపు చుండి రుసురు లన్యగతులు లేక.

వ॥ సింధు, బ్రాహ్వీ దేశములును, ఉజ్జయిని, మాళవ, అవంతి, యదు, హాయహయాది తెలుగు రాజ్యములును, దక్షిణ కోసన మొదలగు ఆంధ్ర రాజ్యములును నికుంభుని ధాటి కింకను నెరక కుండెను. ఆసమయమున తెలుఁగు లనేకులు దక్షిణమునకు వలన వచ్చిరి.

తే॥ ఇట్లు వలసలకై వచ్చి రెన్నిసార్లొ । మన తెలుఁగు జన తండముల్ మఱల మఱల
నా నిరీశ్వర రాజమ్యు నాగడమున । నితర కారణముల చేత సతత మిటకు

క॥ పరికించి యీ పరిస్థితి, । పరికించుచు వేగు వాంధ్రు పంపెను వార్తల్,
దరి దాపులనున్న విషమ । పరిణామము లూహ చేసె నృపవరుఁడంతన్.

క॥ ఎప్పు డొవచ్చు నికుంభుఁడు । ముప్పున ముంచంగ నాంధ్ర భూతల మెల్లన్;
తప్పదు సమరము వానితొ । నెప్పుడొ, యని ఆంధ్ర విష్ణు వెదురు కొనంగన్.

క॥ సిద్ధముగ నుండె చతురం । గోద్ధత సైన్యంబు తోఁ; నుపరాజులకున్,
సిద్ధము కందు నికుంభుతొ । యుద్ధంబున కనుచు కబురు లమ్మడి నంపెన్,

మధ్యాక్కర॥ అపుడు బృహత్స్వన నృపతికా నికుంభుఁడు గట్టి కబుర
నిపె: "నో ముదుసలి రాజేంద్ర! నీ దీర్ఘ జీవితం బందు
నెపుదేని, యెచటేని చూచి యెఱుఁగుదే దేవుఁడన్ వాని?
నీ పృథ్వి కిట్టి నమ్మకము లెంతేని పెనుకీడు తెచ్చు.

మధ్యా॥ "బలవంతు, నావంటి వాని ప్రజలెల్ల ననుసరించుచును,
సలవోకగా నెల్ల పనుల నాచరించుచు, నిజశక్తి
నలతి చేయక. దేవుఁడెవడొ అలఘు శక్తి నమ్ము మనము
తలఁచిన వన్నియు ననెడు తప్పుటూహ విడున వలయు.

మధ్యా॥ "నీ వేల దేశంబు నందు చీవిట్లు శాసించి, గుడుల
దేవ విగ్రహముల దేవిదేవి నిర్మూలింప వలయు;
నీ పట్లొ నర్పవొ వత్తు నేను దండెత్తి; నా కత్తి

కీవు, నీవారును, మంత్రులెర యొూదురో రాజ వర్య!"

మధ్యా॥ దాని కనిపె తెలుఁగు నృపతి తగిన ప్రత్యుత్తరంబిట్టు;
"లో నికుంభాసుర! దేవుఁడున్నట్లు నేవిశ్వసింతు;
భాను తారాయుత విశ్వవర్తన నైశిత్యమరయ,
ధీనిధి యొకఁడు నేర్పునను దీని నడపు నట్లు తోఁచె.

మధ్యా॥ "దేవుని 'గాయత్రి' యనెడు దివ్యమంత్రమున గాధేయుఁ
డావిభావసు మించు తేజ మనియె; నా శక్తి నడపు
నీవిశ్వ సర్వంబు సతము నీయగానెంచి మోక్షంబు
జీవుల, కెవరికి వారిస్వీయ సాధన ఫలంబుగను.

మధ్యా॥ "దిక్కతఁడే విశ్వమునకు, తేజదుఁడును,రక్షకుండు;
మ్రొక్కులు, ప్రార్థనల్ మెచ్చి, ప్రోచును వరమిచ్చి యనుట
నిక్కంబు కాదంచు దెలిసి, నేను, నా ప్రజ లెల్ల పనులు
చక్కగా మా శక్తి తోడ జరుపుచే యలవాటు మాకు.

మధ్యా॥ "జ్ఞానార్జనంబున విశ్వసత్యముల్ తెలియంగ వలయు;
మానవుల్ పాప భీతియును, మఱి దైవ భక్తి యున్, భయము
మానుచో, చట్టములు నియమములు మాన్పపు దుంతగములు;
కాన, సర్వజన సుఖంబు కలుగు నిరీశ్వరమున,

మధ్యా॥ "కలిగించు సత్కార్యజయము, కష్టముల్ తొలగించు ననెడు
బలమైన నమ్మకం బీశు పైనున్న. తమతమ కృషిని
పలురెట్టు లధికమౌ శక్తి వంతంబుగా జేసియిష్ట
ఫలితముల్ సాధించగలరు భగవంతు నమ్మిన జనులు."

మధ్యా॥ ఆ నికుంభుండీ పలుకుల నర్థంబు చేసి కొండనుచు
మానసంబున నమ్మి, రణము మానదఁటా తఁడూహించి,
ఈనుదుల్ విశదీకరించి, యెల్ల వేఁదులకును వర్త
మాన మంపఁగ, బలములను మహిపతులను జేరిరటకు.

వ॥ ఆ బలములలో దక్షిణ కోసల, కరూశ అను ఆంధ్ర దేశముల సైన్యములును, అవంతి, మాళవ యదు, హయహయ మొదలగు తెలుఁగు రాజ్యముల సైన్యములును, బ్రాహ్వి, సింధు మొదలైన ఇతర దేశ సైన్యములు నుండెను.

తే॥ అల్లుఁడాంధ్ర విష్ణుఁడతిరయంబు మీఱ, । స్వీయ, సామంత సైన్యముల్ లెంకు నడవ,
మామ గారికి, ప్రజకు నేమంబు గూర్ప, । దక్షిణాపథ రక్షణ తాను పూని

వ॥ బయలు దేరుటకు ముందు తల్లిని దర్శించి, తాను తిరిగి వచ్చు వరకును రాజ కార్య నిర్వహ బాధ్యతల నామెకప్పగించి, ఆ మెయాశీస్సు లర్థింప, నామె యిట్లనియె:

మ॥ "ఘన కార్యంబు ఁ జేయు నా సుతుఁడు దుర్గర్వాంధ సోన్మత్తదు
ర్జన రాజన్య దవాగ్నియై యనుచు నుత్సాహంబునన్ స్వప్నముల్
గను చుంటిన్ భవదుద్భవాదిగను; సంకల్పంబు లీడేరు రో
జును దాసెన్; జయమౌను నీకు రణ రాట్ప్రాయోగ రంగంబునన్.

చ॥ "అపజయ మెన్నడున్ గలుగ దాంధ్రుల కాహవ భూమి యందు; నా
జపములు, నోములున్ విజయ సంపద లెక్కువ కూర్చు నీకు; నీ
యపరిమితోరు విక్రమము వర్ధిలు స్థామము కాల దేరికిన్;
కృపగను నీకుఁడున్ భవదకిల్బిషలక్ష్యము మంచి దౌటచేన్.

ఉ॥ "కోడలు తెచ్చె కంఠమునకున్ పుణమంగను వీరగంధమున్,
తోడుగ బొట్టుపెట్టి; పగతున్ బరిమారిచి రండటంచు దా
పాడుచు వీరగీతి; హిమనాలుక దెచ్చెను హారతీయ గా;
వేడుక మీఱ, గైకొనుము వీర వరా: జయ మందు మాజిలోన్"

వ॥ అనెడు ఆశీస్సులంది, వీర తిలకమును ఓద్దించుకొని, హారతి నంది, ఆంధ్ర విష్ణు

తే॥ వచ్చె నుత్సాహ సమ్మోద వారి దేలి; । 'క్షిప్ర' నది చెంత విడిసె నక్షీణ బలము
శత్రుసేనల గుండియల్ జల్లుమనగ; । నదరనా నికుంభుఁడు మహాహవమునకును.

తే॥ ఎన్నుకొని రాంధ్ర విష్ణుని నెల్ల నృపులు । నాయ కాగ్రణిగా; రెండు నదుల పొంగి
డీ కొనిన మాడ్కి డీకొనె మూఁకలపుడు; । పోర మకసిరి వదిచేలు మొనటినాఁడు.

తే॥ పదియు మూఁడు దినంబుల భంకనమున । సైనిక గజాశ్వచయములు వేనవేలు
చేరె స్వర్గము, రాలగ తేరు లవని; । ఆ నికుంభుఁడు వెనుజూపి యూనమున

తే॥ నేల బొఱియను దూఱు కుందేలు పోలె । పాఱి. తనయూరి కోటలో పలను దాఁగె
కొంత సైన్యముతో, నాశ లంత మొంద; । ఆంధ్ర సేనలు తరుమ వెన్నంటి యురిగి.

వ॥ ఆంధ్ర సేన ఆ కోటను పదుమూఁడు దినములు ముట్టడించెను.

ఉ॥ కాంతశిలా వినిర్మితము గావున నాతని దుర్గ కుడ్యముల్.
చెంతకు లాగి యంటు కొన జేసెను తమ్మరిబాణ జాలమున్;
గొంతెమ కోర్కులయ్యె విఁక కోటను జొచ్చుట లాంధ్ర సేన; కా
వంతయు నెమ్మదిన్ బెదర, కాంధ్ర నృపాలుఁడు చేసి యోచనల్

తే॥ కుడ్యములు కాంత శిలలన్న గుట్టు తెలిసి, । ఎండు గడ్డిని పొగవేయ, నీల్గె గుణము;
ప్రథనమున నాంధ్రసేన విక్రమము జూపి, । చొచ్చి కోట, నికుంభుని చుట్టు ముట్టి;

తే॥ ద్వంద్వ రణము నికుంభుఁడు వలచె నగ్ర । యోధతతి మధ్య; నదియు మహోగ్రమయ్యె;
అటుల పదియుమూఁడు గడియలాల మయ్యె: । నాంధ్ర విష్ణు నికుంభు నిరస్త్రు జేసి,

చ॥ ఉడుపగ ఖడ్గమెత్తు, తన యోటమి నొప్పు కొనెన్ నికుంభుఁ; డీ
పుడమిని వ్రాలి, శీర్షమును మోపెను విష్ణు పదద్వయంబుపై,

అడిగెను ప్రాణ భిక్ష; మపుడాతని బంధితు జేసి, మామ కా
తడవున మ్రొక్క జేసి, త్వరితంబుగ ధోడ్కొని పోయె నాంధ్రకున్

కll శ్రీకాకుళ పురవీధుల । నాకుంభిని వైరి ద్రిప్ప, నందఱు ప్రజలున్
జేకొని రాయవకాశము । మూఁకలు మూఁకలుగ వాని మోమును జూడన్.

ఆll ఆంధ్ర జాతి వారి యైకమత్య బలంబు । ఆంధ్ర విక్రమంబు, నాంధ్ర శిక్షణ
జయము గూర్చె ననుచు జనము లుప్పొంగిరి, । మనుతివ విరి వవిత మనెడు వఱకు.

వll అంతట నాంధ్ర విష్ణు

ఉll తల్లి కళావతమ్మ పద తామరసంబుల వ్రాలి మ్రొక్క, నా
తల్లి మనంబు పొంగెను సుధా జలరాశి తరంగ సంఘము
త్ఫుల్ల కళాంక రాక గని పొంగిన రీతిని; సంత సాశ్రువుల్
చల్లెను దీవనల్; కుముద సౌరభ మట్టుల హర్ష మొప్పగన్.

నికుంభుని చెఱ, విడుదల

వll దేవుని గుఱించిన విషయములా నికుంభునకు బోధించుటకై విద్వద్వరేణ్యులగు గురువులను ఆంధ్రవిష్ణు నియమించెను, వారు నికుంభుని ఇట్లడిగిరి:

ఉll "దేవుఁడు లేఁడో యెవరు దిద్దిరి సృష్టిని?" యన్న ప్రశ్న కా
ధీవరుఁడిట్లు చెప్పె: "నొక తేజము నుండి క్రమక్రమంబునన్
జీవ, జడంబు లుద్భవము జెందిన వంచు దలంతు తాముగా,
నేవిధి చెప్ప నన్ బొడము నెన్నియొ కాయలు నాకు, లట్లుగన్."

తేll "ఎవ్వరీ శక్తి వారల కిచ్చి" రన్న । ప్రశ్న "కాది తేజంబు లోపలనె యుండె
నద్ది; తేజ మాకసమున నలరె; దాని । జీవితము 'కాల'" మనియె నాభూవరుండు.

వll గురువులిట్లనిరి: "నీవనిన తేజమే దేవుని తేజము. నీవనిన ఆకాశమును 'అవ్యాకృతాకాశము' (space) అందురు, మనకు కనఁబడుచున్న ఆకాశము అదికాదు; ఇది పిదప పుట్టినది. మనకు ప్రమాణము లెట్టివియో వివరించెదము; వినుము.

తేll భౌతికముగ దెలియఁనవి, వానివలన । నూహ కందునవియును వేదోక్తులును, ప్ర
మాణములవి, దేవుఁడ ఖిలామ్నాయ వేద్యుఁ । డనియు దెలియుమ మర నికుంభాఖ్య రాజ!

వll "ఈ ప్రమాణములు ఆధారముగా మనకు దెలియుచునది ఏమనగా: ఆదిలో

తేll "దివ్య తేజమె కాక, 'ప్రకృతి' యు నలరె, । 'జడము', 'చేతన' మను రెండుజాతులుగను;
సత్వ, రాజస, తామస సరళు లెల్ల । భిన్న పరిమాణముల ప్రకృతి న్నెగడెను.

వll "చేతన ప్రకృతి పరమాణు రూపులగు భిన్న జీవుల మయము. ఆజీవు లకు తమ స్వరూపజ్ఞత యేకాక, సుఖము, బాధ, కాలము ప్రదేశము మున్నగు వానిని దెలిసికొను సుపజ్ఞతయు, చూచుట వినుట మొదలైన శక్తులను గలవు. ఈ శక్తులు మనకు వలె భౌతిక మైనవికావు; అ భౌతిక మైనవి. వీటిని 'సాక్షిన్' (sentience) అందురు

తే॥ "జ్ఞాన పరమాణు రూపపు సరణి నుండి; । జీవు లిచ్ఛమై జడముల జేరి, 'లింగ'
దేహులై, తొంటి జ్ఞాన మేది, కడు నిస్పృ । హా గలగిరి జాలరి వల మత్స్యమ్ము లట్లు.

సీ॥ "వారి ముక్తులఁజేయ బంధక మోచకుం–డా పరబ్రహ్మ మా నాత్మ నెంచె;
సర్వశక్తి యుతుఁడు, సర్వజ్ఞుఁడు, స్వతంత్రుఁ,–డచ్యుతుఁ, డఖిల కల్యాణ సుగుణి,
త్రిగుణరహితుఁడు, పూర్ణగుణి, హరి, యనంత–రూపి' సంపూర్ణుఁడు, పాపహారి,
సర్వోత్తముఁడు, సర్వసారధియు, సఖిలాం–తర్యామి, సర్వకర్త, పరమాత్మ;

గీ॥ చలన శక్తి తత్సంకల్ప జన్యమయ్యె; । జడగత త్రిగుణములను జ్వలితములయి,
వాని యందుండి జీవుల జ్ఞాన మంద । నుపకరించు మహత్తత్వ ముత్పతిల్లె.

తే॥ "తత్వ' మన: పదార్థము; మహత్తత్వమున బొ । డమె *'సహంకార తత్వ;' మిష్టము, వివేచ
నయును, తర్కము, నాలోచనయు నొసంగు । 'బుద్ధి' పుట్టె నహంకారమునను: పిదప

తే॥ "ఇంద్రియములు, మనస్సు, ప్రాకృత మగు పర ! మాణువులు, ప్రాకృతా కాశ (sky) మఖిల
దేవతల తనువులు నహంకార తత్వమందు । బుట్టె; వాయు వాయాకాశమున జనించె.

తే॥ "వాయ వున బుట్టి 'తేజస్సు' వఱగు వేడి । మియు, ప్రకాశమిచ్చి; 'జలము' దయము నందె
'తేజమున ; నీట బొడమె 'పృథ్వి' యను మన్ను; । దాన, నోషధు; లన్నంబు వాని వలన;

తే॥ "అన్నమున దేహమును బుట్టె; నది యుపకర । ణమును, క్షేత్రమునుగ సాధనమును చేయ
జీవునకు 'స్థూలదేహ'మై చెలఁగు; నిట్లు । సృష్టిని చతుర్ముఖ బ్రహ్మ చేయు చుండు.

వ॥ మోక్షార్హులైన జీవులలో మొదటిది 'రమ' ఆమెకు ముక్తి లభించినది. ఆమె పిదప మోక్షార్హుఁడగు జీవి చతుర్ముఖ బ్రహ్మ. ఇట్లు దేవుఁడు అధ్యక్షుఁడుగా నుండి ప్రకృతితో చరాచర ప్రపంచమును సృష్టించు చున్నాడు. ఒక హారము నందలి మణులకు సూత్రమెట్లాధారమో, అట్లే దేవుఁడు ఈ విశ్వమున కాధారము. అవ్యక్త రూపముతో ఈ జగత్తు నందంతటను భగవంతుఁడు వ్యాపించి యున్నాడు. 'విష్ణు' అనగా సర్వ వ్యాపి అని అర్థము.

"జ్ఞానము, భక్తి, కర్మ అను మాటలకు అర్థమేమి?" అని విజంభుఁడు కోరగా, గురువు లిట్లనిరి: "భగవన్మహిమను, మాహాత్మ్యమును తెలిసికొనుటయే "జ్ఞానము" ఖగోళ శాస్త్రము, రసాయన శాస్త్రము, భౌతిక శాస్త్రము మొదలైన అనేక శాస్త్రములు భగవంతుని మహిమను తెలిసికొనుటకు మానవుడు చేయు ప్రయత్నములు. అయన మహా మహిమాన్వి తుఁడని తెలిసికొని, ఆయనయే రక్షకుఁడు, ఆధారము అను విశ్వాసముతో, భగవంతుని యందు దృఢమైన స్నేహము కలిగి యుండుట "భక్తి" "కర్మ" యనగా పని. మానవుఁడు కర్మ చేయకుండ నుండ జాలడు ఈకర్మ భగవత్ప్రీత్యర్థమై చేయు చుండవలెను. అట్లు చేయ జాలని వారు కర్మ ఫలమును కోరకుండ నైనను కర్మ చేయ వలెను. వేదము లందలి పైపై అర్థము లను మాత్రమే గ్రహించి పుణ్య కర్మలు చేయువారు స్వర్గమును పొంది, ఆఫలము నశించగనే మరల పుట్టుదురు, స్వర్గమును

---

* మహత్తత్వము - Intellect; అహంకారము - Egoism; ఇష్టము, ఇచ్ఛ - will, వివేచన - Discrimination; తర్కము - Reasoning

కాంక్షించు వారు పుణ్య కర్మలు చేయవలెనని వేదములు చెప్పుచున్నవి కాని, తప్పని సరిగా పుణ్య కర్మలు చేయవలెనని ఆదేశించుట లేదు. అటి కర్మల వలన మోక్ష ప్రాప్తి కలుగదు. ఆస్తిక్య బుద్ధితో భగవంతుని భజించుచు, నిష్కామముగా పుణ్య కర్మలు చేయువారికి మోక్షము ప్రాప్తించును'

"మోక్షప్రాప్తికి నేను చేయవలసిన దేమి?" అన్న నికుంభుని ప్రశ్నకు గురువు లిట్లనిరి: "మోక్షప్రాప్తికి అనేక జన్మలు, పుట్టుకలు, చావులు కావలసి యుండును. భగవంతునే స్మరించుచు ఏకాగ్రతతో ధ్యానించుచు, విశేష భక్తితో భజించు చుండుము. అట్లు చేయుచో, నీవు స్వర్గ, నరకములను పొందక, మోక్షము నందగలవు. ఆయన యందే మనస్సును లగ్నము చేసి, స్థిరచిత్తముతో ఉపాసన చేయుము. ఈవిధముగా నీవు చేయజాలనిచో, భగవత్ప్రీత్యర్థమై కర్మలు చేయుము, నిష్కామముగా జ్ఞాన పూర్వక ధ్యానము చేయుము. జ్ఞాన మార్గము దేవతలకును, దేవతలనుబోలిన జనక మహారాజు, ప్రియవ్రతుడు మొదలైన నరోత్తములకును మాత్రమే సాధ్యము. మానవులకు కర్మ మార్గము యుక్తము. కావున, నీవు మేము చెప్పినట్లు కర్మ మార్గమును భక్తితో ననుసరింపుము. దానివలన జ్ఞానమును, దానివలన మోక్షమును కలుగును"

చ॥ అనియె నికుంభుఁ"డిట్టి బ్రదుకంతయు వ్యర్థమటంచు నెంచెదన్;
మనయెదుటన్ బ్రపంచము సమస్తము కొంత సుఖప్రదంబుగా
గనఁబడ, అసి నాస్తి యెఱుఁగన్ సమకూడని మోక్ష రక్తితో
కునియుచు, జీవితాగమము గూల్పగ నేల తదీప్సి తాసి తోన్?

క॥ "కలియన్ బ్రాణము గాలిని; । కలియన్ గద భూతపంచకంబున దేహం;
బిల తప్ప 'మోక్ష' మనునది । కలదే గురువరా? బూటకం బది యెల్లన్"

క॥ దేవుని గూర్చిన విషయము । లా వీర వరునకు దెలియ నాగమ వేత్తల్
వేవిధముల బోధింపగ. । 'దేవుండీ విశ్వమేలు ధీమతి యనుచున్;

క॥ జీవులలో గల భేదము । లీ విపులను గష్టములకు నెల్లన్ మూలం,
బీవిధి మార్పుకు కాలము । చావులు, పుటుకలు వలయు చాల నటంచున్;'

చ॥ తెలిసె నికుంభుఁ;డైన, మది తీరని సందియముల్ మధింపగా.
తెలిసియు, నేమియన్ సరిగ తేలని గట్టి సమస్య లాతనిన్
దొలచెను; బోధకుల్ తెలుపు త్రోవలు పూర్తిగ నచ్చవయ్యె నా
బలయుత మూర్తికిన్; తుదకు, భావమునందు సహించి యన్నిటిన్.

వ॥ ఆంధ్రపష్ణునకు నికుంభుడిట్లు మనవి చేసెను:

చ॥ "కలఁడొక డీశ్వరుండను జగద్భ్వజనాథుఁడు. విశ్వరక్షకుం,
డలఘుఁడు. మేలు చేయు ఘనుఁడంచును నెమ్మది నమ్మఁజాల; మీ
పలుకులు, వాక్యముల్, గురుల బోధనలున్ నను మార్చు; నైన, పే
రలుక వహించకుండ మనమందున, నే సహియింతు నెల్లరన్.

క॥ "దేవుఁడు లేకున్నను నొక । దేవుని సృష్టించు కొనుట తెలివి యనియు, న

త్యాగశక్యక మనియు, భువికి । నేవిధముల నేమ మనియు విదితము పదికిన్.

తే॥ "దేవుఁడున్నను, లేకున్న, భావమందు । 'దేవుఁడున్నాడు పాపుల తిమురడంప,
మంచి వారిని మన్నింపనంచు పౌరు । లెంచుటలు చాల మేలని యెఱిఁగి కాద.

క॥ "దేవుని నమ్మిన ప్రజ నే । నేవిధ కష్టముల బెట్ట నింక నరేంద్రా!
దేవాలయముల జోలికి । బోవను; కట్టింతు మఱల పూర్వాలయముల్

క॥ "అందఱ సమముగ జూతును; । కొందఱయీశ్వరులటంచు గొప్పగ జూడన్;
కొందఱు కారని యసహన । మందను; తక్కువగ జూడ నా ప్రజ నెపుడున్.

తే॥ "సమర మిఁక జేయ నితర దేశముల తోడ । నీశ్వరుని నమ్మరను నెపం బెదను కాని;
ఇంత యేటికి? నీయిష్ట మెఱిఁగి కాని । దండు వెడలను భూప! ఏధరణి పైకి.

ఉ॥ "కాన, ననున్ దయన్ విడిచి, గంగకు నుత్తర భూమి కంపి, నా
స్థానమునందు నిల్పు" మని, సాగిలి మ్రొక్కి, మఱిన్ మఱిన్ కడున్
దీనత వేడ, నాంధ్రపతి దీనునకున్ శరణిచ్చి పంపగా
మానస మందు నెంచె, ననుమానము జాఱిచి క్రింది స్థాయికిన్.

వ॥ అంతట ఆంధ్రవిష్ణు నికుంభునకిట్లనియె;

తే॥ "నీ నిరీశ్వరత్వమునకు నిజవసద్దు; । దాని నొరులపైన బలవంతముగ రుద్దు
ధోరణియు, నసహానమును దుష్ట బుద్ధు । లగుట, బంధించితి జనహితార్థినగుచు.

మ॥ "ఇపుడా ధోరణి మాప్పు కొంట విని, నాకెంతేని సంతృప్తి క
ల్గె; పదుంద్రెల్లెడ మాతుకీ వనివ మాడ్కిన్ నీవు వర్తించుచో;
ఇపుడే రాజుల కంపెదన్ కబురు నీకీయన్ పునః స్వేచ్ఛ; నా
నృపతుల్ పాల్గొనుటన్ రణంబువను విన్నిర్ణింప నోభూవరా!"

మ॥ తెలిపెన్ విష్ణువు తన్నికుంభు మనవుల్; "దీనాతి దీనంబుగా
పలికెన్ పల్కులు. చేసె బాస, లిఁక పూర్వం బట్లు దుర్బుద్ధితో
మెలగన్ దానని" వంచు భూపతులకున్; "మీ యిష్టమేమా" టటం
చిలనేతిల్ డెలుపన్, నికుంభునకు ప్రాప్తించెన్ విముక్త్యంతటన్.

ఆంధ్ర ఉద్యము

వ॥ ఓమ్మట కొంత కాలమునకు కొందఱు భూనాథులును ప్రజలును నికుంభుని పిమ్మటి వారి భావి సద్వర్తనమును గుఱించి యనుమానములు వెలి బుచ్చగా, నాంధ్రవిష్ణు విట్లనియె:

మ॥ "దరి గాంధారము పొంత క్రౌంచ గిరి మధ్యన్ బొల్చు శ్రీ శైలశై
లరి దేశంబున నుండి యుజ్జయిని దాఁకన్, దత్స్థలం బాదిగా
శరధిన్ దాఁకుచు నుత్కలోత్తరముగా శత్రుప్రజా సాధ్యమౌ
గురుకుడ్యంబును గట్టుదున్ మన మహా క్షోణీశతిన్ గావగన్"

తే॥ అనుచు నాంధ్రవిష్ణు వసఁగ నంద తెలమి । నంది; రంత శిల్ప విదుల కాసతియ,

దీవనల, హారతుల్ల పొంది, తీర్థయాత్ర । కట్టు-శ్రీగిరి కుడ్యంబు కట్టు కొఱకు.

తే॥ వివిధమగు చోటుల్ల మొదలు పెట్టి పనులు । వేల సంఖ్యగ కార్మికుల్ విధులొనర్ప,
పట్టెపని పూర్తి కిరువది వత్సరములు; । భయము తొలగెను దక్షిణ భరత భువికి.

మ॥ ధరణీపాలకుడాంధ్ర నాయకుడు గాంధారంబునన్ బొల్చు శ్రీ
గిరియొద్దన్ తొలిపెట్టి, ఉజ్జయినిలో 'క్షిప్రా' నదిన్ దాటున
ట్లరి దుర్భేద్యమ్ము [illegible] రక్షార్థంబు నిర్మించి, కా
పరులై యుండగ గౌరి మ్రొక్కె జగదంబా భీమకాళేశులన్.

తే॥ శ్రీగిరిని బొల్చు 'మల్లేశు,' నాగిరీశు । వెలది 'భ్రమరాంబ' నా యాంధ్రవిష్ణు పట్టులె
కోరె, కాపరులై యుండ కుడ్యమునకు । దర్శనము చేసి వారి గాంధారమునను.

వ॥ ఉజ్జయినిలోని జగదంబకు 'మహాకాళి'. భీమ కాళేశునకు 'మహాకాళేశు'డనియు నామములు కలవు.

ఉ॥ ఆపురి నుండి కట్టైన తడాంధ్ర పయోనిధి దాక గోడ శై
లోపమగా, 'మహేంద్రగిరి' కుత్తర మందలి 'స్వర్ణముప్రభా'
వ్యాపగ దాటి; గోదకిటు యామ్యమునన్ గల ఆంధ్ర దేశపుం
గాపుదలన్ సుదీర్ఘమగు కాలము కాంక్షయొనర్చి నెమ్మదిన్.

సీ॥ గాంధార దేశంపు గహ్వరీభృ త్శ్రేణి నుండి యాంధ్రోదధి యొద్దు వఱకు
కట్టిన గోడపై గజములు, తేరులు, నడచు విశాలంపు పెడము తనర;
భటనికాయంబుతో ప్రబలంబు లతిభయం- కరము లౌ వేలాది బురుజులొప్ప;
కుడ్యంపు పొంత నత్యంతిత ధైర్య వి-క్రాంత సైనిక శిబిరంబు లెసగ;

గీ॥ యామ్య భారత భూమి కుడ్యంబు కతన । దుర్జయము, దుర్గమమునయ్యె దూర్త శత్రు
వులకు, సూర్యుడు తిమిరాసురులకు నట్లు, । తెలుగు నౌకలు శత్రు నౌకలకు నట్లు.

సీ॥ ఈ బలంబులు కాక నెంతయు శక్తిపై-బలము లక్షౌహిణి నిలిచె వింట,
శ్రీకాకుళంబున, భీకరము, లరుల-గుండెలదరి దడగొనుచు జాల;
యుద్ధనౌకలు వేయి యుదధి లందున బొల్చె;-త్రవ్వోడ శ్రేణి తనరె నట్టి
జలధిగర్భంబులో తెలుగు రత్న స్వర్ణ-సంపదల్ రాజకోశముల నింప;

గీ॥ వర్తకపుటోడ లిరువేల వార్ధిదిరిగి, । చేరె 'యవకోటి,' 'రమ్యక' 'సిద్ధపురుల'
ఇతర పట్టణములు, లంకలెన్నొ యేని । రాకపోకల త్రోవలో దాకి సాగి,

సీ॥ "భ్రమరాంబ, మల్లనల్ 'బ్రాహ్వ' దేశము పొంత-శ్రీశైలమున నిల్చి చేవజూప,
భీమ కాళేశుడు భీమకాళియునుజ్జయినిలో నిల్చి రక్షణము చేయ,
ఆంధ్రనౌ కాదళం బాహవ సిద్ధమై-ఉత్కళ తీరాబ్ధి నుత్క్రమింప,
సర్వ సన్నద్ధమై సైన్యముల్ సర్వదా-కట్టుదిట్టంబుగా కాపుకాయ,

గీ॥ ఆంధ్రవిష్ణు వినిర్మితమైన కుడ్య । మఖిల శాత్రవ దుర్భేద్యమై చెలంగె
చెక్కు చెదరక వేయేడ్లు ఒక్క మీటి । రక్షణము గూర్చి దక్షిణ ప్రాంతమునకు.

తే॥ పిదప నెన్నఁడో 'చీనా' కు పెద్దముప్పు । వచ్చి నప్పుడు 'చీనా'కు పశ్చిమమున
గోడకట్టిరి మనగోడ జాడ వెంట; । మన వసుధ వారికెప్పుడు మార్గృక కద.

కం॥ ముప్పది దుర్జయ దుర్గము । లప్ప ట్టున మొనయఁజేసె నాంధ్ర నృపాలుం
డెప్పుడు పైఁ బడు మనపై । కుప్పించిన, చిదుక గొట్టు గొద్దల్ల టులన్.

తే॥ ఇట్లు రక్షణ సాధించి, ఎల్ల జనుల । సౌఖ్యమే లక్ష్యముగనేలె సౌమ్యమూర్తి
ఆంధ్రవిష్ణువు చిర కాల మవని తలము । తరతరమ్ముల జనులు సంతసము నొంద.

## ఆంధ్ర సామ్రాజ్య విస్తరణము

తే॥ ఆంధ్రకుద్యంపు దక్షిణ మాంధ్ర మయ్యె; ఆంధ్ర నాయకుఁడేక ఛత్రాధిపతిగ
నలరె నాకుద్య "లంక" పర్యంత సీమ; । వేద సంస్కృతి నిండుగా వెల్లి విరిసె.

వ॥ ఇట్లు "బాహ్లీక," సింధు, తదుత్తరమున కొంత ప్రాంతము, ఉజ్జయినీ రాజ్యము మున్నగు దేశము లన్నిటికి రక్షణము గూర్చి, సకలాంధ్ర నాయకుఁడైన ఆంధ్రవిష్ణు పరిపాలించునెడ, వాయువ్యమున "బాహ్లీ", "సింధు", "అవంతి", "మాళవ", "యదు", "హయహయా" ది దేశముల అధిపతులును, ఉత్తరము నందలి "వత్స", "సాళ్వ", "తూఙకవన", "మలద", "దక్షిణ కోసల" "కరూశ" రాజ్యముల అధిపతులును ఆంధ్రవిష్ణు సామంతులుగా నుండుట కిచ్చయించి, శ్రీకాకుళమున కేతెంచి, సామంతులుగా ప్రమాణమొనర్చి, రాజ్యలక్ష్మి దేవిని, ఆంధ్రవిష్ణుని ఉద్దేశించి

కం॥ "మీయిర్వురందు గాంచితి । మాయుర్విజ తద్గుణపుని గుణావళి; యిఁకమీ
రీ యాంధ్ర సర్వ భూమికి । శ్రేయద మగు నట్టులేలి చెందుడు కీర్తిన్."

వ॥ అని, సామంతులుగా మ్రొక్కి, సముచి తాదరణ మంది చనిరి. ఉజ్జయినీ వరపాలుఁడు సామంతుఁ డగుచు నిట్లనియె:

తే॥ "కడిగి నీకాళ్లు, శిరమున కంకణములు । జల్లు కొంటిన నీపెండ్లి సమయ మందు;
అపుడె మనమున సామంతుఁడైతి నీకు; । అల్లుడా! పూర్ణ సామంతుఁడైతి నిపుడు."

తే॥ అనుచు దీవించి యల్లుని నాత్మజాత । వరిగె; శ్రీకాకుళంబున నాత్మ గృహిణి.
తాను కొన్నాళ్లు గడపి, యాదరణ మంది, ఆంధ్రవిష్ణుని దక్షత కాత్మ పొంగ.

తే॥ మేనకోడలు "బిందుమతీ" నవోఢ ! పెండ్లి కుజ్జైని పురి కాంధ్రవిష్ణు వేగ,
వరుని తండ్రి కాశ్మీర భూవరుఁడు, మధుర, । వంగ, నేపాళ, కుషు, విదే, హాంగ, కాసి
పతులు, నుత్తర కోసల పతియు కోరి । రాంధ్రకుద్యము కాశ్మీర మనిలాడిశమ
గల మహేంద్రాద్రికిని పెంచవలెనటంచు; । ఆంధ్రవిష్ణియ కొని, గోడ నట్లు పెంచె.

హరివంగ పగర } ఆ రాజేంద్రు లచ్చటి ధవుఁలు, । ఆ రుద్రుదిశ నంతయు నృపులు,
చేరి రుపరాక్ష్మేణిని, వంగి । వీర వరాంధ్రవిష్ణు కెఱంగి

క॥ ఈ గోడ కాపుదలకు ఆంధ్రవిష్ణు మతికొం సైన్యమును ప్రత్యేకించెను.

## ఆంధ్రవిష్ణు పరిపాలన–ఆనాటిస్థితి

దూడలు కడుసార దుగ్ధ మానిన గావి–గోవుల పిదుకరు గొల్ల వాంధ్రు;

స్వంతదారులు తామె సస్యముల్ పండింతు-రిలదున్ని, చేసి తామెల్ల కృషిని;
కొలతలు, తూనికల్, విలువలు నికరమై-కలిగియు, మోసముల్ కలుగకుండె;
లోకకు ధాన్యంబు పెట్టెదమ్మిరి; ధరల్-చౌకగా నుండెను సర్వులకును;
గీ॥ కష్టపడి బుద్ధితోడను కాయములతో, । సోమరితనంబు కలనైన సోకనీక,
కొలుక పుట్టక చేసిరి కోటి పనులు । ఆంధ్రవిష్ణుని పాలన నఖిల జనులు.
సీ॥ తప్పుదు మార్గముల్, తప్పుదు చేష్టలు,-కల్తీలు లేని యంగడులు వెలసె;
బూటకంబులతోడి మాటలు పలుకక,-సూటిగా వ్యాపార శోభసాగె;
దైహిక, మానస దార్ఢ్యముల్, సత్యము-మోసరహితధనమూల మయ్యె;
తమ స్వీయశక్తిచే తనివి తీరగ జనుల్-సాధించి రేపుగా సంపదలను;
గీ॥ దేశ దేశాల సంపదల్ తెచ్చె నౌక, । లాంధ్రు లిల ధర్మ, సత్య, గుణాదిశీలు
రనెడు కీర్తిని సాధించి రవని నెల్ల; । న్యాయ మార్గంబు వర్తక ధ్యేయమయ్యె.
తే॥ న్యాయమనకును, నీతికి, నమ్మకమునకు, । సూటి మాటకు సౌశీల్య శుద్ధితకి,
పెట్టినది పేరుగా నాంధ్రవిపణి యొప్పె; । చేరుకొన కీర్తి, భాగ్యముల్ పేరు కతన.
వ॥ రకరకముల వస్తు విక్రేతలకు, రకరముల పారిశ్రామికులకు, వేరు సంఘము లుండెను. పిన్నలకు ఆయా వృత్తి విద్యలను, నైపుణిని నేర్పుట యేకాక, ఆయా సంఘము లందలి జనుల యొక్కయు వారి కుటుంబముల యొక్కయు సంక్షేమమును ఆసంఘములు పోషించి రక్షించుచుండెను. శాశ్వత దాన ధర్మములను చేయువారు భూదానమును గాని, ఈ సంఘములలో కొంత ధనమును నిలువ చేయుట గాని చేయుచుండిరి. ఆ నిలువ ధనము మీద నూటికి నెలకు ఒక శాతముగాని, ముప్పాతిక(3/4) శాతము గాని వడ్డీ పెరుగుచుండెను. ఆ వడ్డీతో శాశ్వత ధర్మకార్య నిర్వహణము జరుగు చుండెను. ఈవిషయమును బట్టి ఆ సంఘముల స్థైర్యము పరపతి చాల మిన్నగ నుండెనని బోధపడగలదు.

ఆ నాటి ముఖ్యమైన నాణెము పేరు 'పణము' ఒక పణ నాణెము, 3/4, 1/2, 1/4, 1/8, 1/16 పణ నాణెములు చెలామణిలో నుండెను. బంగారము, వెండి, రాగి, సీసము ఈ నాణెములు చేయుటకు ఉపయోగించ బడుచుండెను. ప్రతి గ్రామమునను
క॥ ఆ యూరి నిత్యపాలన, । మాయేటికి చేయ వలయు నభి వృద్ధ్యాదుల్,
ధ్యేయంబులు, యుక్తా చేర । జీయంబులు చర్చ చేసి నిర్ణయము గొనన్
తే॥ వయసు ముప్పది మీఱిన వారలెల్ల । యూరి పేరోలగంబున జేరుచుండి;
రెన్నుకొనుచుండి రూరు పాలించు పెద్ద । లైదుగుర నొక్క యేటి కుగాది నాడు.
తే॥ రెండు వర్షములకు తగు తిండి సరకు । లూరి పెద్ద లెప్పుడు నిల్వ యుంచ వలయు;
చోరగత వస్తు నష్టము లూరి రక్ష । కులు భరించ వలయు మూడు నెలలలోన
తే॥ సైనికులు, స్త్రీలు, వికలాంగు లైన వారు, । బాల, వృద్ధులు లేదను పన్ను లీయ
నవసరము లేదు; రాబడి యందు రెండు । వీసము లిడరు లీనలె విధిగ పన్ను.
సీ॥ వృద్ధకూదుర్లని గౌరవించుట విధి పిన్న-వాసని; కగ్రాల్ప వర్ణ భేద

ఖావము లానాఁడు లేవు జనంబుల;–సరివారు స్త్రీ జనుల్ పురుషులకును;
పరిణయ బంధంబు భగ్నమొనర్పిన–వారుగ్రశిక్షల పాలబడిరి;
దాన, ధర్మములు స్వర్గామ మార్గంబులు;–అంగీకృతమె యజ్ఞ మమరగతికి;

గీ॥ ఆస్తిలో భాగములు లేవు అత్రమంపు । బిడ్డలకు; జ్యేష్ఠునకు లేదు పెద్దవంతు;
భార్య, మగఁ డేకవర్ణము వారుకాని । యపుడు కూడ సుతున కన్ని హక్కు లుండె.

తే॥ తూర్పు, దక్షిణ, పరుణ పాథోధు లందు । నాంధ్ర నౌకలు పయనించె నవలి యొడ్డు
దేశములతోడ వాణిజ్య దీక్ష తోడ; । అమ్మ. కొనె. తెచ్చె సరకులు నమిత ధనము.

వ॥ ఇట్లు, తూర్పున బ్రహ్మ (బర్మ), మలయ, చంప, కాంభోజ, శ్రీషాంగు, సూర్య పుత్రాది రాజ్యములతోడను, ఆగ్నేయ, ప్రాచ్య సముద్రము లందలి లంకల తోడను, నేఁడు 'అమెరికా' యనెడు నాఁటి 'మయ' మున్నగు రాజ్యములతోడను. ఆ దిశలందలి అనేకము లగు ఇతర ప్రదేశ ములతోడను వర్తక వాణిజ్యములు నెఱపుట యేగాక పడమటి దెసను

తే॥ అసుర, యవన, మేచక, హిరణ్యాది సీమ, । అపుడె పుట్టిన పెక్కు శంఖాబ్ధి తీర
రాజ్యములు. దానవాదుల రాజ్యములును । నాంధ్రి వాణిజ్యమునకయ్యె నాట పట్లు

చ॥ తెలుఁగులు నాంధ్రులింక విడదీయగరాని ప్రజా సమూహమై,
తెలుఁగున కాంధ్రశబ్దమొక తెల్లపుటర్థము, నాంధ్రశబ్దలే
తెలుఁగను నర్థమబ్బె జగతీ తల మందలి వ్యావహారమం
దు; లవము లేదు భేద; మిది తుల్యమదానికి, దానికి ద్దియున్.

సీ॥ ఉత్త మోత్తమ పంది తోడ్దంటుఁడయ్యె బ్రా–తెలుఁగు, సంస్కృతముల, దేవభాష;
అగ్నిమిత్రాంధ్రేశు కర్క దేవుఁడు తొల్లి–తెలిపి దీవించిన దినము నుండి
ప్రజలు పల్వురు పల్క, పరిపక్వమై. వ్యాప్తి–బడసిన అంధ్రాఖ్య భాష యందు
పూర్ణ విజ్ఞానంబు పొంది, వ్యాకరణంబు–రచియించి విఖ్యాత ప్రౌఢి జూపె;

గీ॥ ఆంధ్ర కుడ్యంపు దక్షిణ మందు నాఁడు । తనను మించిన విజ్ఞాన ధనుఁడు లేడు
లేడ నెడు కీర్తిగనె నవలీల నాంధ్రి । విష్ణు పసమాన భారత విబుధ వరుఁడు.

తే॥ తెలుఁగు గీర్వాణ భాషలు కలసి పోయి । సంస్కృతము పుట్టెకద; యది సర్వ భరత
భూమి యందున నున్నతి పొంది. వ్యాప్తి । గనెను; వ్యవహార భాషయై ఘనత గాంచె.

తే॥ అఖిల విజ్ఞాన మా భాష యందు పెరిగె; । కాన, తప్పని సరిగ నద్దాని నభ్య
సించి రభివృద్ధి భువికి కాంక్షించు విజ్ఞు; । లంత, నది రాజ భాష యై యెసఁర జొచ్చె.

తే॥ ఆంధ్ర సీమల జనతతు లాది తెలుఁగు, । వేద భాష, 'కా' జన భాష, వివిధ మైన
అన్ని భాషలు గలసిన ఆంధ్ర భాష । పలుకు చుండిరి రాట్ప్రథములును, విండ్లు.

తే॥ నపుల దుమ్ములు చెలఁగెను నంది కొండ । మునమరావతిన్ గల అందమైన నుమించు
చిత్రముల యందు వలె; వాని చెలువు జూచి । అనుకరింపఁగ పలుసీమ లందు జనులు;

తే॥ కానబడు రైరి తిలకము లేని వరులు; । తెలుఁగు భువినుండి పయనించి బంధి మీఁద

తిలక ధారణ నీలనదీ తటంపు । పిన్న పెద్దల నాట్టి వెంపు నందె.

ఉ॥ అన్ని మతంబులన్ గలిపి యైక్యత గూర్ప ప్రయత్నమల్లెడన్
జన్నిన కారణంబున, నరల్, పలురీతుల సంప్రదింపులన్
మిన్నగ సాగి, తెల్గులను, మిశ్రజనంబుల, నిర్జరాదులం
దెన్నిక గన్న విష్ణు, శివు లెక్కువ గణ్యత పొందిరీ భువిన్.

సీ॥ తెగల దైవతములు తేలిరి సుతు లౌచు—వాహనంబులును, నాభరణములును,
నాయుధములు, పాన్పు లౌచు; స్త్రీ దేవతల్—వారి, హరులకు భార్యలైరి; పేర్ల
చేర్పులు శివునకు శ్రీధవునకు నబ్బె-వెవ్వేలు చోటుల విధవిధముల;
శివుండు రుద్రుండయ్యె; శ్రీలక్ష్మి రమ యయ్యె; ఇతిహాసముల మాఱ్పు లెసఁగె పెక్కు-

గీ। గణపతిగ మారె పిల్లారి; కన్యయైన । 'వల్లి' షణ్ముఖు భార్యయై పరగ జొచ్చె;
'మాయసీత' యనిరి దేవ మహిళ యైన । 'వేదవల్లి'ని, శ్రీకృష్ణు విభుని జేసి.

తే॥ వేనవేలుగ కథ లెన్నొ వెల్లి విరిసె. । వేదములకును ప్రాచీన విదిత కథల
కెంతయును భిన్నముగ; నన్ని బొంతకుట్టి । నట్లు కలిపి హిందూ మత మవతరించె.

తే॥ తెలుఁగు తనము, తెలుఁగు సంస్కృతియును నిండి । నట్టి సద్వేద సంస్కృతి యాంధ్ర భూమి
వెల్లి విరిసెను శశి పండువెన్నెలట్లు; । విమ్మతోఁటకు నీరెత్తి నింపినట్లు.

తే॥ తెలుఁగు విజ్ఞాన సంస్కృతుల్ తెలియబలుక, । వేద విజ్ఞాన సంస్కృతుల్ వెల్ల డింప,
నంపెను ప్రచార కౌఘంబు నాంధ్రవిష్ణు । బ్రహ్మ, చంపల, కర్కుజ రాజ్యమునకు.

వ॥ ఇట్లు పరిపాలన చక్కగ సాగుచుండ

## మలయా యుద్ధము-త్రిసముద్రాధి పత్యము.

తే॥ వర్తకులు కొందఱాంధ్ర భూపతిని దరసి, । మలయ రాజన్యుఁడాంధ్ర నౌకల 'సుమత్ర'
'మలయ' జలసంధి బోనీక కలత పెట్టు । చుండెనన, నాంధ్రవిష్ణుఁడత్యుగ్రుఁడగుచు

మ॥ కబురంపెన్ మలయేశు కిక్రియ యిఁక సాగన్ రాదు సుమ్మంచు; నా
కబురాతండు తిరస్కరింప, జనె సంగ్రామం బుకున్ నావికా
ది బలంబుల్ గొని యాంధ్ర విష్ణువు; బృహద్విఖ్యాత యుద్ధంబునం
దబలుండోటమి నందె నామలయుఁ డాంధ్రాధీశు బాణోద్ధతిన్.

చ॥ నలువది యాంధ్ర నౌకలు రణంబున పాల్గొని, శత్రు నౌకలన్
జలమున ముంచె ముక్కలుగ, శత్రుముఖంబులు దిక్కు దిక్కునన్;
మలయము నాంధ్ర సైనికులు మట్టొనరించుట కొంత సాగగా,
మలయ నరేశుఁడాలమును మానెను; వ్రాలెను విష్ణు నంఘ్రులన్.

మ॥ "'త్రిసముద్రాధిపు' లాంధ్రరాజ్య ధవు; లబ్ధిన్ తెల్గు నౌకల్ సదా
వసియించున్, పయనించు నిచ్చ మెయి; నెవ్వా రడ్డినన్, గ్రూరశా
శన శిక్షవశి కరు లౌదు" రనుచున్ జాటెన్ నృపుం డెల్లెడన్;

వసుధాధీశులు, భూజనుల్ నిరతముస్ పాటించిరా యాజ్ఞలన్;

తే॥ ఆంధ్ర నౌకల భద్రత కాంధ్ర విష్ణు ! డాంధ్ర మణి లంకలందున నమర జేసె
స్థావరము పై తిలోకాది దర్ప హరము; । ఆంధ్ర నౌకలు స్వేచ్ఛగా నబ్ధి దిరిగె.

తే॥ తూర్పు. దక్షిణ, వరుణ పాథోధులందు । వాని పటుశాఖ లందును నవలరేవు
యుద్ధ నౌకల, వణిజుల యోడగములు । నాంధ్ర పల్లెలు నడపి రాకాంతములను.

తే॥ ఆంధ్రరాష్ట్రవు లందున నాంధ్రు లంచు । భక్తి, గౌరవ, ప్రేమలు. భయము కలవ
ఆంధ్ర నౌకల నెవ్వరు నడ్డ రైరి; ! రెండు వేలేండ్లు రిటగె నీరీతి గాను.

సాగర చోరులు

ఉ॥ వారుణ నీరధిన్ గనలు పర్తక నౌకల కొల్ల గొట్టు చున్
చోరులు రేంగ, వారలను జూన్య మొనర్చెను పెక్కు రీతులన్;
తీరము వెంట, 'లక్ష', 'మల' దీవుల, చోరుల జట్టు స్థావరో
ద్వారము లుంచె; నిర్భయము వర్ధిలె నోడల వర్తకావళిన్.

కన్యాకుమారి

మ॥ ధరణీ చక్రము నేలి యేగిన మహాధాత్రీశులం దాఖ్యరీ
దరిత క్షోణిపు; లందు, నాంధ్రసలు (డు ద్భక్తిన్ సమర్పించె ము
క్కోటి-రత్న స్థగితో జ్వలంబు. ఘనశక్తి స్తోమనిక్షేప, వా
కర మాకర్షణ శక్తులన్నిటికి-శ్రీకన్యా కుమార్యంబకున్.

శా॥ ఆ యాకర్షణ శక్తి నోడ గమి కన్యాగ్రంబు దీకొంటి. ఏ
చాయన్ బోవగ లేక తల్లడిలుచో; తచ్ఛక్తికిన్ భీతులై
ఆ ఘూవ్యాంబుధి నోడలన్నియును కన్యాగ్రంబుకున్ దూరపున్
చాయన్ బోయెను. లంకజాటి; పలు వర్షంబుల్ జవన్, పిమ్మటన్

శా॥ ఈ యిబ్బందిని దీర్ప నాంధ్రి వసుధాధీశుండు సంకల్పియై,
ఈ యుద్దేశ జయంబుగాంచు పెటులం చెంతేని యోచించి, క
న్యాయోషామణి నాశ్రయించుటయె సన్మార్గంబు సుమ్మంచు, నా
ధీయుక్తుండెద నెంచి, యాత్రకరిగెన్ దేశన్ గనన్, ప్రమొక్కగన్.

తే॥ అరుగు త్రోవను సామంతు(డైన మధుర । నాథు నాతిథ్య మంది, కన్యాకుమారి
దర్శన మొనర్చి వచ్చి , తద్ధాత్రి వలదు । నంబ "మీనాక్షి" నర్చింతు ననుచు నుడివి,

క॥ కన్యాగ్రముమ జేరి, కన్యాకుమారీ దేవి ఆలయ ముందు

శా॥ ఆ తల్లిన్ దరిసించి, ఆంధ్ర విభు(డ భ్యర్థించె నా రత్న మిం
కా తత్వంబును జూపకుండ మన సంహారంబు గావింప; నం

---

ఆంధ్ర మణిలంకలు-Andamans and Nicobars

తూర్పు-Pacific Ocean ; దక్షిణ-Indian and Antartic oceans;వరుణ-Atlantc ocean

ప్రీతిన్ శాంతి నివేద నార్పణ, దేవీ శ్రేష్ఠ ఘంటీ కృతిన్
స్తుతి స్ఫూర్తిగ దెల్పి, కోరికలు దీర్చెన్ నావికుల్ పొంగగన్.

తే॥ సుళ్ళి వచ్చుచు దక్షిణ మధుర దేవ । రాజ్ఞి 'మీనాక్షి' దర్శించి, రామలింగ
విభుని రామేశ్వరంబున ప్రీతి గాంచి, । వేఱె నింటికి విష్ణువు చిత్తమలర.

## సముద్ర రత్నములు

మ॥ శుభ వార్తా న్నృపు జూడ వచ్చిరి సముద్రోద్యోగ బృందంబు; లం
దొక బుద్ధాగ్ని తిమార్ణవము వంతౌ ప్పున్ ప్రవాళంపు వే
దిక లంబున్ పరిశోధనా ఫలితమున్ దెల్పెన్, మహీశుండు ప్ర
వ్యక్తమున్ జేసెను నావికా దళముల్ బంపెన్ సహాయార్థమై.

తే॥ అచ్చరల పెదవుల బోలి యుంద మంతు । శోణకాంతుల చిమ్ముచు శోభ నింపె
త్రవ్వి తెచ్చిన పగడంపు రాశు లాంధ్ర । విష్ణు రత్న కోశమునందు విమతి బొంది.

మ॥ లవణాంభోనిధి గర్భ సంవసిత శైలశ్రేణి విక్షిప్తమై
అవనీభృత్చయ కందరాంతరములం దన్యుల్ గనన్ లేనిచో
ట్ల వెలుంగుల్ వెదజల్లు రత్నముల నీటన్ మున్గి తోడ్తెచ్చి, రా
ష్ట్రపు కోశంబున నింప నావికులు, విస్తారం బయెన్ సంప గల్,

తే॥ క్రయము పొందిరి రత్న వర్తకులు కొన్ని; । వివిధ దేశాల వానిని విక్రయించి,
ధనము, భాగ్యము దెచ్చి యాంధ్ర భువి నింపి । రాపగాతతి నింపు వర్షములు నిధివి.

## తమిళులు

చ॥ వరుణ మహాబ్ధి ప్రాగ్తటము వార్ధి మునుంగ, సహస్ర సంఖ్యలా
మరల సమీప భూవ్రజ సమూహము తెచ్చెను తెల్గునౌక లీ
భరత ధరిత్రి; కాంధ్ర వరపాలుఁడు విష్ణువు పాండ్య మిభూలో
స్థిరమగు వాసముల్ కలుగ జేసెను వారల; కిట్టు లుండగన్.

తే॥ వారి భాషయు, నాంధ్ర మా ప్రాంత మందు । గలసి, 'తమిళ' మయ్యెను; తజ్జములను నివట
వారు గలసి పోవ, జనించె పలు కులములు । 'తమిళు', 'అరవలు' నను పేర్ల తనర జొచ్చె.

తే॥ కాలగమన క్రమంబున చాల యేండ్ల । కగ్ర పంక్తుల వారగు నాంధ్రు లచట
తమిళ భాషను చేకొని తమిళులైరి; । 'అరవ' మని కూడ పేరందె నచటి భాష.

## వేద విజ్ఞాన. తెలుఁగు సంస్కృతుల ప్రచారము

వ॥ ఒకనాఁడు నాగ స్తంభుఁడు, సురసిహుఁడు, కచ్చ పార్ష్వుఁడు అను ఋషీంద్రులు మువ్వురు రాం
విష్ణుని దర్శించి

సీ॥ శీర్ష జటాజూట శిఖరముల్ చుట్టి కట్టిన కాలోరగముల బోల,
భ్రూకార్ముకాలనీ ముక్త దృగ్మార్గణ—దీప్తులు మస్తిష్క దీప్తి దెలుప,
భుజము తేన్గుల తొండముల బోలి వ్రేలాడ,—వక్షముల్ తలుపుల వలె నెసంగ,

తమ కాంతి మొఱయ కుందన మట్లు, పై రాగ్య-సాత్వికంబుల మహేశ్వరుని బోలి,
గీ॥ పగడముల బోలు పెదవుల నిగల మధ్య । నొప్పు కర్పూరమును బోలు సూక్తి చయము
బయలు వెడలగ సంస్కృతంపు వర్ష మట్లు. । విన్న వించిరి శ్రీ యాంధ్ర విష్ణు కిట్లు;
క॥ "'తెలుఁగు సముద్రపు తూర్పున । గలవు కదా శ్యామ, మలయ, కాంభోజాదుల్,
కలభ, భరణ. యవ, సుమధర. । బలి, సింహిక మున్నగు పలు వననిధి లంకల్
తే॥ "అచట వేద విజ్ఞానము, నాంధ్ర సంస్కృ । తియు నెలకొ, ను టవసరంబు, తిన్నసైన
కాంతి యుత సహ జీవన సరళి తెలియ; । కానిచో, వారు దిగుచుంద్రు కయ్యములకు.
తే॥ "చూచితిమి రెండు శకముల బూచి వాంధ్ర; । వేదముల, తెల్గు సంస్కృతిన్ కాదటంచు
పోరునకు దిగె నా నికుంభుఁడు; మఱయుఁడు । కాఱదుర్వ్యె తెలియ కవి; కాన విప్పుడు
తే॥ "నీవు మమ్మంపుచో, నేగి నేర్ప గలము । తెలుఁగు సంస్కృతి, వేదముల్; మెలఁగ జేతు
ము మన తోడ మైత్రి మనగ, కుముద చయము । లిందు నెడ మైత్రితో వికసించు నట్లు.
తే॥ "కుండలకు మట్టి యెట్టిదో దండనముల । లేని సహ జీవనంబులకీ నిగమము
లను, తెలుఁగు సంస్కృతియు మూలము నృపసింహ! । చిక్కగా పీలి వట వృద్ధి చేయువలయు.
తే॥ "శిలలలో పుట్టి పెరిగెడు చెట్లు శిలల । చీలికల బట్టి వంకరల్ చెందు నట్లు
తెలుఁగు సంస్కృతి, వేద సందీప్తి లేని । చోట్ల వంకర బుద్ధుల చోటు గనును,
తే॥ "గాలి యున్నను, లేకున్న. గదలు నట్టి । రావి యాకుల యట్టు లారాజ్యధవులు
గిల్లి తెత్తురు కయ్యాలుఁగొల్లలుగను, । సంస్కరింపక మానుచో సార్వ భౌమ!"
ఉ॥ నింగిని వ్రేలు మేఘముల నెమ్మిలు చూచి, ప్రహర్ష మంది, యు
ప్పొంగుచు, స్వీయ పింఛములు పూర్ణముగా వికసింప, నృత్యపుం
భంగిమ లందు లీనమయి వర్తిలునట్లు ముని ప్రతయోక్తులన్
బొంగ మనోబ్ధి, ఆంధ్ర నృపపుంగవు భావము లాడె నాట్యముల్
వ॥ అంతట నాంధ్రవిష్ణువు వారల కిట్లనియె:
క॥ "సూదంటురాయి యెట్టుల । సూదుల దనకంట లాగు చుండునొ, యటులే
సాదర మగు మీసూచన । లాదరణీయములు; పంపు దట్టుకె మిమ్మున్,
క॥ "పంపితిని 'ధర్మ' భూమికి, । 'చంపకు' రవి సుతుని రాజ్య జగతికి మును, గా
వింత ప్రచార మచట. వది । పెంపదెను, మెప్పు బడసె, విజయము గాంచెన్"
వ॥ అని, వివిధ దేశాధిపతుల కొక్కొకరికి ఆంధ్రవిష్ణువిట్లు సందేశముల నంపెను.
॥ వేదములను గ్రంథంబులు । మా దేశమునందు గలవు; మహనీయ బుధుల్
వేదజ్ఞానమును దెలిపి । మీ దేశవాసులకును మేలొదకూర్పన్
॥ వత్తురు ; వారికి దయతో నుత్తమ వసతులు. ప్రచార మొనరుచు పీఠన్,

భరణ-Borneo — ప్రాచీన 'రమణక' ; యవ-Java-ప్రాచీన 'యవ"-"ద ద్వీప;
సుమధర-sumatra —ప్రాచీన "స్వర్ణద్వీప

చిత్తము రంజిల, నోనృప ! సత్తమ సమకూర్చగదె ప్రజాహిత కాంక్షన్.

సీ॥ బలము, తేజము, మేలును గలిగె మాకు । వేద విజ్ఞాన కలన; నావిద్య తెలిగి
బాగు పడుదురు మీప్రజా ప్రజము లనుచు । పంపు చున్నాను ఋషుల నోవసుమతీశ!

చ॥ తెలుగుల పూర్వ సంస్కృతి ప్రదీపిత మయ్యెను వేద మిశ్రమై;
తెలుగుల నూత్న సంస్కృతిగ దిద్దు కొనెన్ దగురూప; మిప్పుడీ
పొలసిత సంస్కృతిన్ గలుపు పజ్ఞులు మీ; రిది వేదవిద్యతో
గలపి గ్రహిం). మావలెనె కాంచుడు మీరును భూరి ప్రౌఢిమల్

శా॥ ఆ సందేశములన్ గ్రహించి, నరనాథా నీక మంగీకృతిన్
జేసెన్ మౌనుల రాక. కొంద్రజన రాజీవార్కుం దర్శించిన;
ట్లా సీమల్ చవి చూడ జేసె మన ఆంధ్రామోఘ విజ్ఞాన; మా
ల్లాసంబంబర మంట, మౌని జన జాలంబున్ వినన్, జూడగన్.

తే॥ అలరి వార్తకు మతికొండ రాంధ్ర ఋషులు । ధరణి ధవు ధన్యనము జేసి, తాము కూడ
పెదల సంసిద్ధుల మటంచు వెల్లడింప, । పూర్ణిమను వార్ధి యట్టుల పొంగెనతడు.

తే॥ తెలుగు నౌకల పై నెక్కి తెలుగు కడలి । దాటి చేరి రౌకొక్కరు తాము చేర
విర్ణయంబైన చోట్లకు, విపులులైన । శిష్యులను గొని, సప్తఋషి వరులట్లు.

ఉ॥ స్వాగత మీయ వచ్చిరి ప్రజల్, ధరణీశులు, మంత్రులెల్ల నూ
త్నాగత మౌని వర్యులకు, హర్షము నక్కజ మాననంబులన్
మూగ, జయ ధ్వనుల్ గగనమున్ బలు మారులు ప్రక్కలింప, నా
భోగ ధనుల్ మునుల్ తెలుగు భూచరు లంఘ్రులు మో పనచ్చటన్.

సీ॥ ఆద్ర్యగ్రమును బోలు నసిత జటా జూట,—మర్కతేజస్వంత మాననంబు.
అమృతాంశు కిరణంబు లతి దృక్ప్రయములు,—కార్ముక సమములు కండ్ల బొమలు,
నయనముల్ తుమ్మెదల్, నాసిక కోటేరు,—శ్రీకార ద్వితయంబు చెవులు రెండు,
పవనాశనంబులు బాహుదండంబులు,—మేలిమి కనకంబు మేని ఛాయ,

గీ॥ కాగ, దండ కమండలుల్ కరము నందు, । వ్యాఘ్ర చర్మపు పిడిచుట్ట బాహుమూల
మునను, పాము కోళ్లిరు పాదములను జెలగ, । నడుగిడిరి మౌని లొక్కొక్కయవని మీద.

తే॥ కట్టి కాషాయ చేలము, వట్టి కందు । వానుకప్పు కొని, శరీర పరిసరముల
దివ్యతేజస్సు భాసింప దేజరిల్లె ! నుదయ గగనము బోలె నొక్కొక్క మౌని.

ఉ॥ మౌనుల రాజధాముల కమంద ప్రమోదము తోడ జేర్చి, స
న్మానము చేసి రంఘ్రుల పవంబుల క్షాళన జేసి, రాజులన్
రాణులు చల్లు కొంచవి శిరంబుల; కోరిన వెల్ల కూర్చిరా
మౌనుల కార్య సిద్ధి తమ మానస సీమల కాంక్ష చేయుచున్.

తే॥ ఇట్టు లాగ్నేయ సర్వ మహీతలంబు । లాంధ్ర సంస్కృతికయ్యెను నాలవట్లు

వేద విజ్ఞాన ఆహుతితో పెళ్లి విరిసి; జరిగె విస్తృత ప్రాగ్జ్యోతిషుల య.ద.

## ఆంధ్ర కేతనుఁడు, మేఘగంగ

వ॥ ఆంధ్రవిష్ణువుకు 'ఆంధ్ర కేతనుఁడు' అను కొమారుడు ఉదయించి, యువకుఁడై, యువరాజుగా పట్టాభిషిక్తుఁడయ్యెను. పిమ్మట

సీ॥ ఆంధ్ర విష్ణు కుమారుఁడాంధ్ర కేతన నాముఁ—డాంధ్ర వార్ధికవలి యంచు సీమ
నెఱఁగెడు 'భరత' దేశపు సుతను 'మేఘ-గంగ' ను బెండ్లాడె కనకదేహ;
ఆంధ్ర నౌకల మీఁద నాంధ్ర కతవిధి దాఁటి—'ఐరావతిన్' డిలియాడి వెడలి,
శ్రీకాకుళమతఁడు చేరగా కన్యతో—సపరివారఁబుగా, పర్వజనము

గీ॥ స్వాగత మొసంగిరా వధూవరుల కెలమి । 'కృష్ణ' సీరగా దరివి, కోకిలలు పోలె
జయజయ ధ్వాన మేళతాళ యుతముగ, మ । హోన్నతోత్సాహరవ మూప సుదకదములు.

తే॥ ఎఱ్ఱసీతను ముత్తైదు లేవు రచట । దిగతుడిచి మూఁడు పాటలు, దిష్టితీసి
రా వధూవరులకు; జనులంద అపుడు । వారిగాంచి దీవించి రాష్ట్రయుమగను.

తే॥ తవివి తీరఁగ పౌర సంతర్పణంబు । జరిగె మూణ్ణాళ్లు భక్ష్య భోజ్యముల తోడ;
పదియు నాలవ రోజుల పండుగకును । చెలఁగె సంతర్పణంబు పౌరులకు మరల.

ఉ॥ పంతత వారా వధూవరులు సౌఖ్యము, మోదము, సర్వ హృద్యముల్
స్వంతము చేసికొంచనుభవంబులు పొంది, మహేంద్రుఁడున్ శచీ
కాంతయు పోలె వర్ధిలుచు, కాపుర ముల్లర కింపు గూర్చె. నా
వంతయు భేదభావము హృదబ్జములన్ గినకుల్ల సిల్లగన్.

## ప్రతిష్ఠానము

॥ ఆంధ్ర సామ్రాజ్యంబునందొక భాగమై-వరలె ప్రతిష్ఠాన పురవరంబు
సహ్యపర్వత సీమ సామీప్యమున నొప్పు-గోదావరికి దక్షిణాది భువిని.
ఆ పురా ధీశుండు నాతని, సుతులను,-బాధింప జనులను పలువిధముల.
ఆంధ్రవిష్ణుని యొద్ద కాపురి పెద్దలు-వచ్చి, కోరిరి వారి బట్టి యుడిపి.

॥ క్రొత్త ఏలిక విందని; కొడుకు నంపె । నాంధ్రవిష్ణుఁడు కొంత సైన్యంబు తోడ;
ఘోరయుద్ధాంతమున ద్రుంచి క్రూరమతుల । ఆంధ్ర కేతనుఁడు జయము నందె పోర.

॥ అంతట నాంధ్ర విష్ణువు నిజాత్మజునిన్ యువరాజు మెచ్చి, యా
ప్రాంతపు సర్వకార్యముల బాధ్యత నాతని కిచ్చి, తత్పురం
బంతటి పశ్చిమాంధ్రమున కప్పటి నుండియు రాజధానిగా
నెంతు వటంచు జక్కి జనహృద్యముగా, నఖిలార్య తృప్తిగన్.

॥ నాఁటి నుండి ప్రతిష్ఠాన నగర వరము । ఆంధ్ర యువరాజధానియై యశము గాంచె;
ఆంధ్రయువనృపుల్ పశ్చిమాంధ్రా వనులను । పాలన మొనర్చిరాపుర వరము నుండి,

॥ వారి తీర్పులపై నాంధ్ర వసుమతీశుఁ । డిచ్చు చుండెను పై తీర్పు పెళ్ల నారసి;

ఎడతెగక చాల నూఱుల యేడు లిట్లు । జరిగె, శాతవాహన పాలనంబు దాఁటి.

వ॥ ఆ ఎఱ్ఱిమాంధ్రమున ప్రతిష్ఠాన, నాసిక, వనవాస, కొంకణ, కుంతలాది రాజ్యములుండెను. పూర్వము

తే॥ తెన్ దిశకు తెల్గు లేశ్వరి స్థిరము పడిన । నాఁడు, నేపాళ మ్మంపలి నామములను
నది 'గోదావరి'కి, 'ప్రతిష్ఠానము' నకు । ను'నమరావతి'కి మృదలు గవి రెద్దలను.

తే॥ తెలుఁగు లాంధ్రులు నెల్లరు గలసి పోయి । యైక్యమైనప్పు డిఁకయెల్ల నాంధ్ర రాజ్య
ముల నిమిడి యుత్తరపుతిలగాంచె, మున్నొకప్పు । డల్ల నేపాళ మున గన్న యుత్కము మించి.

## కంచి కామాక్షీదేవి అర్చకత్వము

వ॥ ఇట్లు వత్సరములు సాగుచుండ,

శా॥ శ్రీమంతుల్ మహితాంధ్ర గిజాతి జనులౌ 'చెంచులే' మహాభక్తితో
'కామాక్షిన్' భజియించుచుండి, రిరవై 'కంచిన్' సమీపస్థలిన్;
భామల్ చెంచెత లర్చకుల్ గురుల దుర్త్రాంతంబునం; దట్టిపో
భీమా ఖ్యుండగు చెంచురాజు కొనె దేవీపూజ హస్తంబులన్.

తే॥ చెంచు పెద్దల మాటలు చెవిన బెట్ట । కతఁడు వర్తింప, తారేగి ఆంధ్రవిష్ణు
నాయసాంప్రదాయము నీఁక నాపిపైచి । పూర్వ పద్ధతిని నెల కొల్పదలచి కోరి.

వ॥ మఱియు, నిట్లనిరి "దేవా: స్త్రీ దేవతల కర్చకులుగా స్త్రీలు పూజాదుల తొనర్చుట మా సాంప్రదాయము. ఆంధ్ర రాజ్యమునందలి 'శల్ల మలల' నుండి 'జయ్యాలు' కొండల పక్షకును, తూర్పున తెలుఁగు కడలి వఱకును గల సీమలో ఆంధ్రుల మగు మేము వేల యేండ్లుగా నివసించుచు, నీ యాచారమును మొదటినుండియు పాటించుచుండగా, మా చెంచు రాజు అలిశివి, పూర్వార్చకులను తొలగించి తానే పూజాదులను నిర్వహించుచున్నాడు. ఇది అన్యాయము. అధర్మము. పూర్వాచారమును, పునరుద్ధరింప జేయు"దనిన

తే॥ ఆంధ్రవిష్ణువు చెంచు నాయకుని పిల్చి; "సాంప్రదాయ విరుద్ధమౌ వర్యలింక
గిట్టి పెట్టుము; ప్రజలకు గిట్ట వన్వే" । యనిన నీతుకొనె భయము నంది యతఁడు.

తే॥ కంచి కామాక్షి పునరర్చకత్వమిట్లు । దక్కె చెంచు వనితలకు ధరణిపాలు
దయను; గట్టున బడిన మత్స్యములు మఱల । నద్ధి జొరినట్లు చెంచులు హర్ష మంద.

## జంగములు

మ॥ సరయూ తీరము నుండి వచ్చి యిట వాసంబున్న వారెల్లరున్
నిరతస్నేహము బూనిరిచ్చట నివాసీకంబులో; సీగతిన్
జరుగన్ బెక్కుడు వత్సరంబులు, శివున్ జంగంబు లర్చించుచో
సరయూవాసులు కూడ పాల్గొనిరి తత్సర్వజ్ఞు సేవా తతిన్.

వ॥ ఇట్లుండ, నొక్కయూర

మ॥ ఒక మాసంబున జంగముల్ దమ పర్వకాలోల్లాసులై యేగుచున్
సకలజ్ఞున్ బ్రతినిత్యమున్ గొలువ నాచార ప్రకారంబు. వా

రికి దేవాలయ మప్పగించి చని, యూరిన్ జేరి జూసాంతమున్
"దీక్ష మాకిం"డని రాగుడిన్ మఠుల; వారిక "పో, పొం" డనన్
ఆంధ్రవిష్ణు కడను ఫిర్యాదు చేసి । తపుడు జంగము; లిర్వుర నతఁడు పిలిచి,
ఆలకించి సమస్తము, నాలయమ్ము । జంగముల కీయఁ దని చెప్పె జన ధవుండు
వినక, ధూర్తులు సంగ్రామమునకు దిగిన । నమ్మడిగ నూరు వెడలించె నుగ్రుఁడగుచు;
పంపెవారిని తుంగ తవ్వలకు, శక్తి । నర్చనము చేయు ప్రాంతములందు బ్రదుక.

## ఆంధ్రనాయకుని విగ్రహ ప్రతిష్ఠ

శారద పూర్ణిమా నిశల చంద్రుఁడు భూ గగనంబు తేలు న
ట్లా రమణీయ శౌర్యనిధి యాంధ్ర మహీతలమేలె, తత్ప్రజా
వారము లుల్లసిల్ల కలువల్ వికసించిన మాడ్కి; భూపతుల్
తారల భంగి గొల్వ; వసుధన్ బ్రవహింపగ కీర్తి కౌముదుల్.
గుణ, రూపంబుల, సుప్రతాపమున, వాక్యోతన్, మహోపాయచ
ర్వణ మందున్ భువి సాటి లేని వసుధా కాంతేంద్రుఁడా విష్ణుదవ
ర్ణమై రాజిలె భూప్రజా సుఖముకున్; రాజ్ఞీమహా దేవియున్
గుణ వాగ్వర్తన రూపసంపద సతీకోటీరమై శోభిలెన్.
కావున విష్ణుగ, లక్ష్మిగ । భావించిరి ప్రజలు వారి; భక్త్యున్నతితో
సేవించిరి దీర్ఘ సకల । జీవిత గంగా ప్రవాహ సింధువు వలెకున్.
ఆంధ్రవిష్ణుని ఏబది నాలుగవ యేటి పాలన కాలమున నొకనాఁడు రాజవరేణ్యుఁడును, రాజ్యలక్ష్మి దేవియు కుమారుఁడగు ఆంధ్రకేతనునితో నిట్లనిరి;
"తరుణము దగ్గలించె వసుధాతలమున్ విడి యేగ మాకు, భూ
భరమును నీభుజద్వయము పైనిడి; ఎట్టుల బ్రోతువో ప్రజన్,
పరనృప శాసకుండవయి ప్రాప్తమహాంధ్రము నెట్లు కాతువో,
వర తనయా! యశో, జయ, శుభంబులు నిత్యము నీకు గల్గుతన్.
అని దీవించిరి, ఇట్లు
ఏలె నృపాలుఁడాంధ్ర భువి నేబది నాలుగు హాయనంబు లీ
లీల; రుజల్, వ్యథార్తి, తతి, లేమియు, క్షామము, ఈతి బాధలా
కాలము నంద దృశ్యమయి, కాశ్యపి కాంచెను హాయి; రాజ్యల
క్ష్మీలలనా సమేతుఁడయి మింటికి జేరె నృపాలుఁ డంతటన్.
అక్కడి విష్ణులోకమున నామియు నాతఁడు లక్ష్మి విష్ణులై;
రిక్కడి యాంధ్ర లోకము సహింపగరాని మహత్తరార్తయై
బ్రుక్కఁగ, నాంధ్ర విష్ణువు మహీస్థలి వీడె నటంచు; దేశమే
యిక్కటు లొందకుండ నన నీతని యాత్మజుఁ డేలె రాజ్యమున్.

క॥ 3. శ్రీకాకుళము. ఆంధ్రవిష్ణుల నిర్యాణానంతరమున

తే॥ ఆతఁడు విష్ణువు, లక్ష్మియే యాతని యనుచు । నాలయము గట్టి, ద్వయమూర్తిగా ప్రతిష్ఠ
జరిపి, పూజించి రాంధ్రరాజ్యములు ప్రజలు । అవిలు దిశమండి యాత్ర శ్రీకాకుళము పఱచు.

తే॥ ఇతర దేశములందు లేదీశ్వరుండు । 'ఆంధ్రనాయకు'డను పేర నాంధ్రమందె
వెలసె శ్రీకాకుళంబున విష్ణుమూర్తి । అనుచు పొగడగ సర్వకాశ్యపిజనంబు.

పిమ్మటి కథ

వ॥ ఆంధ్రకేతనుని పిమ్మట ఆతని సంతతి వారనేక శతాబ్దములు రాజ్యపాలన మొనర్చిరి. వా 'శ్రీముఖ శాతవాహనుఁడు' మౌర్యచక్రవర్తుల విజృంభ ణానంతరమున మగధను జయించి ఆంధ్రసామ్రాజ్యమును పునఃస్థాపించి, శ్రీకాకుళము నుండి 'అమరావతి'కి రాజధాని మార్చె 'శ్రీధన్యకటకము'అను 'ధరణికోట' నాఁటి అమరావతిలో భాగమై యుండెను. ఎందరెందరో ఆ మహాపురుషులు ప్రభవించి, ఆంధ్రుల యశస్సును భూనభోంత రాళముల వ్యాపింప జేసిరి. వా

నాగార్జునుఁడు

సీ॥ ప్రభవించె బుద్ధుని పదు నాలుగవ యవ–తారమ్ముగా నాంధ్ర ధాత్రియందు;
బహుజనా మోదిత బౌద్ధమహాయాన–పక్షిని స్థాపించె ప్రజ్ఞమెఱయ;
'బౌద్ధపద్యాంసుల బ్రశ్నలచే గెల్చు–సార్వభౌమ 'మిళింను' జక్కపఱచె;
'శ్రీపర్వతము' తన స్థిర నివాసంబుగా–మలచి, లోకము బౌద్ధమయము జేసె;

గీ॥ 'స్నేహలేఖ'ను శ్రీముఖ నృపతికనిపె । రాజనీతి రహస్యముల్ వ్రాసి యందు;
ఆంధ్రములంటి కొలువ 'కనిష్కా'ది రాజు । లలరె నాగార్జునుఁడు సహస్రాంశు వోలె.

ఇతర ఆంధ్ర మహాపురుషులు

సీ॥ అమర భాషాకోశ సుమకదంబం బల్లె–నమర బూజ నమానుఁ'డమరసింహుఁ;'
డాగమ, బ్రాహ్మణ సాగర మథనుఁ'డా–పస్తంభ'ముని సూత్రపాళి వ్రాసె;
రాజనీతి వివేక ప్రజ్ఞా గభీరుండు–"చాణక్యుఁ"డర్థ శాస్త్రము రచించె:
తర్క–శాస్త్రోన్నతదా శ్రీధ్రశృంగ ప్ర–స్థముల 'దిఙ్నాగుండు' సంచరించె;

గీ॥ 'సప్తశతి'యను గాథారచన మొనర్చె । 'శాలివాహనుఁ'డను పేరి 'హాల' నృపతి;
అట్టి ధన్యుల గనె మన యాంధ్ర మాత–సాటి లేనట్టి మేటి విజ్ఞాన ధనుల,

తే॥ మంచి పాలన కఱవైన మగధనుండి । త్రోలి దుష్టాత్ములను, సదుద్యోగ వితతి
నిలిపి, యట వరాజకమును నులిమివైచె । శాతవాహన 'శ్రీముఖ' చక్రవర్తి

సీ॥ అంకురార్పణ చేసె నాంధ్ర సామ్రాజ్యంబు–నకు శ్రీముఖక్షమా నాథుఁడిట్లు,
ఉజ్జైని విక్రము యుద్ధపుంబిలు పంపి–'హాలుఁడు' శకకర్తయై తనర్చె :
నేపాళమును, ప్రాంత నీహారగిరి నాంధ్ర–మున "మంజుసిరి" చేర్చి ఘనత గాంచె;
సింహళో, ఙ్జయిని, నాసిక, కళింగల, "గౌత–మీపుత్ర," "పులమావు," లేపు చూపి,

గీ॥ కఖిల శూరుల జయన్నించె నాంధ్ర నౌక; । లాంధ్రవాణిజ్య మలరె ఖండాంతరముల; ।